ఉత్తేజంగా,
ఊ పేసాలా
టిప్స్
అండ్
టోస్

కొత్తగా
ప్రత్యేకమైన
ఛాయలు




ఆ ఉత్తేజం కోసం అలంకరించు కోండి...కొత్త ఛాయలు – పేస్టల్ మరియు డార్క్ ఛాయలనుండి ఎంచుకోండి...మీ టిప్స్ అండ్ టోస్ కిట్‌లో చేర్చుకోండి.

మీరు మెచ్చి తీరే కొన్ని :
నం. 38 ఆటమ్ సాంగ్
నం. 39 టిప్సీ బ్రౌన్
నం 43 పింక్ స్కాండల్
నం. 44 కూల్ ఐసికిల్
నం. 45 సిల్క్ ఎన్ సిల్వర్
ప్లెయిన్ మరియు పెరల్

ఛాయలలో...మురిసిపోవాల్సిన మంచి రోజులు ఎన్నో ముందున్నాయిగనక లేవండి, మీకు దగ్గరలోగల దుకాణానికి బయలుదేరండి వీటికోసం.

ఇంకా : లనోలిన్ సమృద్ధిగాగల టిప్స్ అండ్ టోస్ నెయిల్ లస్టర్ రిమూవర్ కూడా దొరుకుతుంది.

## టిప్స్ అండ్ టోస్
## గోళ్ళకు మెరుపు
## గోళ్ళకు మేకప్

టిప్స్ అండ్ టోస్ వారి నుండి చిట్కాలయొక్క ఉచితపుస్తకం కోసం మీ డీలర్ని అడగండి. సరుకున్నంతవరకే మరి.

everest/79/SH/212-11

ఎల్లప్పుడు మంచిరుచి
వరసమైన ధరగల,
జయ కాఫీ పొడినేవాడండి.

జయ కాఫీ వర్క్సు
కోటగిరి-503 207.
తా॥ బోధన్, జి॥ నిజామాబాద్.

# కేశ సంపదకు

# రీటా




స్త్రీలూ పురుషులూ వాడవచ్చును * సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది



### తాగుడు లెక్క!

సెప్టెంబర్ 'వనిత'లోని 'సిగరెట్ల లెక్క' చదివాక నాకు అలాంటిదే మరో లెక్క జ్ఞాపకం వచ్చింది.

బాగా తప్పత్రాగి బార్ నుండి తన కోటు రెండు జేబుల్లోనూ రెండు బ్రాందీ సీసాలు పెట్టుకుని మెట్లు దిగుతున్న ఒక పెద్ద మనిషిని ఒక క్రైస్తవ ఫాదర్ అడిగాడట 'నాయనా! ఎన్ని రూపాయల సారా త్రాగా'వని. అతను ఫాదర్‌గారిని క్రింద నుంచి పైవరకూ చూసి మర్యాదగా "అయిదు వందలది మాత్రం త్రాగా'నని జవాబు చెప్పాడట. ఈ జవాబుకి ఫాదర్ అదరిపడి "బాబూ ఇలా ఎంతకాలంగా త్రాగుతున్నావు" అని అడిగాడట! 'యాభై సంవత్సరాలుగా త్రాగుతున్నా'నని టక్కున జవాబిచ్చాడతను. ఫాదర్‌కి మూర్ఛవచ్చినంత పనై తనలో తాను లెక్క వేసుకున్నాడు. రోజుకు ఐదు వందల రూపాయలు చొప్పున నెలను పదిహేను వేలు. సంవత్సరానికి ఒక లక్ష యనభై వేలు, యాభై సంవత్సరాల్లో తొంభై లక్షల రూపాయలు! ఫాదర్‌గారికి చెమటలు పట్టాయి. అతని దగ్గరకు నింపాదిగా వచ్చి ఎదురుగా వున్న ఒక ఇరవై అంతస్తుల మేడను చూపిస్తూ 'ఈ అలవాటే లేకపోతే దీనికై నీవు ఖర్చుపెట్టిన డబ్బుతో ఆ మేడ కొని వుండవచ్చుకదా?' అని అడిగాడట. దానితో ఆ పెద్ద మనిషికి కాస్త నిషా తగ్గింది. సూటిగా ఫాదర్ కళ్ళలోకి చూస్తూ 'మీకు త్రాగుడు అలవాటు వుందా ఫాదర్?' అని అడిగాడట. లేదని తెలుసుకుని 'అయితే ఆ మేడ మీదా ఫాదర్?' అని అడిగాడట. కాదని తెలుసుకుని 'ఆ మేడ నాదే ఫాదర్!' అని చెప్పి తన దారిన తను చక్కాపోయాడట!!

నగ్మాన మద్రాసు

### 'శీలరక్షణి'లను నిషేధించాలి!

మగువకు మానం ప్రాణం కంటె ఎక్కువన్నది నిజమే. అది కాపాడుకోవడంలో ఆడది ఒక్కొక్కసారి ఆదిశక్తిగా కూడా మారుతుంది. తన శక్తి ఉపయోగపడని క్షణంలో ప్రాణమైనా విడుస్తుంది కాని తన మానాన్ని కోల్పోదు. అలాంటి స్త్రీకి 'శీలరక్షణి'లాంటి బెల్టులు అనవసరం. భర్తను మనస్ఫూర్తిగా ప్రేమించే యువతి తన శీలాన్ని వేరే ఎవరికో అర్పిస్తుందని భర్త భావించడం అతని వ్యక్తిత్వ లోపమే. బలమైన తాళాలతో బంధించిన బ్యాంకుల లాకర్‌లను తెరిచే దోపిడీదారులకు ఈ శీలరక్షణి బెల్టులు ఏపాటి?

మా చిన్నప్పుడు మా అమ్మమ్మ రజాకార్ల తిరుగుబాటు రోజుల్లో స్త్రీలు ఉపయోగించే 'శీలరక్షణి' బెల్టుల గురించి చెబుతూ చిన్నపిల్లలను 'బంగారు బిళ్ళ చేయించాలటే మీకు!' అంటూ హాస్యమాడేది. వినోదంగా వినే వాళ్ళమేకాని ఆ వినోదమే ప్రమదల పాలిట శిక్షగా పరిణమిస్తుందని భావించలేదు, వైజ్ఞానికంగా ముందడుగు వేసిన దేశాల్లోనే స్త్రీలను ఇలా అవమానిస్తున్నారంటే భరింపరాని విషయమే.

నేడు సమాజంలో స్త్రీలు ఎంతో ముందంజ వేస్తున్నారు – స్త్రీకి అన్నివిధాల స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తున్నట్టే ప్రకటిస్తూ ఇలాంటి అవరోధాలు ఎందుకు కల్పిస్తున్నట్లు? ఇలాంటి 'శీలరక్షణి' బెల్టులవల్ల స్త్రీలను మానసికంగా, శారీరకంగా బాధించడం తప్పితే ఇంకేమీలేదు రక్షణ కల్పించాలంటే ఎన్నో పద్ధతులున్నాయి. కరాటే శిక్షణ లాంటివి స్త్రీలకు రక్షణ నిస్తున్నాయి. స్త్రీలను అవమానించే ఈ 'శీలరక్షణి' బెల్టులను రద్దు చేయాలి. వాటి తయారీని నిషేధించాలి.

దేవులపల్లి శిరీష వికారాబాదు

### ధరలు తగ్గేలా చూడాలి!

నిత్యావసర వస్తువుల ధరలు నానాటికి పెరిగిపోతున్నాయి. అడ్డూ అదుపు లేకుండా పెరిగిపోతున్న ఈ ధరల గురించి ప్రస్తావన వచ్చినప్పుడల్లా ప్రభుత్వం వ్యాపారస్తులనూ, వ్యాపారస్తులు ప్రభుత్వ పన్నుల విధానాన్నీ దుయ్యబడుతూనే వున్నారు. అంతేకానీ యిద్దరూ ధరలు తగ్గే మార్గం గురించి ఆలోచించడం లేదు.

అందుకే అభ్యర్థనలతో లాభం లేదని నిశ్చయించుకున్న హైద్రాబాద్ అభ్యుదయ మహిళా సమాఖ్యకి చెందిన దాదాపు పదిహేనువందల మంది వనితలు కోఠీలోని ఫిరోజ్‌షా గాంధీపార్కు నుంచి సచివాలయానికి సెప్టెంబరు 5న ఊరేగింపుగా బయల్దేరి వెళ్ళారు. అక్కడ జరిగిన బహిరంగ సభలో ధరల పెరుగుదలను నిరసిస్తూ ఎగుమతులని నిషేధించాలనీ, నూనె, వంటగ్యాస్, కిరోసిన్ ధరలు తగ్గించాలని కోరారు.

జంట నగరంలో ఈ విధమైన ఊరేగింపు జరపడం అదే ప్రథమం కావడంతో పురజనులలో కుతూహలాన్ని రేకెత్తించి చర్చనీయాంశమైంది. గృహిణులు జరిపిన ఈ ఊరేగింపు పలువురి ప్రశంసలు అందుకుంది. అయితే వినతి పత్రం సమర్పించడంతో వూరుకోక వనితలు ధరల తగ్గేదాకా తమ పోరాటం సాగించాలి. ఇతర పట్టణాలు, గ్రామాలలోని వనితలు కూడా ముందంజ వేయాలి. అప్పుడే ఈ ఉద్యమానికి ఒక అర్థం అంటూ ఏర్పడుతుంది.

డి. సరోజా రామయ్య హైద్రాబాదు

### హద్దులన్నీ స్త్రీలకేనా?

మీ వ్యాసం 'శీలరక్షిణి' చదువుతూంటే మగవాడి అమానుషత్వానికి ఆనాటికీ, ఈనాటికీ, ఇక ఏనాటికీ


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 5 సంచిక: 5

నవంబరు: 1979

విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥చందా: ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)

మలేసియా: 90 సెంట్స్

చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026

జనవరి (80) నుంచి–
'అభిప్రాయాలు' శీర్షికలో
ప్రచురింపబడే లేఖలకు ఇచ్చే
పారితోషికంలో పెంపు:
ఇప్పుడు ఇస్తున్నది ఐదు రూపాయలు
జనవరి (80) నుంచి
ఈ శీర్షికలో వచ్చే ప్రతి లేఖకూ
పారితోషికం పదిరూపాయలు

'ముగింపు' లేదా అన్పిస్తుంది. భార్యల శీలాన్ని రక్షించటానికి అన్ని కట్టుదిట్టాలు చేసే మగవాళ్ళు ఎంతమంది మనసా, వాచా శుద్ధంగా ఉంటున్నారు? ఎంతటి తిరుగుమోతునైనా సహించాల్సిందే తప్ప తానుగా ఆడది ఏ 'బెల్టు' తయారు చేయగలదు? అసలు 'శీలం' (chastity) అన్నది ఆడదానికి మాత్రమే ఎందుకు వర్తించాలి? మనిషన్న ప్రతి ఒక్కరికీ సత్ప్రవర్తన, సత్శీలము అవసరమే కదా. తరతరాలుగా బలం పుంజుకొన్న అధికారదాహం స్త్రీని అణచివెయాలనే చూస్తూందెప్పటికప్పుడు. ఎంతటి ఉత్తమోత్తమ పురుషపుంగవుడైనా భార్యదాక వస్తే కట్టుబాట్లకి బానిసే. ఇనుప సంకెళ్ళలాంటి బంధనలు విధించటానికి తయారే. 'ఆడది హద్దులో ఉండాల'ని శాసిస్తారు. ఆ హద్దులేవో వాళ్ళకెందుకు లేవు? ఆ చట్టాలు వాళ్ళకెందుకు పని చేయవు? ఆడది పవిత్రంగా ఉండాలని మగవాడెలా కోరుకుంటాడో, స్త్రీ కూడా మగవాడలా ఉండాలని కోరుకోటంలో తప్పుందా? నానా తిరుగుళ్ళూ తిర్గి పెళ్ళాన్ని గేదెని బాదినట్టు బాది చిత్రహింసలకి గురిచేసే వాళ్ళెంతమంది లేరు మన సమాజంలో? మగవాడి దర్పం బుసలకి ఆడది సహనం.... ఓర్పు క్షమాగుణం.... త్యాగనిరతి (ఒక్కటేంటి) లాంటివి చూపి 'ఉత్తమ ఇల్లాలు' 'పతివ్రతా శిరోమణి' లాంటి బోర్డులు కట్టుకొని విలసిల్లాలి. అదే ఆడదాన్ని 'కులట' 'పతిత' లాంటి ముద్దు పేర్లతో సంస్కరించటానికి సమాజం ఎప్పటికప్పుడు సంసిద్ధం అవుతూంటుంది. 'చేస్టిటీ బెల్టు' తతంగం మన దేశానికి దిగుమతి కాలేదని మురిసిపోనక్కర్లేదు. అంతకన్నా ఘోరకృత్యాలు చేసే కిరాతకులు.... దానికి బలి అయిపోతూన్న ఆడవాళ్ళు ఎంతోమందున్నారు మన చుట్టూ. మగవాడి ఆంతర్యంలో మార్పు రానంతవరకూ మరెన్ని హక్కులు కేటాయించినా.... ఆడవాళ్ళకి మిగిలేవి శూన్యదృక్కులే. 'చేస్టిటీ'కే ఓ బెల్టు తగిలించేసే అనవసరమైన అధికారం బావాలి మగవాళ్ళల్లో. కేవలం ఆడదానికే పరిమితం అయే శీలానికి అర్థమే లేదు. సహజీవన సమాగమంలో ఆడ, మగ ఒకరి అభిప్రాయాలని ఒకరు గౌరవించటం అలవర్చుకోవాలి.

'స్నేహ' కొత్తపేట

గోళ్ళు కొరకక్కూడదు!

బామ్మగారు తమ జవాబులో గోళ్ళను ఎందుకు కొరకకూడదో కారణాలు చెప్పారు. అవి కాక మరొక కారణం కూడా ఉంది.

పిల్లలకు-(పెద్దలకు కూడా) నులిపురుగు సాధారణంగా ఉంటుంది. ఈ నులిపురుగులు తమ గ్రుడ్లను 'ఆసనం' రంధ్రం చుట్టూ పెడతాయి. అవి తిరిగి కడుపులోకి వెళ్ళి అక్కడ గ్రుడ్లనించి పిల్లలు బైటికి వస్తాయి. ఈ గ్రుడ్లు కంటికి కనబడనంత సూక్ష్మమైనవి. మలవిసర్జనానంతరం కడుక్కున్న సమయంలో ఈ గ్రుడ్లు గోళ్ళ లోపల ఇరుక్కుపోతాయి. గోళ్లను కొరుక్కునేటప్పుడు ఈ గ్రుడ్లు కడుపులోకి వెళ్ళిపోతాయి. (తెలిసికొన్నప్పుడు చాలా అసహ్యంగా ఉంటుంది. కాని నులిపురుగు ఉత్పత్తి విధానమే ఇది!)

అందుకే పిల్లలు నోట్లో వ్రేళ్ళు పెట్టుకోగానే డాక్టర్ మొదట నులిపురుగు మందు ఇస్తాడు.

పెరట్లోకి వెళ్ళి వచ్చిన తరువాత క్రిమిసంహారిణి సబ్బుతో చేయి బాగా కడుక్కోవాలి. ఉత్తరాదివారు బూడిదతో కడుక్కుంటారు. బూడిద కూడా మంచిదే. ఉట్టినీళ్ళతో సెంటు సబ్బుతో కడుక్కుని తృప్తిపడటంలో లాభం లేదు.

కోమలాదేవి ఇజత్‌నగర్

నిజంగా ఆడదంటే అలుసేనా?

ఓ భర్త, తన భార్యను పొడిచివేయడమే గాక, ఆమెను సజీవంగా దహనం చేయడానికి ప్రయత్నించాడు. పొడిచిన గాయం కనబడకుండా, కట్టుకట్టి, ఆమెపై కిరోసిన్ పోసి తగులబెట్టాడు. పైపెచ్చు కాలిపోతున్న ఆవిడని, మిగతా కుటుంబ సభ్యులకు చూపించి, ఆమె ఆత్మహత్య చేసుకొంది అనే అభిప్రాయం కలిగించాలని తాపత్రయపడ్డాడు. పాపం ఆ అభాగిని చనిపోయింది. ఆ తల్లి కుమార్తెలలో ఒక పాపకు అంతకుముందే టాన్సిల్ ఆపరేషన్ అయింది. ఆ పాప కూడా ఏమీ మాట్లాడలేకపోయింది. ఆ దురదృష్టవంతురాలైన మాత చనిపోయిన, కొన్ని రోజులకి కానీ అసలు విషయం వెలుతురులోనికి రాలేదు. ఆ తర్వాత పోలీసులు రంగంలోకి దిగి, పరిశోధన ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన యీ సిగ్గులేని సంఘటన, బలహీనులైన స్త్రీ జాతిపై, బలవంతులైన పురుషుడు చలాయించిన అమానుష దౌర్జన్యం, రాక్షస కృత్యానికి ఒక ప్రతీక!

మహారాష్ట్రలో పూనాలాంటి చోట జరిగినవి మరి రెండు సంఘటనలు. మరో మానవాకృతిలో వున్న భర్త, తన భార్య తలపై బలమైన ఆయుధంతో కొట్టాడు. ఆవిడ స్పృహతప్పి కింద పడిపోయింది. ఈ ఘటన వూరిబయట జరిగింది. ఆవిడ పడిపోగానే, ఆయనగారు ఆమె చనిపోయింది కదా అని, ఇంటికి వెళ్ళిపోయాడు. ఆరు రోజులపాటు అదే ప్రదేశంలో అలానే పడిపోయిన, ఆ అభాగ్యురాలు తర్వాత కళ్ళు తెరిచి స్పృహలోకి వచ్చింది. ఆ ప్రక్కన పోతున్నవారు పుణ్యాత్ములు, ఆమెను తీసుకు వెళ్ళి ఆస్పత్రిలో చేర్పించే ప్రయత్నాలు చేశారు. ఇక ఆ మగధీరుడి సంగతి చూడండి. భార్య చచ్చిపోయింది కదా అని, అయితే ఎవరైనా తనను అనుమానిస్తారేమోనని, పోలీసులకి "తన భార్య కొద్ది రోజులుగా కనబడటం లేదు" అని రిపోర్టు ఇచ్చాడు. అయితే ఇప్పుడు ఆ మగరాక్షసుడి పాపం పండి, అసలు విషయం తెలిసింది.

ఇక మూడవ సంఘటనలో, తన భార్య సంతానవతి కాలేకపోయింది అనే నెపంతో, తన భార్యను చంపివేశాడు ఒక ప్రబుద్ధుడు.

నగలకోసం భార్యను చంపివేసే మనస్తత్వం ఒక భర్తది. తన పెద్దలు తన భార్యకు ఎంతకాలమూ బిడ్డలు కలగలేకపోయారు అని వాగేసరికి అత్త మీద కోపం దుత్త మీద తీర్చుకున్నట్లు, తన భార్యను కోపాగ్నికి ఆహుతి చేసిన పురుష శిఖామణి మరొకడు!

మనిషిలో మానవత్వం నశించినప్పుడు, పురుషుడు పైశాచికంగా రక్తదాహంతో ప్రవర్తించినపుడు, బలహీనురాలైన వనిత ఏం చెయగలదు? 'నాతిచరామి' అని చిలుకపలుకులు వల్లించి, భార్యల వైవాహిక జీవితాలను, అసలు జీవితాలనూ మంట గలిపిన పురుష పుంగవులను ఏం చేయాలి? యుగయుగాలుగా, తరతరాలుగా వస్తున్నట్లు, ఏనాటికైనా ఆడదంటే అలుసేనా?

కాకుటూరు సుజాతా నాగరాజరావ్ కావలి

అక్టోబర్ 'వనిత'లో ప్రచురించిన మన దేవాలయాలు శీర్షికలో విజయనగరము పైడిమాంబ గురించి చెప్పడం బాగుంది. మా స్వంత వూరు విజయనగరము. పెండ్లి అయిన తరువాత అమ్మవారి సంబరము చూడటానికి వీలుకాలేదు. ఈ శీర్షిక చదువుతూంటే మళ్ళీ చూచినట్లు అనిపించింది. —కె. విజయలక్ష్మి, జెమ్‌షెడ్‌పూర్

"మన దేవాలయాలు" శీర్షికలో "పైడిమాంబ" గురించిన విశేషాలు అద్భుతంగా ఉన్నాయి. "బరువు తగ్గడం ఎలా?" అనే శీర్షికలో, డాక్టరుగారు మాకు తెలియని ఎన్నో విజ్ఞాన విషయాలు వివరించారు. ఈ సంచికలో ప్రచురించిన గేయం "పూజా పుష్పము" నన్నెంతగానో ఆకట్టుకుంది. చిట్టికథ "త్రిల్" చాలా చాలా బాగుంది. —కె. జి. హేమలత, కుప్పం

అక్టోబర్ వనిత'లో 'ఎమ్. యస్. కమల'గారి 'సెన్సస్' చాలా బావుంది. "త్రిల్" చిట్టికథ నిజంగా త్రిల్‌గా ఉంది. కాని పత్రికలో కథలు చాలా తక్కువగా ఉంటున్నాయి. ఎంచేత?

—ఆర్. సాహిత్య, సిరిసిల్ల

"శీలరక్షణి" గూర్చి చక్కని విషయాలు వివరించారు. ఇప్పటికీ ఈ విధానం ఇంకా కొన్ని దేశాల్లో అమలులో ఉండటం విచారింపదగ్గ విషయం. స్త్రీలపాలిట శిక్ష లాంటి వీటిని ఉపయోగిస్తూవుంటే చూస్తూ వూరు కోవటం సమంజసంగాదు. దీనిని ఇంకా ప్రచారంలోకి రాకుండా రూపుమాపటం ఎంతో అవసరం.

—లోకం సరస్వతి సర్సయ్య, నవీపేట

"బరువు తగ్గడం ఎలా!" చదివాను. ఎంతో ఆసక్తి దాయకంగా ఉంది. విజయనగరంలోని అక్కడి ప్రజలు విశేషంగా కొలిచే "పైడిమాంబ" గుడిని గురించి ఫోటోలతో సహ ప్రచురించిన వ్యాసం ఎంతో ఉత్సాహకరంగా ఉంది.

—కందిగట్ల సావిత్రి, జనగామ




అక్టోబర్ 79 సంచిక వనితలో నిప్పుతో చెలగాటమా? వ్యాసం చాలా విజ్ఞానదాయకంగా ఉంది. ఈ వ్యాసం ఎక్కువగా అగ్నిని అశ్రద్ధగా చూసే ప్రతి స్త్రీ పురుషులకు చక్కని గుణ పాఠం.

—ఎమ్. పద్మావతి, సంపర

అక్టోబరు 'వనిత' ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా వున్నది. 'తోటకూర' వ్యాసం ప్రయోజనాత్మకంగా వున్నది. 'లోకజ్ఞానం' శీర్షిక మాకు చాలా ఉపయోగకరంగా ఉంది.

—కన్నా దుర్గ భవాని, మచిలీపట్టణము

"శీలరక్షణి"లో మీరు తెల్పిన విషయాలు నిజంగా నమ్మశక్యంగా లేవని మా అభిప్రాయం. కానీ...మీరు ఫోటోతో పూర్తి వివరాలు తెల్పినందుకైనా నమ్మాలని పిస్తున్నది. ఏది ఏమైనా...స్త్రీకి అంత కట్టుదిట్టాలు ఉండటం నిజంగా మనం విచారించాల్సిన ముఖ్య విషయం. —పోట్ల జ్యోతిశ్రీనివాసరావు, జనగామ

రాణి బుర్రావంటి ప్రతిభ కలిగిన వనితలను మాకు పరిచయం చేస్తున్నందుకు అభినందనలు. 'శీలరక్షణి' గురించిన విషయాలు సంభ్రమాశ్చర్యాలను కలిగించాయి! ఈ అరాచక పద్ధతికి యావత్ మహిళా ప్రపంచం తన వ్యతిరేకతను కనపరచడం, 'ఆందోళన' ద్వారా ఈ పద్ధతిని సమూలంగా సమాధి చేయడం సత్యప్రపంచానికి సహేతుకం!

—శ్రీమతి నజీర్ హుసేన్, కావలి

పోస్టు ద్వారా పత్రికలు సరిగా అందకపోవడం మనం సాధారణంగా చూస్తున్నదే! సరిగ్గా ఈ విషయం దృష్టిలో పెట్టుకునే మా వారు అర్ధువల్ల వేశారు - గత సంవత్సరం వనిత నిర్వహించిన సంవత్సర పరీక్షలో చందాల బహుమతి కూపను నేను పంపుదామను కుంటే!! అయినా చివరికి నా పట్టుదలే నెగ్గింది. నా మాటను మీరు నిలబెడుతూ - ప్రతి నెలా ఠంచనుగా 20వ తేదీకల్లా 'వనిత' సంచికను పోస్టు ద్వారా మాకు చేరే ఏర్పాటు చేసినందుకు వనిత నిర్వాహక వర్గాన్ని నేనూ-నాతో పాటు మా శ్రీవారూ మనసారా అభినందిస్తున్నాము.

—ఓలేటి సీతాదేవి, ఖమ్మం

## ఇంజిక్షన్ ద్వారా స్టెరిలైజేషన్

శస్త్రచికిత్స లేకుండానే గర్భధారణనిరోధం సాధ్యమవుతుందని అమెరికాకు చెందిన డాక్టర్ థియోడోర్‌రీడ్ ఇటీవల వెల్లడించారు. ఇది ఎలా సాధ్యం? రెండు చుక్కల సిలికాన్‌ను ఇంజక్షన్ ద్వారా ఫాలోపియన్ నాళాలలోకి ఎక్కించినట్లయితే- అది కొద్దిసేపట్లో గట్టిపడి ప్లగ్‌లా తయారవుతుంది. దాంతో ఫాలోపియన్ ద్వారం మూసుకుపోతుంది. ఆపైన అండాశయం నుంచి అండకణాలు గర్భాశయం చేరుకోలేవు గనక గర్భధారణ సాధ్యం కాదు. ఈ చికిత్సవల్ల ఫాలోపియన్ నాళాలకు ఎలాంటి చెరుపుకాని ఇతర అనారోగ్యాలు కాని వుండవని డాక్టర్ రీడ్ అన్నారు. అంతేకాదు. ఇరవైమందికి పైగా ఈ చికిత్సను విజయవంతంగా జరిపిన డా. రీడ్- పిల్లలు కావాలనుకున్నప్పుడు సిలికాన్ ప్లగ్‌ను తొలగించడానికి కూడా అవకాశం వుందని వెల్లడించారు.

## లోపల

# వార్తావని(త)

అణ్ణామలై విశ్వవిద్యాలయం ఇటీవల ప్రముఖ నర్తకి కుమారి పద్మా సుబ్రమణ్యం నాట్య శాస్త్రంలో జరిపిన పరిశోధనలకై డాక్టరేటు పట్టం ఇచ్చింది. ఆ విధంగా డాక్టరేట్ పొందిన ప్రథమ వనిత కుమారి పద్మ కావడం విశేషం. ఆ సందర్భంగా మద్రాసులోని రాణీ సీతై హాలులో జరిగిన సభకి అణ్ణామలై విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ బి. ఎస్. సోమసుందరం అధ్యక్షత వహించారు. కళాక్షేత్ర నిర్వాహకురాలు డాక్టర్ రుక్మిణి అరుండేల్ పద్మా సుబ్రమణ్యం రాసిన 'భరతుని కళ–అప్పుడు ఇప్పుడు' అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ గ్రంథంలో బొంబాయి భులాభాయ్ స్మారక సంస్థ ఆధ్వర్యంలో నాట్య శాస్త్రంపై ఆమె ఇచ్చిన ఉపన్యాసాలు పొందుపరచబడ్డాయి.





హైదరాబాద్‌లో అక్టోబర్ 1వ శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి రాష్ట్ర కేబినెట్ మంత్రిగా రాజ్‌భవన్‌లో ప్రమాణ స్వీకారం చేశారు. 1934లో హైదరాబాదులో జన్మించిన శ్రీమతి సరోజిని ఉస్మానియా విశ్వవిద్యాలయం ద్వారా పట్టభద్రురాలయ్యారు. 1960లో మొదటి సారిగా సికింద్రాబాద్‌లోని లాల్‌గూడా నుంచి మునిసిపల్ కౌన్సిలర్ అయ్యారు. దరిమిలా హైద్రాబాద్ మేయర్‌గా వుండి పేరు పొందారు. మలక్‌పేట నియోజకవర్గం నుంచి రెండుసార్లు కాంగ్రెస్ పార్టీ తరపున శాసన సభకు ఎన్నికయ్యారు. గత ఎన్నికలలో ఆమె శాసన మండలి సభ్యురాలుగా ఎన్నుకోబడ్డారు. హైదరాబాద్ నగరాభివృద్ధి సంస్థ అయిన 'హుడ్కో'కి ఆమె తొలి అధ్యక్షురాలు. ప్రస్తుతం రాష్ట్ర కాంగ్రెస్-ఐ కి ఉపాధ్యక్షురాలుగా కూడా వుంటున్నారు.

విశాఖపట్నంలోని లయన్సు సంస్థ విభాగాలన్నీ కలిసి సెప్టెంబరు 5వతేదీన మెసానిక్ లాడ్జిలో సంయుక్తంగా నిర్వహించిన 'ఉపాధ్యాయ దినం' సందర్భంగా నగరంలోని రిటైరయిన ఉపాధ్యాయిని శ్రీమతి లక్ష్మీనరసమ్మను లయనెస్ డా॥ సి. సీతాదేవి (ఆంధ్రా మెడికల్ కాలేజీ వైస్ ప్రిన్సిపాల్) దుశ్శాలువతో సత్కరిస్తున్నప్పటి దృశ్యం.



విశాఖ లయనెస్ క్లబ్బు అధ్యక్షురాలు లయనెస్ డి. సరస్వతీదేవి, తన కార్యవర్గ సభ్యురాండ్రు రామ్‌నగర్ స్కూలు ఆవరణలో స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలలో పాల్గొన్న దృశ్యం. విజయవాడలో ఇటీవల జరిగిన డిస్ట్రిక్టు కాన్ఫరెన్సులో ఈ క్లబ్బుకు మూడు జిల్లా స్థాయి బహుమతులు లభించాయి: 1. ఉత్తమ అధ్యక్షురాలు (డా॥ లావణ్యముఖర్జీ) 2. ఉత్తమ శిశు సంక్షేమ పథక నిర్వహణ 3. ద్వితీయ ఉత్తమ లయనెస్ క్లబ్బు.

—విలేకరి





మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' ఇటీవల స్థానిక కలైవాణర్ అరంగంలో ఏర్పాటు చేసిన కదంబ కార్యక్రమంలో కూచిపూడి నృత్యాలు చేసిన అనుపమ మోహన్‌ను అభినందిస్తున్న మద్రాసు సెంట్రల్ ఎక్సైజ్ కలక్టర్ శ్రీ బి. ఆర్. రెడ్డి సతీమణి శ్రీమతి రమారెడ్డి.

రాజమండ్రి ఇన్నర్‌వీల్‌క్లబ్ సభ్యులు ఇటీవల స్థానిక సహోదర సంఘం చర్చిలో పేద బాలలకు వైటమిన్ డ్రాప్స్ వంచి పెట్టారు.





గుంటూరు నెహ్రూ యువక కేంద్రం అనుబంధ యువజన యువతీ మండలుల వార్షికోత్సవాల సందర్భంగా బాపట్ల తాలూకా ఖాజీపాలెం 'ఆదర్శ మహిళామండలి' నిర్వహణలో ఏర్పాటు చేయబడిన చేతి వస్తు ప్రదర్శనను జిల్లా కలక్టర్ సతీమణి శ్రీమతి సుమిత్రా రాంబాబు ప్రారంభించారు.



హైద్రాబాదులో యిటీవల అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా బాలల విజ్ఞానయాత్రకు ముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి ప్రారంభోత్సవం చేశారు. టూరిజం శాఖామంత్రి శ్రీమతి రోడామిస్త్రీ ఆ దృశ్యాన్ని తిలకిస్తున్నారు.

—మల్లిడి కనకరత్నం



తాడేపల్లి గూడెం డి. ఆర్. జి. మహిళా కళాశాల ఇటీవల 'టీచర్స్‌డే' జరుపుకున్నారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో కళాశాల ప్రిన్సిపాల్, విద్యార్థినులు వున్నారు. తా. వి.

బరంపురం ఆంధ్ర మహిళా సమాజం సభ్యరాండ్రు అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా పేద బాలబాలికలకు ఆటల పోటీలు నిర్వహించారు. గెలుపొందిన వారికి కుమారి శాంతిలతా సాహు బహుమతి ప్రదానం చేశారు. సమాజం బాల విభాగం సభ్యులు పుత్తడి బొమ్మ పూర్ణమ్మ నాటిక ప్రదర్శించారు.



గుంటూరు రోటరీ క్లబ్ అధ్వర్యంలో ఇటీవల ఇన్నర్‌వీల్ క్లబ్‌కు శ్రీమతి రాధామురళీధర్‌చే ప్రారంభోత్సవం జరిగింది. ఇన్నర్‌వీల్ క్లబ్ అధ్యక్షురాలుగా శ్రీమతి సావిత్రి, ఉపాధ్యక్షులుగా



ముఖచిత్రం

# మంగళగౌరి



ఒక కళను సరదాగా నేర్చుకుని, సరదా తీరిన తర్వాత మర్చిపోతారు కొందరు. మరికొందరు — తమ కళ కొన్ని మంచి ప్రయోజనాలకు దోహదం చేస్తుందంటే, అందుకు మరింత ఉత్సాహం చూపి, ఆ విధంగా తాము నేర్చుకున్న విద్యకు సార్థకత చేకూర్చుకుంటారు. తాను నేర్చుకున్న నాట్య కళకు అటువంటి సార్థకత ఏర్పడాలని ఆశిస్తూ, అందుకు విశేషంగా కృషి చేస్తున్నది కుమారి మంగళగౌరి. ఆ కారణం గానే ఒక ప్రక్క ఇంటర్ చదువుతూ తన గురువు, ప్రసిద్ధ నాట్య కళాకారిణి సుమతీకౌశల్‌గారి నృత్య శిక్షణాలయం 'నృత్య శిఖర' (హైదరాబాదు) తార్నాక శాఖను నిర్వహిస్తూ, తరచుగా పలు సహాయ కార్యక్రమాల నిమిత్తం నాట్యప్రదర్శనలు ఇస్తూ, పెద్దల ప్రశంసలు అందుకుంటోంది.

మంగళగౌరి మాతృభాష తమిళం. స్వస్థలం బెంగళూరు అయినా చాలాకాలంగా ఆమె కుటుంబ సభ్యులు హైదరాబాదులోనే స్థిరపడ్డారు. తల్లి ఇంద్రాణి, తండ్రి కృష్ణకుమార్‌లకు నాట్యం మీదున్న అభిమానంతో మంగళగౌరికి చిన్నప్పటి నుంచే నాట్యం నేర్పించారు. ఆమె తన తొమ్మిదవయేట తొలిసారిగా హైదరాబాదు 'రవీంద్ర భారతి' లో రంగప్రవేశం చేసింది. కూచిపూడి, భరత నాట్యాలలో విశేషమైన కృషి చేస్తున్నది. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ఇంతవరకు సుమారు యాభైకి పైగా నృత్యప్రదర్శనలు యిచ్చింది.

"నాకు సినిమా, నాటక రంగాలపై ఆసక్తి ఉన్నా, నేను అన్నిటికంటే ఎక్కువగా అభిమానించేది, కృషి చేయాలని ఆశించేది నృత్యరంగమే. నాటకాలలో నటించే అవకాశాలు వచ్చినప్పుడు సరదాగా అంగీకరిస్తుంటాను. కొన్నాళ్ళక్రితం హైదరాబాదులో ప్రదర్శింపబడిన 'ఓ భారతనారీ.... ఏది నీ దారి?' అన్న నాటకంలో ముఖ్యపాత్ర ధరించాను. ప్రముఖ నిర్మాత, దర్శకులు శ్రీ యు. విశ్వేశ్వరావు 'నగ్న సత్యం' లో నటించే అవకాశాన్ని కల్పించారు. ఇప్పుదాక తమిళ చిత్రంలోను విశ్వేశ్వరరావుగారి తర్వాతి చిత్రంలోను నటిస్తున్నాను'' అన్నది మంగళగౌరి.

నృత్యరంగంలో ప్రసిద్ధులైన సుమతీకౌశల్, పద్మా సుబ్రహ్మణ్యం, వైజయంతిమాల, శోభానాయుడులను తన ఆదర్శంగా పేర్కొన్నది మంగళగౌరి.

"చలన చిత్రరంగంలో నాకు అవకాశాలు వస్తున్నాయి. అయినా అన్నిటినీ నేను అంగీకరించలేను. చదువుకు, నాట్యానికి ఎక్కువ ఆటంకం ఏర్పడని విధంగా నేను వేయదగ్గ మంచి పాత్రలు లభిస్తే, నటించాలనే అనుకుంటున్నాను. పాత్రల ఎన్నిక విషయంలో నేను శ్రీమతి జయబాధురిని ఆదర్శంగా భావిస్తాను'' అన్నది మంగళగౌరి.

ముఖ చిత్రం: కె. ఆర్. వి. భక్త

శ్రీమతి యశోధర, శ్రీమతి జయశ్రీ, కార్యదర్శిగా శ్రీమతి జానకీదేవి, కోశాధికారిగా శ్రీమతి అనసూయ, సహాయ కార్యదర్శినులుగా శ్రీమతి శకుంతల, శ్రీమతి పార్వతి ఎన్నికైనారు.






ఆంధ్ర రాష్ట్ర రంగస్థల వృత్తి కళాకారుల సమాఖ్య అధ్యక్షురాలు, సినీ నటి శ్రీమతి జమునా రమణరావు విశాఖపట్నంలో నగరశాఖను ఇటీవల ప్రారంభిస్తూ జ్యోతిని వెలిగించారు. ఈ సందర్భంగా ఏర్పాటయిన సభకు శ్రీ గణపతిరాజు అచ్యుతరామరాజు అధ్యక్షత వహించగా, నగరాభివృద్ధి సంస్థ అధ్యక్షుడు శ్రీ ద్రోణంరాజు సత్యనారాయణ ముఖ్య అతిథిగా విచ్చేసారు. రాష్ట్ర శాసనసభ సభ్యుడు శ్రీ ఆళ్వారాదాస్, సినీ నటుడు శ్రీ ధూళిపాళ, తదితర ప్రముఖులు సభలో ప్రసంగించారు. నగరశాఖ కన్వీనరు కుమారి పి. జగన్మోహిని అతిథులకు స్వాగతం చెప్పగా, కార్యదర్శి శ్రీమతి టి. సరస్వతీదేవి నివేదికను సమర్పించారు.

శ్రీమతి జమున సమాఖ్య స్థాపనోద్దేశ్యాలను, ప్రయోజనాలను వివరించి, రాష్ట్ర ప్రభుత్వం రంగస్థల వృత్తి కళాకారులను కూడా బడుగువర్గాల జాబితాలో చేర్చి, వారికి చేయూతనివ్వాలని అన్నారు. సమాఖ్య ఇంతవరకు సాధించిన విజయాలను తెలియజేసారు. —విలేకరి

# వంట చిట్కాలు

— 'భోళా'

1. ఆకుకూరలు ఉడకబెట్టేటప్పుడు మూత పెట్టకండి. వాటి రంగు పోకుండా వుంటుంది!

2. కూరలూ అవీ ఉడకబెట్టేటప్పుడు ఉప్పు సమానంగా అన్నివైపులా అంటేటట్లు చూడాలి. అంచేత కూరలు ఉడకబెట్టేటప్పుడు ఉప్పు ఆ నీటికి చేర్చండి.

3. కాలిఫ్లవర్ ఉడకబెట్టేటప్పుడు ఆ తెల్లదనం ఉండాలంటే ఉడుకుతున్నప్పుడు కాస్త వినిగర్ చేర్చండి.

4. కోడిగ్రుడ్లు ఉడకుతున్నప్పుడు విరిగిన గ్రుడ్ల నుండి రసం బయటికి కారకుండా ఉండడానికి కొంచెం వినిగర్ ఉడుకుతూవుండగా నీటికి చేర్చండి. విరిగిన కోడిగ్రుడ్లనుండి సొన బయటికి కారదు.

5. పోషక పదార్థాలు పోకుండా వుండేందుకు కూరగాయలు కోసిన తర్వాత కడగడం కంటె కోసుకునేముందే బాగా కడగాలి.

6. పాలు పొంగి పొరలకుండా వుండడానికి పాలు కాగుతున్న పాత్రలో స్టెయిన్‌లెస్ స్టీల్ గరిటె వుంచితే, చాలు!

7. రిఫ్రిజిరేటర్ వున్నవాళ్ళు అందులో ఆకుకూరలు పెట్టుకోదలిస్తే వాటిని నీటిలో కడిగి పాలిథిన్ బ్యాగ్‌లో వుంచి 'ఫ్రిడ్జ్'లో వుంచితే తాజాగా వుంటాయి.

8. టిన్నులలో లభ్యమయ్యే ఆహార పదార్థాలు కొనుక్కునేవాళ్ళు కొన్న వెంటనే వాటిని గాజుగాని, ప్లాస్టిక్ పాత్రలలోకిగానీ మార్చుకుంటే పాడవకండా వుంటాయి.

9. అన్నం ముద్దగా అవకండా వుండాలంటే బియ్యానికి నీరు చేర్చేముందు అందులో ఒక నిమ్మకాయ పిండండి.

10. గృహిణులకి వంట వండేటప్పుడు చాకు అవసరం ఎంతైనా వుంటుంది. కాబట్టి చాకు కడిగిన తరువాత తుడవకండి. దానంతటదే నీరు వోడి ఎండిపోయేదాకా విదిలించండి. ఇలా చేయడంవల్ల చాకు పదును చాలాకాలం వుంటుంది.

11. వంట చేస్తున్నప్పుడు చెయ్యి కాలిందనుకోండి. అందుబాటులో కోడిగ్రుడ్డు వుంటే తెల్లసొన కాలిన మేర రాసి-కొద్ది సెకన్లసేపు కాస్త దూరం నుంచి సొన రాసిన మేర సెగ తగిలేలా వుంచండి.

12. మాంసం వేయిస్తున్నప్పుడు మధ్య మధ్యలో నెయ్యి మాంసం మీద పోస్తూ వుండాలి.

13. ఆకుకూరలు ఉడకబెడుతున్నప్పుడు వంట సోడా ఉపయోగించడం మంచిది. అవి ఉడకగానే ఈ పాత్రని చన్నీటిలో వుంచాలి.

14. చేపల్ని వండే ముందు వాటి మీద ఉప్పు, మిరియపుపొడి, నిమ్మరసం కలిపిన మిశ్రమాన్ని రాసి ఎండబెట్టి వండుకుంటే రుచిగా వుంటాయి.

15. పులావ్ వండుకునే ముందు బసుమతి బియ్యాన్ని కొంతసేపు నీళ్ళల్లో నాననిచ్చి ఆ తరువాత సుతారంగా బియ్యాన్ని ఆ నీళ్ళల్లో వుంచే కడగాలి. నీటిని పారబోసిన తరువాత మూడు నాలుగు నిముషాల సేపు అలాగే వుండనివ్వండి. ఆ తరువాత పాత్రలోకి తీసి వండుకుంటే బియ్యం ముద్దగా కాకుండా చక్కగా ఉడుకుతుంది.

**ఖీర్ (స్వీటు)**

కావలసిన పదార్థాలు: 50 గ్రాములు బియ్యం, 2 లీటర్లు పాలు, 170 గ్రాములు పంచదార, 50 గ్రాములు ఎండుద్రాక్ష, 20 గ్రాములు బాదం పప్పు, 10 గ్రాములు పిస్తా పప్పు.

తయారుచేయవలసిన విధానం: ముందుగా బియ్యం ఇరవై నిముషాలసేపు నీళ్ళల్లో నాననివ్వాలి. ఒక గిన్నెలో పాలు పోసి కాచాలి. అవి కాగుతూ వుండగానే నానిన బియ్యాన్ని ఆ పాలల్లో వెయ్యాలి. మధ్యమధ్యలో కలియదిప్పుతూ ఈ మిశ్రమం బాగా ఉడికేదాకా స్టవ్ మీద వుంచాలి. ఆ తరువాత సన్నటి సెగ మీద ఈ మిశ్రమానికి ఎండుద్రాక్ష, పంచదార కలిపి కొంతసేపు అట్టేబెట్టాలి. పంచదార బాగా కరిగి, బియ్యం శుభ్రంగా ఉడికిన తర్వాత పాత్రని స్టవ్ మీద నుంచి దింపాలి. ఈ విధంగా తయారైన 'ఖీర్' పైన బాదంపప్పు ముక్కలు, కోరిన పిస్తా చల్లుకు తింటే రుచిగా వుంటుంది.

**షాహి టుక్‌డా (స్వీటు)**

కావలసిన పదార్థాలు: 16 బ్రెడ్ స్లైజులు, 225 గ్రాములు పంచదార, 115 గ్రాములు ఇగర కాచి చిక్కగా తీగ సాగినట్లున్న పాలు, 115 గ్రాముల పాలకోవా, 15 గ్రాములు పిస్తా పప్పు, 4 వెండి ఆకులు (స్వీట్స్ మీద పైపూతగా



అమర్చే పలుచటి రేకులు), 4 ఏలక్కాయలు, వేయించడానికి తగినంత నెయ్యి, కొద్దిగా పాలు, కొన్ని చుక్కలు కుంకుమపువ్వు ఎసెన్సు.

తయారుచేయవలసిన విధానం: బ్రెడ్ ముక్కల చుట్టూ వున్న అంచులని తీసేసి బంగారువన్నె రంగు వచ్చేదాకా వేయించాలి. ఆ తరువాత ఈ ముక్కలకి కొంచెం పాలు, పంచదార చేర్చి వేయించాలి. ఇలా చేసుకున్న తర్వాత బ్రెడ్ ముక్కల్ని ఒక పళ్ళెంలో విడివిడిగా అమర్చుకోవాలి. ఇప్పుడిక మిగిలిన పాలు, పంచదారకి — వెండి ఆకులు తప్ప తక్కిన పదార్థాలన్ని చేర్చి అవి బాగా గట్టిపడే దాకా ఉడకనివ్వాలి. ఈ మిశ్రమాన్ని పళ్ళెంలో అమర్చిన బ్రెడ్ ముక్కల మీద పోసి వాటి మీద వెండి ఆకులని కప్పాలి (ఈ ఆకులు లేకపోయినా ఫరవాలేదు) ఈ బ్రెడ్ ముక్కల మీద పిస్తా పప్పు ముక్కలు చల్లుకుంటే ఎంతో రుచిగా వుంటుంది.

# మీ అందానికి మేలు చేకూర్చే మేకప్ మొదట మీ చర్మానికి మేలు చేకూర్చాలి.

వివిధరకాల మేకప్‌లు మిమ్మల్ని ఆకర్షణీయంగా చేస్తాయి. అవి చేసే మేలు అంతే మరి. కేవలం క్రూక్స్ వారి లాక్టో-కేలమైన్ మాత్రమే మీ చర్మానికి నిజంగా మేలు చేకూరుస్తుంది. అది మీ చర్మాన్ని మనోహరంగానూ, యవ్వనంతో ఉట్టిపడేట్లు చేస్తుంది. నిర్మలంగా తాజాగా అందంగా. ఇంత తక్కువ శ్రమతో, మీ చర్మ సౌందర్యానికి మరేదీ అంత మేలు చేయదు. అంచేతే అది పరిపూర్ణమైన మేకప్. వాడి చూడండి.

మీ చర్మసౌందరం ఎంత మనోహరంగా వుంటుందో మీరే గమనించండి.

ఆదో ఆకర్షణీయమైన అనుభూతి మరి!




3 వీలైన సైజుల్లో దొరుకుతుంది : 120 మిలీ, 60 మిలీ మరియు 30 మిలీ

క్రూక్స్ లాక్టో-కేలమైన్

ఒక రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్ ఈ మార్క్‌ను ఏ విధంగానైనా అతిక్రమించినవారు శిక్షింపబడతారు.



లాక్టో-కేలమైన్ కొనేముందు అసలైనదని రుజువు చేసుకునేందుకు క్రూక్స్ చిహ్నం కోసం, తీసివేయబడని క్రూక్స్ సీల్ కోసం తప్పక చూడండి.

డూఫార్-ఇంటర్‌ఫ్రాన్ లి.
పోస్ట్ బాక్స్ నం. 6582, బొంబాయి 400 018

## క్రూక్స్ లాక్టో-కేలమైన్ అందంగా ఉండటానికి సరిక్రొత్త రహస్యం

Sista's-DIL-680A/Tel/79

# కట్నం కోరని కుర్రాడు



చిట్టి కథ

"వీరు చూస్తే రిటైరైపోయారు."

"అవును. పెన్షన్ డబ్బులు నూటయాభై వస్తున్నాయిగా."

"అమ్మాయి కాస్తో కూస్తో చదువుకున్నా, ఓ పదిరాళ్ళు సంపాదించి పెట్టుందేమో అంటే, దానికి ఎక్కడైనా, ఏ చిన్న ఉద్యోగమైనా దొరికే అవకాశం కనిపించటం లేదు."

"అవును మరి....ఉత్తర దక్షిణాలు లేందే బంట్రోతు ఉద్యోగమైనా దొరకదు ఈ రోజుల్లో."

"మరి మాకువచ్చే నూటయాభై లో ముగ్గురం."

"ఇంతకీ ఏమంటావు? అమ్మాయికి పెళ్ళి సంబంధాలు వెతకమంటావు. అంతేనా?

"నేననటమేమిటి? మీకు మాత్రం తెలియనక్కర్లా? పిల్ల, పదోక్లాసు పాసు అవ్వగానే, పెళ్ళి సంబంధాలు చూడమంటే, 'అప్పుడేం తొందర, బాగానే చదువుతుందిగా....చదువుకోనీ, పెద్ద చదువులు చదువుకుంటే, ఉద్యోగం చేసుకుని దాని కాళ్ళమీద అది నిలబడుతుంది' అని డిగ్రీ దాకా చదివించారు. బాగానే వుంది. కానీ ఉద్యోగం దొరికిందా? వయసు చూస్తే పాతిక దగ్గర పడుతూంది. ఇవన్నీ మీకేం పట్టనట్లు కూర్చున్నారు మీరు."

"జానకీ! దేనికైనా టైమురావాలే. కళ్యాణమొచ్చినా - కక్కొచ్చినా ఆగదన్న విషయం నీకు మాత్రం తెలీదా?"

"బాగానే వుంది మీ వరస. అలా అని మన ప్రయత్నం లేకుండా, కాళ్ళుముడుచుక్కూర్చుంటే 'మీ అమ్మాయిని చేసుకుంటాను', అని ఏ కుర్రాడూ కోరి ముందుకు రాడు. అంచేత...."

"ఊ....ఇంతకీ వెంటనే ఏదైనా పెళ్ళి సంబంధం చూసి, అమ్మాయికి కళ్యాణం జరిపించేయమంటావు అంతేనా. ..సరేలే, అలాగే చూస్తాను."

"మీరు ఇదిగో అంటే ఆర్నెల్లు చేస్తారు. ఈ పత్రిక కాస్త చూడండి. ఇందులో 'కట్నం అడగని అబ్బాయిలు' అని ఫొటోలతోసహా, వాళ్ళ అడ్రసులు ప్రచురించారు. వీళ్ళల్లో ఏ ఒక్కరైనా మన అమ్మాయికి ఈడుజోడుగా ఉంటారేమో ప్రయత్నించి చూస్తే...."

"ఏది ఇలాతే" అంటూ జానకి చేతిలోంచి పత్రిక అందుకుని, చూడసాగారు రామారావుగారు.

*

"వెళ్ళిన పనేమైంది?" అప్పుడే ఇంటికి వచ్చిన రామారావుగార్ని ప్రశ్నించింది జానకమ్మ.

"అబ్బాయిని చూసి, మాట్లాడాను. ఫొటోలో ఉన్నట్టే, అందంగా - ఆరోగ్యంగానే వున్నాడు కుర్రాడు. ఎం. ఏ. ఫస్టుక్లాసులో పాసైనాడట."

"కట్నం కానుకల విషయం?" రామారావు గారి మాటలకు మధ్యలో అడ్డొస్తూ అడిగింది జానకమ్మ.

"కట్నం కానుకలు తీసుకోడట. అబ్బాయికి కొన్ని ఆదర్శాలు వున్నాయట. పిల్ల చదువుకున్నదై, వినయవిధేయతలు కలిగి, మంచి సంప్రదాయక కుటుంబం నుంచి వస్తే చాలట."

"మరైతే ఇంకేం-అమ్మాయి ఫోటో చూపించారా అబ్బాయికి?"

"ఓ .... అమ్మాయి తనకు నచ్చిందని కూడా అన్నాడు కుర్రాడు."

"మరైతే, ఇంకేం....మన పద్మ పెళ్ళి ఇంత కాలానికి జరుగబోతున్నదన్నమాట. మీరన్నట్లు... కక్కొచ్చినా, కళ్యాణమొచ్చినా ఆగవుసుమండీ! అసలు పెళ్ళిళ్ళు దేవుడు స్వర్గంలోనే చేసేస్తాడట. మన అదుర్దా కొద్దీ రకరకాలుగా తలపోస్తుంటాం తప్ప," జానకమ్మ లోలోపల ఎంతో సంతోషపడి పోతోంది.

"ఆగు .... ఆగు .... నీకు ఆనందం వచ్చినా, ఆవేశం వచ్చినా, పట్టటం కష్టం. అసలు విషయం పూర్తిగా విని అప్పుడు మాట్లాడు." అన్నారు రామారావుగారు జానకమ్మ సంతోషాన్ని మధ్యలోనే త్రుంచివేస్తూ.

"అబ్బాయికి చదువైతే వుంది కానీ, ఉద్యోగం లేదు."

"మీరెంత పిచ్చివారండీ! ఉద్యోగం ఇవ్వాళ కాకపోతే రేపు వస్తుంది. ఎం. ఏ. ఫస్టు క్లాసులో పాసైన కుర్రాడికి ఉద్యోగం రావడం కష్టం అటండీ? మీ ఆలోచనలన్నీ ఇలానే వుంటాయి." రామారావుగారు అమాయకులన్న ఉద్దేశ్యం జానకమ్మ మాటల్లో కొట్టొచ్చినట్లు కనపడింది.

"అదేమో కాని, అబ్బాయి 'బ్యాంక్ ఆఫీసర్' రిటెన్ టెస్టులో పాసైనాడట. ఇంటర్వ్యూలో ఎలాగైనా, ఓ పదో, పదిహేనో వేలు ఖర్చుపెట్టి, ఆ ఉద్యోగం వచ్చేలా చూస్తే, మన అమ్మాయిని వాళ్ళ అబ్బాయికి కట్నం లేకుండా చేసుకోవటానికి, తనకేం అభ్యంతరం లేదని, పిల్లాడి తండ్రి ప్రక్కకు పిలిచి చెప్పాడు."

జానకమ్మ నోట మరో మాట రాలేదు!!

—పనిశెట్టి లక్ష్మిశారద

# స్త్రీల అందానికి పైమెట్టు

# ఐటెక్స్

# తిలకం బొట్టు

ఆకర్షణీయమైన అనేక రంగుల్లో, మేలైన
సువాసన ద్రవ్యాలతో, మృదువైన చర్మానికి
ఎలాంటి హాని కలుగని విధంగా
తయారుచేయబడుతోంది.
ఐటెక్స్ (MATT FINISH) తిలకం
స్త్రీల సొగసుకు ప్రియతమ తిలకం




ARAVIND LABORATORIES MADRAS-600 033

CREATIVE AD SER 203



## మజిలీలో తుదిమలుపు

(నవల)

**[రచన : ఉమాశశి; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు; వెల : రూ. 3-50; పేజీలు : 152]**

పులిబోను లాంటి ఇంట్లో నరరూప రాక్షసుల లాంటి మనుష్యుల మధ్య ఆకాశపుష్పం లాంటి సంగీత, మూగదేవత లాంటి తల్లి సుందరి ఊపిరి విడవడానికి కూడా భయపడుతూ, బ్రతుకుతూ ఉంటారు. సంగీత స్నేహితురాలు కల్యాణి-ఆ దెయ్యాలకొంపలో సంగీత తండ్రి శివరావు, అన్న రమేష్‌ల కామాగ్నికి ఆహుతి కాకుండా తప్పించుకుంటుంది. ఆమె అన్నదమ్ములు, స్నేహితులు-అందరూ కలిసి శివరావు నిజస్వరూపం బయటపెట్టి జీవితంలో అందర్ని పోగొట్టుకుని మూగబొమ్మగా నిలబడిపోయిన సంగీతకు జీవితం ప్రసాదిస్తారు.

కథ నిండా సినిమాటిక్ మలుపులు చాలా ఉన్నాయి. దివాకర్ ఒక బాధ్యత గల పోలీసాఫీసర్ అయి ఉండి సహృదయంతో సంఘవిద్రోహి కూతురు సంగీతను జీవిత భాగస్వామిగా పొంద గలగడం అభినంద్రించవలసిన విషయం.

ఉమాశశి కథ బాగా చెప్పారు. మొత్తానికి చదవాలనిపించే నవలే ఇది.

## కాలానికి నిలిచిన కథ

(నవల)

**[రచన : లల్లాదేవి; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు; వెల : రూ. 3-50; పేజీలు : 135]**

కొన్ని శతాబ్దాలుగా ఏ కొండకోనల్లోనో నిక్షిప్తమైన ఉన్న జీవన వాహినులకు రూపు కల్పించి సౌందర్యగాథలుగా మలచగల రచయితలు చాలా తక్కువమంది. అటువంటివారిలో లల్లాదేవి ఒకరు. 'ఒక ఆత్మ చెప్పిన కథ' తరవాత వారి రెండవ ప్రయత్నం ఇది.

కొండవీటి శిఖరాలలోనే అత్యున్నతమైన "కుచ్చెలచోడు" చూసిన రచయిత్రి హృదయం ఆనాటి మహోజ్వల చరిత్ర గుర్తుకువచ్చి స్పందిస్తుంది. కాలవాహినిలో ఎన్నో ప్రేమైక హృదయాలు, మరెందరో మధురమూర్తులు కలిసి పోయినా, వారి తీయటి జ్ఞాపకపు పుప్పొడులు గాలిలో తేలి గతాన్ని గుర్తుకు తెస్తూనే ఉంటాయి.

సౌకుమార్యము, సంగీత నైపుణి, ప్రేమించి ప్రేమింపచేసుకోవలసిన హృదయమూ ఉన్న వేమాంబ ఈ కథలో ఒక సజీవమూర్తిగా మనకు దర్శనమిస్తుంది.

రెడ్డిరాజుల కులగురువైన పెద్దియజ్వ ఆ కొండ వీటి దుర్గాలలో దూరాన దర్శనమిచ్చి తనకే కథ చెప్పారని నమ్మిస్తారు రచయిత్రి.

బ్రాహ్మణ యువకుడు ఒక ముస్లిం పిల్లను ప్రేమిస్తాడు. తరవాత మరిచిపోతాడు. ఫారెస్టు బంగళా దగ్గరగా కొండవీటి కోనల మీద ఉదయ కాంతిలా అతను వస్తాడని ఆ నిశ్శబ్దపు లోయల లోకి చూస్తూ నిట్టూరుస్తూ యవ్వనాన్ని, జీవితాన్ని నిర్లిప్తంగా త్యాగం చేసిన ఫాతిమా పాత్ర మరుపు రానిది.

ఆనాటి రాచరికపు జీవన ధ్వనులు ఈనాటికీ కొండవీటిదారిని పలకరిస్తూనే ఉన్నాయి. స్పందించ గల హృదయము, సౌందర్య దాహమున్న వ్యక్తిత్వమూ ఉన్న ఏ వ్యక్తి అయినా ఒకసారి కొండవీడు చూడాలి అనిపించేట్లు చేస్తుంది ఈ నవల.

## రాతిపువ్వులో రాలిన ముత్యాలు

(నవల)

**[రచన : తేజోవతి; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు; వెల : రూ. 3-50; పేజీలు : 143]**

చాలా సస్పెన్స్‌తో ప్రారంభమై, సినిమా కథలా పూర్తయిన నవల ఇది. ఉద్యోగాన్వేషణలో జగదీష్ దగ్గరకు వచ్చిన సంధ్యను బలాత్కారం చేయబోగా రక్షించాడు భాస్కర్. కానీ గతంలో స్నేహితుడికి అన్యాయం జరిగిందని తెలిసి సంధ్యను మానభంగం చేసి, ఆమెను సంఘదృష్ట్యా పెళ్ళికాని తల్లిగా మిగిల్చిన వాడే ఈ భాస్కర్. జీవితంలో సర్వం అతనివల్ల పోగొట్టుకున్న సంధ్య అతన్ని ఎలా నమ్మాలో తెలియక ప్రతిక్షణం అతన్ని ద్వేషించ డానికి ప్రయత్నిస్తుంది. కానీ, మానవత్వంతో మేల్కొన్న భాస్కర్ ఆమెను, ఆమె బిడ్డకు ఆర్థికంగా, సాంఘికంగా కూడా అండగా నిలబడాలని ప్రయత్నిస్తాడు. ఇలా ప్రారంభమైన ఈ నవల ఆఖరులో గొప్ప సినిమా కథలా, సూర్యం, భాస్కర్, రవి అంతా అన్నదమ్ములవడం వగైరాలతో తమాషాగా అంతమైంది. మొత్తానికి నవల చదివిస్తుంది; చెప్పగల నేర్పు ఉన్న రచయిత్రి తేజోవతి.

## ప్రేమవాహిని

(నవల)

**[రచన : పాటిబండ్ల విజయలక్ష్మి; ప్రచురణ : నవజ్యోతి పబ్లికేషన్స్ : ఏలూరు రోడ్, విజయవాడ-2 వెల : రు. 8-00; పేజీలు : 223]**

నవలలు వ్రాయటంకాని, చదవటంకాని కేవలం కాలక్షేపానికే అన్నట్టుగా నేడు పుంఖాను పుంఖంగా వస్తున్న నవలల్లో ఇది ఒకటి.

ఐతే, ఈ అందమైన ప్రేమ కథ పాఠకుల ఊహ మేరకే సాఫీగా సాగిపోతూ వుంటుంది. కలకత్తా గంగాతీరం, గంగాపూర్ బ్యాగ్రౌండ్‌తో నవల నడుస్తుంది.

హీరో, హీరోయిన్లు త్వరగా పెళ్ళి చేసుకుంటే బాగుండునే, పుస్తకం మూసెయ్యచ్చునే అనుకుంటూనే, సినిమాటిక్‌గా వున్న ఈ నవలని పఠితలు ఆఖరు దాకా చదువుతారు.

ఈ కోవకే చెందిన చాలా నవలలని పాఠకులు ముందే చదివి వుండటంవల్ల కొత్త నవల చదివామన్న తృప్తి వాళ్ళకేమీ వుండదు. పోతే.... విసుగు కల్గించకుండా నవలని సాంతం చదివించిన రచయిత్రి శైలిని తప్పక అభినందించాలి.

రచనకు వుండవలసిన ముఖ్య లక్షణం (చదివించగల నేర్పు) అదే కాబట్టి ఈ వర్ధమాన రచయిత్రి కృషి చేస్తే మంచి రచయిత్రి కాగలరు.



ఇవ్వాళ జ్యూట్ (పురికొసల) బ్యాగ్స్ మీద మోజు ఎక్కువగా వుంది. వీటికి మంచి రంగులు అద్దిస్తే అసలు పురికొస అని ఎవరూ అనుకోరు. బ్యాగ్స్ అల్లిన తర్వాత రంగు అద్దిస్తేనే బాగుంటుంది. పురికొసకన్న రంగుకే ఎక్కువ ఖర్చు. మనం మామూలు వయర్ బ్యాగ్స్ అల్లినట్టే అల్లాలి దీనిని. ఇది అల్లేటప్పుడు దుమ్ము వస్తుంది కాబట్టి, ఎండ తగ్గిన తర్వాత అల్లితే చికాకు కలిగించదు.

పిల్లలకు పనికివచ్చే స్లింగ్ బ్యాగ్ ఎలా అల్లాలో చెబుతాను. దీనికి రెడిమేడ్ హాండిల్స్ అవసరం లేదు. పురికొస ముక్కలు 4 కావలసినంత పొడవు తీసుకొని. వీటికి ముక్కలు వేస్తూ పోవాలి. ఆఖరున 4, 5 ముక్కలున్నప్పుడు పురికొస కొనలు కలిపి ముడివేస్తే మంచిది. ముక్కలన్నీ ఎక్కించి సర్దితే గ్యాప్ వుండకూడదు. నేను చెప్పే డిజైను 9 జతలు వుంటాయి. ఒక్కొక్క జతకు 8 ముక్కలు చొ॥న 72 ముక్కలు కావాలి. ముక్క పొడవు 100 అంగుళాలు. జాగ్రత్తగా అల్లలేనివారు ఇంకో 10 అంగుళాలు ఎక్కువ వుంచుకోవాలి. ముక్కలన్నింటినీ హాండిల్‌కు ఎక్కించుకోవాలి. (ఒక్కొక్క ముక్కను మధ్యకు మడచి ఎక్కించుకోవాలి. ఒక సెట్‌లో 16 ముక్కలు వుండాలి.)

I (1) (2)



1వ బొమ్మలోలాంటి ముళ్లు వేసుకోవాలి 4 పురికొస ముక్కలలో ఒక జతకు మొదటి వరుసలో 4, దానిక్రింద 3, తిరిగి 2, ఒకటి చొ॥న వేసుకొంటే II వ. బొమ్మలో లాగా ఇటు అటు 8 ముక్కలు చొ॥న వుంటాయి.

(3)





(4)



(5)

హాండిల్‌ను మనవైపు త్రిప్పకొని ముక్కల కొనతో సీతాకోకచిలక డిజైన్‌కు లాగా ముళ్లు వేసుకోవాలి. కుడివైపు పై నుండి 2వ ముక్కను ఎడమ వేలికి చుట్టుకొని కుడిచేత్తో III బొమ్మలో చూపిన

II



విధంగా క్రింద వున్న 6 ముక్కలలో ఒక్కొక్క ముక్కలో 2 చొ॥న ముళ్లు చుట్టాలి. తర్వాత దీని ప్రక్కగ ఒకటవ ముక్కను వ్రేలికి చుట్టుకొని అన్ని ముక్కలలో ముళ్లు వేయాలి. తర్వాత ఎడవైపు కుడి వ్రేలికి చుట్టుకొని ఎడమచేత్తో ఇలానే వేయాలి ముళ

III (1)



IV లో (1) వ బొమ్మలో లాగా వుంటుంది. ఇప్పుడు ఒకవైపు (ఏ వైపయినా పరవాలేదు) వున్న రెండు కొసలలో మొదటిదానిని వేలికి చుట్టుకొని ఇంకొక వైపు వున్న రెండు వయర్లను రెండు మార్లు చొ॥న చుట్టుకోవాలి. తర్వాత ఇంకొకదానికి కూడా ఇలానే




(2)



వీటిని చుట్టుకోవాలి. ఇప్పుడు IV లోని (2) వ బొమ్మలో లాగా వ్రేలికి చుట్టుకొన్న వైపు 16 చుట్లు, ఇంకొకవైపు 12 చుట్లు వుంటాయి. ఈ ఆఖరి

IV (1)



ముళ్లవల్ల రెండు వైపుల ముక్కలూ విడివిడిగా వుండక సఖ్యంగా వుంటాయి. ఇది ఒక జత. ఇలా అన్ని జతలూ వేసుకొంటే మొదటి అర డైమండ్ ఆకారం వస్తుంది.




V వ బొమ్మలో గుర్తు పెట్టిన 8 ముక్కలు మధ్యకు వుంచుకొని ఇటు అటు రెండు ముక్కలు చొ॥న 4 ముక్కలలో 1 బొమ్మలోని ముడివేస్తే పెద్దదిగా వస్తుంది తిరిగి ఇటు అటు ముక్కలతో ముళ్ళు చుట్టుకొంటే రెండవ లైనుతో డైమండ్ ఆకారం పూర్తిగా వస్తుంది. అన్ని జతలూ ఇలానే వేసుకోవాలి తర్వాత డైమండ్‌లో I వ బొమ్మలోని ముళ్లు మొదట ఒకటి క్రింది లైనులో 2, తర్వాత 3, తర్వాత 2. తర్వాత ఒకటి చొ॥న వస్తుంది. దీనికి కూడా అటు ఇటు ముక్కలతో ముళ్లు చుట్టుకోవాలి. VI వ బొమ్మలో లాగా వుంటుంది. ఇలా ఒక డైమండ్‌లో పెద్ద ముడి వస్తే, ఇంకొక డైమండ్‌లో చిన్న ముళ్లు వుంటాయి అంతా అల్లుకొంటే పైన,



ఆఖరున సగం డైమండ్ మధ్యలో 5 డైమండ్స్ వస్తాయి. తర్వాత అడ్డంగా త్రిప్పుకొని రెండు వయర్లకు మామూలు గట్టిముడి రెండు వేసుకొని మనకెంత పొడవు కావాలో (కుచ్చుకుగాను) వుంచు

కొని మిగతా పురికొస కత్తిరించి క్రింది ముక్కల పురిని విప్పి బాగా దువ్వితే కుచ్చు చక్కగా వస్తుంది బ్రష్ లాగా.




ఇప్పుడు స్లింగ్‌కుగాను అల్లుకోవాలి. ఒక ముడి వుంటే పోటోలోలాగ బలంగా వుండదు. అందుకే 3 ముళ్లు వచ్చేలాగా 12 ముక్కలు కావాలి. ముక్క పొడవుకు మూడింతలు కావాలి. రెండు వైపులా కావాలి కాబట్టి పొడవు 60 అంగుళాలు వుండి, అంటే $60 \times 3 = 180$ అంగుళాల ముక్కలు 12 వేసుకొని పైన 3,4 అంగుళాలు వదలి ముడివేసి ముళ్లు వేసుకొంటూ పోవాలి. మొదటి లైనులో 3 ముళ్లు తర్వాత 2 ముళ్లు తర్వాత 3 తర్వాత 2 చొ॥న వస్తాయి. అంతా అల్లుకొని అడుగున కాకిగుడ్డ లైనింగ్ వేస్తే భుజాల మీద



వేసుకొన్నప్పుడు గుచ్చుకోదు. తర్వాత ఈ స్లింగ్‌ను ప్రక్కలకు అతికి కొసలలో పురి విప్పాలి. ఈ బ్యాగ్ దృఢంగా వుంటుంది. దీనికి లైనింగ్ అవసరం

ఇప్పుడు పెద్దవాళ్ళకి పనికివచ్చే బ్యాగ్ గురించి తెలుసుకుందాం. ముందుగా హాండిల్‌ను పురికొసతో చుట్టుకోవాలి. తర్వాత మనకు కావలసినన్ని ముక్కలు విడివిడిగ రెండు హాండిల్స్‌కు వేసుకోవాలి. వీటికి I వ బొమ్మలోని ముళ్లు మాత్రమే వేయాలి. 2, 3 లైనులు ముళ్లు వేసిన తర్వాత రెంటినీ కలిపి అల్లాలి. ప్రతి ముక్కను మధ్యకు మడచి హాండిల్‌కు వేయాలి. ముక్క పొడవు 60




అంగుళాలుండాలి. కావలసిన ముక్కలు ఒక్కొక్క హాండిల్‌కు సుమారు 32 మొత్తం 64 ముక్కలన్న మాట. సుమారు 8, 9 అంగుళాల పొడవు అల్లుకొని ఆఖరున మామూలు ముడి అటొకటి ఇటొకటి ముక్కలలో వేసుకొని 4 అంగుళాలు వుంచి కత్తిరించి పురి విప్పాలి. దీనికి లైనింగ్, జిప్ వుంటేనే బాగుంటుంది.

ఇంకొక రకం బ్యాగ్ వెడల్పు మూతితో అనుకూలంగా వుంటుంది. (బొమ్మలో చూడండి) దీనికి కావలసిన సైజ్‌లో ఇనుప రాడ్‌ను వెల్డింగ్ చేయించి దీనికి పురికొస ముక్కలు వేయాలి రాడ్‌నుబట్టి 12 జతలకుగాను 96 ముక్కలు ముక్క పొడవు 110 అంగుళాలు వుంటే బాగుంటుంది. దీనిని ఒకచోట గోడకి రెండు మేకులు కొట్టి తగిలిస్తే, పుస్తకాలు, ఉత్తరాలు పెట్టుకువేందుకు ఉపయోగపడుతుంది. పుస్తకాలు అవీ ఎక్కడ పడితే అక్కడ వుండకుండా ఒకచోట చక్కగా అమరి వుంటాయి. ఈ బ్యాగ్‌కు రంగు వేయించే పనిలేదు.

మామూలు పూసలు ఎక్కించి వయర్ బ్యాగ్ అల్లిన విధంగా దీనిని అల్లవచ్చును. ఎటొచ్చీ పూస రంధ్రం కాస్త పెద్దదిగా చూసి ఎంచుకోవాలి.

సంధ్య, కలకత్తా

పర్ల్, నిట్ అని రాస్తూ వుంటారు కదా. వాటికి అర్థమేమిటో నాకు తెలియడం లేదు. ఉల్టా, సీదా అంటారు అదేనా?

నిట్ అంటే సీదా అనీ, పర్ల్ అంటే వుల్టా అని అర్థం.

# సంస్కృత పాఠమాల [11]

**आवाम्** అవామ్ = మేమిద్దరము. **युवाम्** యువామ్ = మీరిద్దరు

**आवाम् शकटेन गृहं गच्छाव :** అవామ్ శకటేన గృహం గచ్ఛావః = మేమిద్దరము బండిలో గృహమునకు వెళ్లుచున్నాము

**शकटं** శకటం = బండి (నపుం) **नौका** నౌకా = పడవ (స్త్రీలిం) నౌక **तरथ:** తరథః దాటు

**युवाम् नौकया नदीं तरथ:** యువాం నౌకయా నదీం తరథః—మీరిద్దరు నౌక మీద నదిని దాటుచున్నారు.

**शाकटिक:** శాకటికః బండివాడు (పుం) **नाविक:** నావికః పడవవాడు (పుం) **कशा** కశా = కొరడా స్త్రీ

**शाकटिक: कशया वृषभौ ताडयति** శాకటికః కశయా వృషభౌ తాడయతి. బండివాడు కొరడాతో ఎద్దులను కొట్టుచున్నాడు.

**ताडयति** తాడయతి = కొట్టు

**क्षेपणी** క్షేపణీ = తెడ్డు (స్త్రీ) **चक्रं** చక్రం (నపుం) చక్రము **पाद** పాద పాదము (పుం)

**नाविक: क्षेपण्या नौकां क्षिपति** నావికః క్షేపణ్యా నౌకాం క్షిపతి నావికుడు తెడ్డుతో నౌకను (పడవను) త్రోయుచున్నాడు.

**शकटं चक्राभ्यां गच्छति** శకటం చక్రాభ్యాం గచ్ఛతి = బండి చక్రములతో నడచుచున్నది.

**आह्वयति** ఆహ్వయతి = ఆహ్వానించు

**बालक: हस्तेन चन्द्रम् आह्वयति** బాలకః హస్తేన చంద్రం ఆహ్వయతి బాలుడు చేతితో చంద్రుని ఆహ్వానించుచున్నాడు.

**लता पुष्प: लसति** లతా పుష్పైః లసతి. లత పుష్పములను పూయుచున్నది.

**जना: पादाभ्यां गच्छन्ति** జనాః పాదాభ్యాం గచ్ఛన్తి = జనులు పాదములతో వెళ్లు (నడచు)చున్నారు.

**कपि:** కపిః = కోతి (పుం) **कपय:** కపయః కోతులు.

**खादन्ति** ఖాదన్తి = తినుచున్నవి.

**कपथ: फलानि खादन्ति** కపయః ఫలాని ఖాదన్తి = కోతులు పండ్లను తినుచున్నవి.

**अहं फलानि खादामि** అహం ఫలాని ఖాదామి నేను పండ్లను తినుచున్నాను.

**अश्वा:** అశ్వాః = గుఱ్ఱములు **अश्व:** అశ్వః గుఱ్ఱము. **तृणं** తృణం = గడ్డి **चरन्ति** చరంతి = మేయుచున్నవి.

**अश्वा: तृणं चरन्ति** అశ్వాః తృణం చరన్తి గుఱ్ఱములు గడ్డిని మేయుచున్నవి.

**सारथि:** సారథిః నడపువాడు **रथ:** రథః రథము **नयति** నయతి = నడుపుచున్నాడు.

**सारथि: रथं नयति** సారథిః రథంనయతి సారథి రథమును నడుపుచున్నాడు.

**हंसा:** హంసాః హంసలు **कूजन्ति** కూజంతి = కూయుచున్నవి.

**हंसा: कूजन्ति** హంసాః కూజంతి హంసలు కూయుచున్నవి.

**वृक्षा: फलन्ति** వృక్షాః ఫలన్తి వృక్షములు కాయుచున్నవి.

[సంస్కృత పాఠాల మీద సందేహాలున్నవారు 'వనిత'కు రాసి తెలుసుకోవచ్చును]



# అరటితో వంటలు

అన్ని తరగతులవారికీ అందుబాటులో వున్నది. అరటిపండే. మనదేశంలో ఉత్పత్తి అయ్యే పండ్ల మొత్తంలో మూడింట ఒక భాగం అరటిపండ్లు. అరటిపండు దేహానికి ఎంతో మేలు చేస్తుంది. భోజనానంతరం కదళీఫల సేవనం ఆరోగ్య ప్రదమని పెద్దలంటారు. పండును మాత్రమే కాదు, కాయను కూడా మనం తరచూ ఉపయోగిస్తూ వుండాలి. అరటికాయతోను, పండుతోను ఎన్నో రకాల వంటలు మనం చేసుకోవచ్చును. వాటిలో కొన్నింటిని ఇక్కడ వివరిస్తున్నాను.



### అరటికాయ సూప్:

**కావలసిన వస్తువులు:** అరటికాయ తురుము ఒక కప్పు, సన్నని ముక్కలుగా తరిగిన ఉల్లిపాయలు పావు కప్పు, నూనె ఒక టేబుల్ స్పూను, చిన్న బ్రెడ్ ముక్కలు ఒక కప్పు (కొద్దిగా రోస్ట్ చేసినవి), పాలు మూడు టేబిల్ స్పూన్లు, తగినంత ఉప్పు, మిరియాల పొడి.

**తయారు చేసే విధానం:** బాణలి పొయ్యిపై పెట్టి నూనె పోసి కాగాక ఉల్లిపాయ ముక్కలు, అరటికాయ కోరు వేసి కలుపుతూ బాగా వేయించాలి. ఈ మిశ్రమం వేగాక తగినంత నీరుపోసి దానికి ఉప్పు, మిరియాలపొడి కూడ వేసి మరగనివ్వాలి. అరటికాయ కోరు బాగా ఉడికాక పాలు పోసి కలిపి మరో రెండు నిమిషాలు వేగనివ్వాలి. తర్వాత రోస్ట్ చేసిన రొట్టె ముక్కలనువేసి మరోసారి బాగా కలిపి దించేసి, వేడిమీదనే వడ్డించవచ్చును.



### అరటికాయ పెరుగువడలు:

**కావలసిన వస్తువులు:** పెరుగు మూడు కప్పులు, అరటికాయలు నాలుగు, తగినన్ని పచ్చిమిర్చి, అల్లం, ఉల్లిపాయలు, ఉప్పు, కరివేపాకు, నూనె, పోపు దినుసులు.

**తయారు చేసే విధానం:** ముందుగా అరటికాయలను నీటిలో మెత్తగా ఉడికించి, అవి చల్లారాక పైపొట్టు తీసేసి చేత్తో మెత్తగా ముద్దచేసి పెట్టాలి. ఉప్పు, పచ్చిమిర్చి, ఉల్లిపాయ, అల్లం ముక్కలు తరిగి, వాటిని మెత్తగాదంచి, ఆ మిశ్రమాన్ని ఉడికించిన ముద్దకు వేసి కలపాలి. పొయ్యిమీద బాణలిపెట్టి కాస్త నూనె పోసి పోపు దినుసులు వేసి వేయించి దానిని పెరుగులోకి పోసి తగినంత ఉప్పువేసి కలిపి పెట్టాలి. ఇప్పుడు బాణలిలో నూనె తీసుకుని, మరిగాక అరటిముద్దను చిన్న సైజు వడలుగా చేతితోతట్టి అందులో వేయాలి. ఎర్రగా వేగాక తీసి నీటిలో వేయాలి. నీటిలో రెండు నిమిషాలు నాననిచ్చి తీసి నీరు పిండేసి (అరచేతుల మధ్య వుంచి నొక్కాలి) పెరుగులో వేయాలి. రెండు గంటలసేపు నాననిచ్చి తింటే చాలా రుచిగా వుంటాయి. (అరటికాయలను ఉడికించేటప్పుడు నీరు తగినంతగా తీసుకోవాలి. ఎక్కువ నీరుపోసి ఉడికించకూడదు.)



### అరటిపండు ఐస్‌క్రీం:

**కావలసిన వస్తువులు:** బాగా పండిన అరటిపండ్లకు తొక్క వొలిచి, పండును మెత్తగా ముద్దలా చేయాలి. ఈ ముద్ద మూడు కప్పులు, కాచి చల్లార్చిన పాలు రెండు కప్పులు, చక్కెర అరకప్పు; పాల పొడి ఒక కప్పు, నిమ్మరసం ఒక టేబుల్ స్పూను.

పాల పొడిని ఒక పాత్రలో తీసుకుని దానికి కొద్దిగా నీరు చేర్చి కలుపుకోవాలి. దీనిని, కాచి చల్లార్చిన పాలలోకి పోయాలి. ఇప్పుడు ఈరెండింటి మిశ్రమానికి చక్కెరపోసి శుభ్రమైన గరిటతో బాగా కలిపి పెట్టాలి. ఇప్పుడు ఒక పాత్రలోకి అరటిపండు ముద్దను వేసి దానికి నిమ్మరసం కలిపి ఒక కాడతో బాగా కలియపెట్టి పాల మిశ్రమం లోకి మళ్ళీ అంతా బాగా కలపాలి. ఈ మొత్తం మిశ్రమాన్ని ఒక పాత్రలోకి పోసి దాన్ని ఫ్రిజ్‌లో పెట్టి ఐస్‌క్రీం తయారు చేయాలి. ఈ ఐస్‌క్రీంతో బాటు ద్రాక్ష, చెర్రీపండ్లు, అనాస ముక్కలు కలుపుకుని తింటే చాలా బావుంటుంది. పండ్ల ముక్కలు లేకున్నా ఫరవాలేదు, వట్టి ఐస్‌క్రీం తినవచ్చును.



### అరటిపండు హల్వా:

**కావలసిన వస్తువులు:** పెద్ద అరటిపండ్లు ఆరు; చక్కెర రెండున్నర కప్పులు, నెయ్యి ఒకటింబావు కప్పు, జీడిపప్పు 50 గ్రా, మైదాపిండి ఒకటింబావు కప్పు, వెనిల్లా ఎసెన్సు ఒక టీ స్పూను.

**తయారు చేసే విధానం:** అరటిపళ్ళకు తోలు తీసి, చాకుతో సన్నని బిళ్ళలుగా ముక్కలు కోయాలి. బాణలిలో సగం నెయ్యి పోసి పళ్ళ ముక్కలు వేసి వేయించాలి. అయిదు నిమిషాలు వేగాకదించి, చల్లారనిచ్చి ఒక గరిటతో అంతా బాగా మెదిపి మైదాపిండి వేసి కాడతో బాగా కలిపి మళ్ళీ పొయ్యిపై పెట్టాలి. కాస్సేపు కలిపి మిగిలిన నెయ్యి, చక్కెర పోసి అడుగంటకుండా కలియపెడుతూ వుండాలి. చక్కెర పాకం కరిగి బాగా కలిసిపోతుంది. ఇప్పుడు నేతిలో వేయించిన జీడిపప్పు, వెనిల్లా ఎసెన్సు వేసి మరోమారు బాగా కలపాలి. హల్వావలె కాస్త గట్టిపడ్డాక దించేసుకోవాలి.

—గార్ల సరస్వతి

టెలిగ్రామా ?

ఎక్కడ నుంచో ?

ఈ టెలిగ్రాములు రాత్రిళ్లే ఎక్కువగా ఎందు కొస్తాయో ?

గుండె దడదడలాడసాగింది.

నేల మీద కాళ్ళు ఆగడం లేదు.

సత్యవతికి ఏమీ కాలేదు కదా ?

బాబు ఎలా ఉన్నాడో? ఏదైనా ప్రమాదమా ?

నిన్ననేగదా అందరూ బాగున్నారని ఉత్తరం వచ్చింది. ఏదైనా జరగడానికి–ముఖ్యంగా ప్రమాదం జరగడానికి ఎంతసేపు కావాలి? ఒక్క రోజు, ఒక్కగంట, ఒక్క నిమిషం చాలు! ఏమైనా జరగడానికి.

"సర్!"

ఛ! ఛ! ఎవరికీ ఏమీ కాలేదు!

మరి ఈ టెలిగ్రాం? ఏం దుర్వార్త మోసుకుని వచ్చిందో ?

సత్యవతికి ఏం కాలేదు. బాబుకూ ఏమీ కాలేదు.

మరి! వాళ్ళ నాన్నగారో, అమ్మగారో టికెట్ తన్నేశారో ఏమో!

"సర్! టెలిగ్రాం!" తలుపు దడదడ బాద సాగాడు.

రవీంద్ర తలుపు దగ్గరకు వచ్చాడు. బోల్టు తీశాడు. తలుపులు ఎంత గుంజినా రావడం లేదు.

ఏమైంది తనకు!

తలుపు రాదేం ?

తన చేతులు వణుకుతున్నాయ్!

వేళ్ళు కొంకర్లు పోతున్నాయ్!

తన చేతులు చచ్చుబడిపోతున్నాయ్యా ?

రవీంద్ర పళ్ళు బిగించి సత్తువకొద్దీ తలుపులు గుంజాడు.

ఊహూ!

రాదేం!

వర్షానికి తలుపులు బిగుసుకు పోయినట్టున్నాయ్! రంగులు వేయించినప్పటి నుంచీ ఇలాగే చీటికి మాటికీ బిగిసి పోతున్నాయ్!

వెధవ తలుపులు! ఆ చేసినవాణ్ణి పట్టుకొని తన్నాలనిపిస్తుంది.

"సర్! టెలిగ్రాం!"

వీడొకడు!

"ఆగవయ్యా! తలుపు రాక చస్తుంటేనూ!" గట్టిగా అరిచాడు రవీంద్ర.

"సర్! ఎంతసేపు...."

"తలుపులు రావడం లేదు. నువ్వు కూడా నెట్టు!" ఇంకా గట్టిగా అరిచాడు.



రవీంద్ర ఒక రెక్కను గట్టిగా అదిమిపట్టి రెండోరెక్క పట్టుకొని గుంజాడు.

పోస్టుమేన్ లోపలకు గాలితోపాటు వచ్చి పడ్డాడు.

నేల మీద చతికలబడి వున్న రవీంద్రను చూశాడు. వస్తున్న నవ్వును ఆపుకుంటూ "సర్! దెబ్బ తగిలిందా ?" అన్నాడు.

నుదుటి మీద లేచిన బొప్పిని నిమురుకుంటూ లేచి నిలబడ్డాడు.

"సర్! బాగా తగిలిందా ?"

"బాగా తగల్లేదులే!"

"నన్ను తలుపులు తొయ్యమని మీరు తలుపు పక్కనే నిలబడితే ఎలా సర్!"

"నీ టెలిగ్రాం అవతలవాడిని ఆలోచింపచేస్తుందా? పైగా అర్ధరాత్రి. నాకు తెలియక అడుగుతాను అర్ధరాత్రికే టెలిగ్రాములు ఎందుకు తెచ్చి యిస్తారయ్యా?"

"అదేమిటి సర్! పగలు కూడా ఇస్తాం! మాకు అందిన వెంటనే ఇవ్వాలని రూల్!"

టెలిగ్రాం అందించి సంతకం తీసుకొని వెళ్ళిపోయాడు పోస్టుమేన్.

రవీంద్ర టెలిగ్రాం విప్పాడు. చేతులు వణుకుతున్నాయ్.

టెలిగ్రాం చదివాడు.

నెత్తిమీద ఎవరో సుత్తితో బాదినట్టు కొయ్యబారిపోయాడు.

అలా మంచుముద్దలా ఎంతసేపు ఉండిపోయాడో అతనికే తెలియదు.

క్రమంగా సెగ సోకినట్టు అతనిలోని చల్లదనం కరగసాగింది.

మెదడు చురుగ్గా పనిచెయ్యసాగింది.

కల్పన చనిపోయిందా ?

ఇరవై ఏళ్ళయినా నిండని కల్పన జీవితాన్ని చాలించిందా!



సశేష నవల

# నింగినుండి నేలకు

వాసిరెడ్డి సీతాదేవి

హారిబుల్! హారిబుల్!

ఓ మైగాడ్!

ఇది నిజమా!

కాదు! కాదు!

తను కలగంటున్నాడు.

తెరిచి వున్న తలుపుల్లో నుంచి చల్లటిగాలి రివ్వున తోసుకొని వచ్చి "ఇది నిజమే" అని చెప్పింది.

రవీంద్ర చేతిలో వున్న కాగితం గాలికి రెపరెప లాడింది.

చేతిలోని కాగితంకేసి చూశాడు. తెరిచి ఉన్న తలుపులకేసి చూశాడు. తలెత్తి వెలుగుతున్న బల్బును చూశాడు.

ఇది కల కాదు!

ఇది నిజం!

ఇది వాస్తవం!

కల్పన చనిపోయింది.

ఎలా చనిపోయింది?

మరోసారి టెలిగ్రాం చదివాడు.

"కల్పన ఎక్స్‌పైర్డ్"

అంతే! అంతకంటే వివరాలు ఏమీ లేవు.

బయట హోరున వర్షం! ఈదురుగాలి! అయినా రవీంద్రకు ఊపిరి సలపడం లేదు. ముఖమంతా చిరుచెమట్లు పట్టాయి. అరచేతుల్లో చెమట.

యాంత్రికంగా లేచాడు. తలుపులు మూసి గడియపెట్టాడు. ముందు హాలులోనుంచి పడక గదిలోకి వచ్చాడు.

ఫ్యాన్ ఆన్ చేశాడు. సోఫాలో కూలబడ్డాడు.

ఫ్యాన్ మోతలో గోడ గడియారం చేస్తున్న శబ్దం కలిసిపోయింది.

పన్నెండు దాటింది.

కల్పన! తన కల్పన! కల్పనలాగే కరిగి పోయింది. ఘోరం జరిగిపోయింది.

ఇంతకీ ఈ టెలిగ్రాం ఎవరిచ్చారు?

ఎక్కడ్నుంచి వచ్చింది?

రవీంద్ర కళ్లు వెతికాయి.

టెలిగ్రాంలోని అక్షరాలు అలుక్కుపోయినట్టు కన్పిస్తున్నాయి. కళ్ళు నులుముకొని చూశాడు.

హైదరాబాదు నుంచి సిద్ధార్థ ఇచ్చాడు.

కల్పనకు ద్రోహం జరిగింది.

ఆ ద్రోహి ఎవరు?

సిద్ధార్థే!

సిద్ధార్థ కాదు! సిద్ధార్థ చాలా మంచివాడు. ఏ విషయంలోనూ తొందరపడడు. కాని పట్టుదల వస్తే మాత్రం వదలడు. సిద్ధార్థ అంత పని చెయ్యడు. అతను సెంటిమెంటల్ ఫూల్ కాదు. తనను ప్రేమించిందనీ, తనతో షికార్లు కొట్టిందనీ తెలిసి కూడా కల్పనను వివాహం చేసుకున్నాడు. అతని వ్యక్తిత్వమే అంత. తను! తనైతే చేసుకొనే వాడా?

సిద్ధార్థ కల్పనను చంపలేదు.

మరెవరు చంపారు?

"నువ్వే!"

"ఎవరు నువ్వు?"

"నీ అంతరాత్మను!"

"నేనేం చేశాను? నన్ను కాదని డబ్బు కోసం, హోదా కోసం సిద్ధార్థను పెళ్ళి చేసుకుంది."

"కాదు. నువ్వు వట్టి పిరికివాడివి! కల్పన కలల్లో బ్రతికే మనిషి. అది నీకు తెలుసు. ఆమె సిద్ధార్థను చేసుకోవడానికి నిర్ణయించుకుంది. ఆ నిర్ణయాన్ని విని నువ్వేం చేశావ్? మాట్లాడకుండా పిరికిపందలా అలిగి వెళ్లిపోయావ్! చాటుగా ఎన్నో కన్నీళ్లు కార్చావు. ఆమె మీద కసి తీర్చుకుంటున్నాననుకున్నావ్ పెళ్లి చేసుకుంటూ. ఆమె చిత్రమైన వ్యక్తి. ప్రేమించిన వాడిని పెళ్లి చేసుకోకూడదనే పిచ్చి భ్రమలో పడిపోయింది. పెళ్లయిన వెంటనే నీకు ఉత్తరం రాసింది. దానికి నువ్వు ఏం సమాధానం రాశావ్? హిపోక్రాట్! ఒకవైపు ఆమె కోసం ఏడుస్తూ నీతులు రాశావు గదూ?"

"చాలు! ఆపు!" చెవులు మూసుకుంటూ గట్టిగా అరిచాడు రవీంద్ర.

అయినా మాటలు వినిపిస్తూనే ఉన్నయ్!

"నీకు ఆమె ఉత్తరం చూసి వళ్ళు మండిపోయింది. ఒక రకమైన సంతృప్తి కూడా కలిగింది. ఆమెది ప్రేమ కాదనీ, ఉన్మాదం అనీ రాశావు. అందుకు కారణం ఆమెను బాధ పెట్టాలనే కోరికే; అయినా కల్పన కోపగించుకోలేదు. పిచ్చిది సార్థకనామధేయురాలు!"

"అబద్ధం! నేను ఆమెకు నిజంగానే సలహా ఇచ్చాను. వివాహం అయిన ఆమె జీవితాన్ని నాశనం చెయ్యడం ఇష్టంలేదు. పైగా ఆమె నా బాల్యమిత్రుడి భార్య. అతనికి ద్రోహం చెయ్యలేను."

"హ! హ!"

"ఏం ఎందుకా నవ్వు!"

"నీకు సిద్ధార్థ అంటే భయం. పెళ్లి అయాక కూడా తన భార్యతో నువ్వు సంబంధం పెట్టుకుంటే కాల్చి పారేస్తాడని భయం. ఇప్పటికీ నువ్వు కల్పనను తల్చుకుంటూనే నిట్టూర్పులు విడుస్తావ్.

పెళ్లి చేసుకున్నావ్!

అయినా కల్పనను మర్చిపోయావా? కల్పనకు ఇష్టమైన రంగు చీరలు నీ భార్య కోసం ఎందుకు కొంటావు?

ఆమె రాసిన ఆ చెత్త నవలల్ని ఎన్నిసార్లు చదివావు? ఎందుకు చదివావు? ఆమె అందులో వలకబోసిన ప్రేమంతా నీగురించేననేగదూ? ఆమె ఇంకా నిన్ను మర్చిపోనందుకూ ప్రేమిస్తున్నందుకూ ఎంత తృప్తిపడుతూ ఉంటావ్?"

"స్టాప్! ప్లీజ్! స్టాప్!"

రవీంద్ర వళ్లంతా చెమటపట్టింది. కాసేపు తల పట్టుకొని కూర్చుండిపోయాడు.

మళ్ళీ ఆలోచనలు తేనెటీగల్లా బుర్రలో శబ్దం చేస్తున్నాయ్. కల్పన చంపబడింది! అందులో సందేహం లేదు! ఎవరు చంపారు? ఇంకెవరు! ఆ రాస్కెల్! సిద్ధార్థే!

మరి తనకెందుకు టెలిగ్రాం ఇచ్చినట్టు?

కల్పన ఆత్మహత్యగానీ చేసుకోలేదుగదా!

ఏదైనా కొంపదీసి ఉత్తరం రాసిపెట్టిందేమో! అందుకు కారణం తనేనని రాసిందేమో?

రవీంద్ర షర్టు చెమటతో తడిచిపోయింది. లేచి వెళ్ళి ఫ్యాన్ వేశాడు.

అంతే అయి ఉండాలి. తనను కోర్టుకు లాగుతాడేమో సిద్ధార్థ! సిద్ధార్థ తల్చుకుంటే తనను ఏమైనా చెయ్యగలడు. కాని సిద్ధార్థ అలాంటి పనులు చెయ్యడు. చెయ్యగలిగీ ఇతరులకు హాని చెయ్యకపోవడమే గొప్పతనం. కొట్టగలిగీ, కొట్టకుండా అపరాధిని క్షమించడమే మంచితనం! ఆ రెండు గుణాలూ సిద్ధార్థలో ఉన్నయ్!

కాని....కాని....అతను తల్చుకుంటే తననూ తన కుటుంబాన్నీ సమూలంగా నాశనం చెయ్యగలడు!

కళ్ళు మూసుకొని అలసటగా మంచం మీదకు వాలాడు.

గోడలమీద ఏదో జంతువు గోళ్ళతో గీరుతున్న శబ్దం!

మళ్ళీ అంతలోనే అంతా నిశ్శబ్దం!

ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ గోడగడియారం "టిక్! టిక్!" మంటూ ఉన్నది. ఆ టిక్ టిక్‌లు రవీంద్ర గుండెల మీద సుత్తిపోట్లలావడుతున్నాయ్!

రోజూ ఈ గడియారం ఇంత శబ్దం చేస్తోందా! తనకు మరి ఎప్పుడూ ఇలా అనిపించలేదే!

మళ్ళీ గోడల మీద జంతువు గోళ్ళతో గీరుతోంది!

రవీంద్ర చివ్వునలేచి కూర్చున్నాడు.

వెనక ఎవరో నిల్చున్నట్టు అనిపించింది.

గిర్రున వెనక్కు తిరిగి చూశాడు.

ఎవరూ లేరు. కాని తనకంటే ఎవరో ఉసిగా తిరిగి మళ్ళీ తన వెనకే నిల్చున్నట్టుగా అనిపించింది.

వళ్ళు ఝల్లుమంది.

గుండె దడదడలాడసాగింది.

వంటరిగా అరణ్యంలో అర్థరాత్రి నడిచేవాడి పరిస్థితిలా ఉంది రవీంద్ర మానసికస్థితి.

వంటరిగా అరణ్యంలో నడిచేవాటికి ఎవరో తన వెనక నడుస్తున్నట్టు అనిపిస్తుంది.

అతను ఆగిపోతాడు. వెనక నడుస్తున్నవాడు ఆగిపోతాడు. గిర్రున వెనక్కు తిరిగిచూస్తాడు. ఎవరూ కనిపించరు. బలాన్ని కూడగట్టుకొని మళ్ళీ నడకసాగిస్తాడు. మళ్ళీ ఎవరో వెనక నడిచినట్టు అవుతుంది. ఆగిపోతాడు. అడుగు ముందుకు వెయ్యాలంటే భయంగా ఉంటుంది.

ఎవరూ లేరు!

అంతా తన భ్రమే!

ఏమిటీ పిరికితనం!

ఈ గదిలో మరెవ్వరూ లేరు. లేనే లేరు. తను ఒక్కడే ఉన్నాడు. అయినా ఇంకెవరో ఉన్నట్టూ తన ప్రతి ఆలోచననూ జాగ్రతగా కనిపెడుతున్నట్టూ అనిపిస్తున్నది. కల్పన ఆత్మ....ఆత్మ అంటూ ఉంటే—కల్పన చచ్చిపోతే అది మొదటిగా వచ్చేది తన దగ్గిరకే—కోరిక తీరకపోతే ప్రేతంగా మారతారట!

రవీంద్రకు వెన్నెముకలో ఏదో జరజర పాకినట్టు అయింది.

భయం! భయం!

తన వెన్నెముకలో భయం పారాడుతోంది!

ఈ భయం మనిషిని తినేస్తుంది.

ఇప్పుడే సత్యవతి కూడా లేకుండాపోవాలా? మాటకుముందు పుట్టింటికిపోయి కూర్చునే అలవాటు దానికి!

చిన్నప్పుడు స్నేహితులందరూ పందెం వేసుకున్నారు. అర్థరాత్రి ఊరిబయట ఉన్న తాటితోపులోకి వెళ్ళి తాటిమొవ్వ కోసుకొనిరావాలి. అలా తెచ్చినవాడు ధైర్యం కలవాడు. అతనే ఆ గ్రూపుకు నాయకుడు! అందరూ ఏదో క్లాసు చదువుతున్నారు. ఎవరూ సాహసించలేకపోయారు. ఆ పని సిద్ధార్థ చేశాడు. ఆ తెల్లవారి కల్పన కళ్ళు సిద్ధార్థను చూస్తూ ఎంత గర్వంగా మెరిశాయో! తనకేసి జాలిగా చూసింది. తనకు వళ్ళు మండిపోయింది. వారం రోజులు తను కల్పనతో మాట్లాడలేదు.

మొదటి నుంచీ తను పిరికివాడే!

అందువల్లనే కల్పనను దక్కించుకోలేకపోయాడు.

ఆమె ప్రేమకు తను అర్హుడు కాదు. తనలోని ఆత్మన్యూనతాభావమే ఆమె నుంచి తనను వేరు చేసింది.

ఎవరది!

ఉలిక్కిపడి చూశాడు!

కల్పన!

తలుపు వారవాకిలా తెరిచి పట్టుకొని నిల్చుని ఉన్నది!

ఆ కళ్ళు తననే చూస్తున్నాయి. అవి అలా నిప్పుగోళలా ఉన్నాయేం? కాదు....మిణుగురు పురుగుల్లా....యుగయుగాల నుంచి భమను తామే కాల్చుకుంటూ దేనినో అన్వేషిస్తున్నట్టు కణకణలాడుతున్నాయేం?

ఆ కళ్ళలో.....కసి.....కాదు.....తనకు అర్థం కాని భావం ఏదో ఉంది.

"ఎవరు నువ్వు?"

"పలకవేం?"

"అరే! నువ్వా! కల్పనా! ఇంత అర్థరాత్రి ఇక్కడికి ఎలా వచ్చావ్? ఎందుకు వచ్చావ్? ఎవరికైనా తెలిస్తే.........ముఖ్యంగా నా భార్యకు తెలిస్తే ఇంకేమైనా ఉందా?"

సమాధానం చెప్పదేం? అలా చూస్తుందేమిటి?

"అలా చూడకు! ఏవగించుకోకు! నేను నీకు ఉత్తరాలు రాయకపోవడానికి కారణం అర్థం చేసుకో. మనం ఇద్దరం వివాహితులం. నువ్వు ఆకాశంలో బ్రతకడానికి ప్రయత్నిస్తున్నావ్!"

అరే మాట్లాడదేం?

కల్పన కాదా?

ఆఁ మర్చిపోయాడు! కల్పన చచ్చిపోయిందని టెలిగ్రాం వచ్చిందిగా! మరి ఈ కల్పన....కల్పన దెయ్యం అయిందా?

అవును దెయ్యమే! తను తలుపులు వేశాడు! గడియ కూడా పెట్టాడు. దెయ్యం కాకపోతే లోపలకు ఎలా వచ్చింది?

కల్పన దెయ్యం అయిందా? తనను చూడటానికి వచ్చిందా?

రవీంద్ర త్రుళ్ళిపడి లేచి కూర్చున్నాడు.

నాలుక పిడచకట్టుకుపోతున్నది. బల్బు వెలుగుతూనే ఉంది. తలుపులు వేసే ఉన్నాయి.

తను చూసింది ఏమిటి?

కలా? కాదే! తను నిద్రపోలేదే?

కల్పన దెయ్యం అయిందా?

రవీంద్ర చలి కుదుపు వచ్చినట్టు నిలువెల్లా వణికిపోయాడు. గొంతు తడి ఆరిపోయింది. కూజా ఎత్తి గడగడా నీళ్ళు తాగాడు. చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కున్నాడు. కొంచెం తేరుకున్నాడు.

ఛ! తను దెయ్యాన్ని చూశాననుకోవడం ఏమిటి! తను హేతువాది! దేవుడి మీదే నమ్మకం లేదు. మరి తను కల్పనను అంత స్పష్టంగా ఎలా చూడగలిగాడు!

భయగ్రస్తమైన మనసు దేన్నయినా చూస్తుంది.

కాని కల్పన ఎలా చనిపోయింది?

సిద్ధార్థ చంపేశాడా?

టెలిగ్రాం తనకు ఎందుకు ఇచ్చినట్టు?

ఆమె చావుకూ తనకూ మధ్య ఏదో సంబంధాన్ని ముడిపెట్టడానికా?

తనను నేరస్తుణ్ణి చేసి ఉరికంబం ఎక్కించాలనా?

ఉరి! ఉరి!

గొంతు బిగుసుకుపోతూ ఉంది.
ఊపిరి అందడం లేదు.

"నేను కల్పనను చంపలేదు." వెర్రికేక పెట్టాడు. అతని కేక అతనికే వినిపించింది.

గోడ గడియారం రెండు కొట్టింది.

రవీంద్ర గడియారం కేసి చూశాడు.

ఇంకా రెండేనా? కాలం ఇంత మందకొడిగా నడుస్తున్నదేం? త్వరగా తెల్లవారితే బాగుణ్ణు!

పెట్టె చాటునుంచి చుంచుఎలుక తొంగిచూసింది. చూస్తూనే ఉన్నది. దాని కళ్ళు మెరుస్తున్నాయి.

"చుంచూ! ఏమిటి చూస్తున్నావ్! పగలంతా ఎక్కడ ఉన్నావ్?"

"కలుగులో! వెలుగు మాకు శత్రువు! అందుకే...."

"నువ్వే నా కంటే సుఖంగా ఉన్నావ్. నీకు ఆలోచనలు లేవు. ప్రేమలూ నిట్టూర్పులూ లేవు. పెళ్ళిళ్ళు అసలు లేవు. పిల్లల్ని మీరూ కంటారు. మీకు ఎలాంటి కట్టుబాట్లూ లేవు. సంఘ భయం లేదు. కుల మతాల ప్రసక్తి లేదు. నీతి నీతి అంటూ మడికట్టుకోవాల్సిన పని లేదు. పని చేసి మరొకర్ని పోషించాల్సిన బాధ్యత లేదు. హాయిగా దొరికింది తింటూ...."

చుంచు తల లోపలకు తీసుకుంది.

రవీంద్ర ఆలోచనల నుంచి బయటపడ్డాడు. తన ఆలోచనలకు తనకే నవ్వు వచ్చింది.-

తనకు నవ్వు వస్తుందేం? కల్పన చచ్చిపోయింది. అయినా తను నవ్వగలుగుతున్నాడు.

కోకిల కూత విన్పించింది.
దొడ్లో మామిడిచెట్టు ఉన్నది. పూత ఈ సంవత్సరం విరగబూసింది.

ఇంత అర్థరాత్రి అది ఎవరికోసం పాడుతూంది? ఎవరు వినాలని పాడుతూంది? గుండెల్ని చీల్చుకుంటూ వస్తున్నది దాని పాట! దాని గుండెల్లో అంత ఆర్తి ఉందా? ఇటువంటి ఆర్తినేనా కల్పన కోరుకున్నది? కోకిల ఒకరు వినాలని అరవడం లేదు. అది అరవకుండా ఉండలేదు! అందుకే అది అరుస్తోంది. అలాగే కల్పన తన కోసం ఆక్రోశించింది.




1. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో యావత్ ప్రపంచాన్ని గడగడలాడించిన అడాల్ఫ్ హిట్లర్ ఒక పుస్తకాన్ని రాశారు. ఆ పుస్తకం పేరేమిటి?
2. చంద్రమండలానికి భూమికి మధ్యగల దూరమెంత?
3. 'ది రిపబ్లిక్' అనే గ్రంథాన్ని రాసిన గ్రీక్ తత్వవేత్త ఎవరు?
4. గ్రహాలలో కల్లా అత్యధిక ఉష్ణోగ్రత గల గ్రహం ఏది?
5. నృత్యకళలలో గార్బా నాట్యం ఒకటి. అయితే ఈ నృత్యం ఏ రాష్ట్రానికి చెందినదో చెప్పగలరా?
6. చేపలలో కల్లా అత్యంత విషపూరితమైన చేప ఏది?
7. లోక్‌సభకి సభ్యులందరినీ ప్రజలే ఎన్నుకుంటారని అందరికీ తెలిసిన విషయమే. అయితే రాజ్యసభ సభ్యులలో కొందరిని రాష్ట్రపతి నియామకం చేస్తారు. వారెంత మంది?
8. అంతరిక్షంలో 'నడచిన' మొట్టమొదటి వ్యక్తి ఎవరు?
9. ఈ రోజుల్లో టైప్‌రైటింగ్, షార్ట్ హాండ్ నేర్చుకోవడమన్నది సర్వసాధారణమైపోయింది. మరి ఈ షార్ట్ హాండ్‌ను కనుగొన్న వ్యక్తి ఎవరు?
10. ఉత్తర ధృవాన్ని చేరుకున్న మొట్టమొదటి వ్యక్తి ఎవరో చెప్పగలరా?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి].

కోకిల కూత ఆగిపోయింది.

నిద్ర పోవాలి.

ఎలా నిద్రపోవడం ?

'' ఏం ఎందుకు పోలేవూ ? ''

తన మనసులోని మాటలు ఎవరు వింటున్నారు ?

ఎవరా ప్రశ్న వేసింది ?

ఎవరిదా కంఠం ?

కల్పన కంఠం। అవును ఆ కంఠం ఆమెదే।

'' చెప్ప వేం ? ఎందుకు నిద్రపోలేకపోతున్నావ్ ? ''

'' ఎవరో చచ్చిపోయారు। ''

'' ఎవరోనా ? ''

'' కాదు-కాదు-నా కల్పన చచ్చిపోయింది.''

'' నీ కల్పనా ? కల్పన నీది ఎలా అయింది ? ''

'' కల్పన నా దేవత....నా ప్రాణం....నా ప్రేమ....''

'' అహ్హహ్హ। '' పెద్దగా అట్టహాసం

'' ఎందుకు నవ్వుతున్నావ్ ? ''

'' ఎవరా నవ్వుతూంది? ఎందుకు నవ్వుతున్నావ్ ? కన్పించ వేం ? ''

'' ఎలా కన్పిస్తానూ ? నీ మనసులోనే ఉన్నాను. కల్పనకు పెళ్ళి అయింది. కల్పనను అవమానిస్తూ శరీరం ఇచ్చినవాడికే మనసు కూడా ఇవ్వమన్నావుగా ? మరి ఇప్పుడు కల్పన నీ ప్రాణం అంటావేం ? ''

'' కల్పన జీవితాన్ని ఎలా నాశనం చెయ్యగలను ? అనవసరమైన భ్రమల్నుంచి ఆమె మనసును మళ్ళించాలనుకున్నాను. అంతేగాని ఆమెను గాయపర్చాలని నేను అలా రాయలేదు.''

'' అబద్ధం। ''

అంతలోనే నిశ్శబ్దం।

ఎవరూ లేరు।

అవును। అన్ని కంఠాలూ తనలోనుంచే విన్పిస్తున్నయ్।

భయగ్రస్తమైన తన మనసు 'టిటవిన్' కు గురి అయినట్టు సలుపుతోంది.

'' నిద్రపోవాలనుకున్నావుగా ? ''

'' అవును। పోతాను : ''

'' మరి నీ ఆరాధ్య దేవత ? ''

'' చచ్చిపోయింది.''

'' అయినా నిద్రపోవాలని ప్రయత్నిస్తున్నావా ! ''

'' అవును। ఎవరి చావుకు ఎవరు శాశ్వతంగా నిద్రపోవడం మానేశారు ? ''

'' నిజమే। దానికి కారణం చెప్పగలవా ? ''

'' మనిషి ఎప్పుడూ సుఖం కోసం పాకులాడుతాడు. దుఃఖం నుంచి పారిపోవడానికి ప్రయత్నిస్తాడు.''

'' అదే స్వార్థం। ''

'' కాదు। అది ప్రాణి స్వభావం। ''

'' మరి కల్పన దుఃఖాన్ని కోరి వరించిందేం ? ''

'' అందులోనే సుఖం ఉందని ఆమె భ్రమ। దృష్టికోణాలు భిన్నంగా ఉంటాయి.''

'' వస్తు సత్యం అంటే ఏమిటి ? ''

'' అన్ని కోణాల నుంచీ వస్తువును చూడటం। ''

'' మరి నువ్వు ఆ పని చేస్తున్నావా ? ''

'' చేస్తున్నాననే అనుకుంటున్నాను.''

'' అబద్ధం। నువ్వు పిరికివాడివి। సత్యం పలకలేవు। ప్రియురాలితోనూ నిజం చెప్పలేవు. భార్యముందూ చెప్పలేవు. ప్రియురాలు ఉత్తరాలు రాస్తే రహస్యంగా బాత్ రూంలోకి వెళ్ళి చదువుకుంటావు.

నువ్వు చేస్తున్న దేమిటి? నీ మనసంతా కల్పన మీద। భార్యతో కాపరం చేస్తున్నావ్। పిల్లల్ని కంటున్నావ్। ఆమెకు చీరలు కొంటున్నావ్। నీ ప్రేమ వ్యవహారం ఆమెకు తెలుస్తుందేమోనని భయపడతావ్। అయినా కల్పనకు నీతులు బోధిస్తూ ఉత్తరం రాస్తావు।

'' ప్లీజ్ వెళ్ళిపో। ''

'' అసలు నీ దగ్గిరకు నేను వస్తేగా వెళ్ళిపోవడానికి। ''

'' నువ్వు వచ్చావ్। ''

'' నేను చచ్చిపోయాను। ఎలా వస్తానూ ? ''

'' నువ్వు దెయ్యం అయ్యావు। ''

'' మనసుని నమ్మనివాడివి దెయ్యాన్ని ఎలా నమ్ముతావ్। మనసు వేరూ శరీరం వేరూ కాదు, శరీరం ఇచ్చినవాడికే మనసు కూడా ఇవ్వమని రాశావుగా ? చెప్పేది ఒకటి। నమ్మేది మరొకటి। హిపోక్రైట్। ''

'' ప్లీజ్ ఇక మాట్లాడకు। నాకు మతిపోతోంది। నన్ను నిద్రపోనివ్వు। ''

'' పాట పాడనా ''

రవీంద్ర నిండుగా ముసుగు కప్పుకున్నాడు.

దూరంగా ఎవరో పాడుతున్నారు.

అది కల్పన కంఠమే.

అవును కల్పనే పాడుతున్నది.

''యాకుందేందు తుషారహార ధవళా।

యాశుభ్ర..........''

...............

కల్పన మనసు మనసులో లేదు.

ఆ రోజు భోజనం కూడా చెయ్యాలనిపించలేదు.

ఆఫీసుకు వెళ్తూ '' సాయంత్రం ఆరు గంటలకు తయారుగా ఉండు। లాయర్ దగ్గిరకు వెళ్లాలి।'' అని చెప్పాడు సిద్ధార్థ.

ఎంత తాపీగా చెప్పాడు।

వెళ్తూ వెళ్తూ '' ఇవ్వాళ నీ ప్రియుడు వస్తాడనుకుంటాను। నీ భవిష్యత్తు గురించి అతనితో సంప్రదించుకో.'' అంటూ వెళ్ళిపోయాడు.

ఎంత గర్వం। ఎంత అహం।

ఏమైనా తను బాధపడుతున్నట్టు కన్పించకూడదు. తనను వదిలేసి ఎంతకాలం ఉండగలడో తనూ చూస్తుంది।

అయినా కల్పనకు భర్త విడాకులు ఇస్తున్నాడని పూర్తిగా నమ్మకం కలగటం లేదు.

ఉదయం నుంచీ పడుకొనే ఉన్నది.

మనసులో ఏదో దిగులు।

సిద్ధార్థ కారులో ఎక్కించుకొని-ఏ సినిమాకో తీసుకెళ్ళి తనను ఆశ్చర్యంలో ముంచివేస్తాడు. అంతే। తనను భయపెట్టాలని చూస్తున్నాడు. తన మనసును లొంగదీసుకోవాలని చూస్తున్నాడు.

అంతే।

తను క్షమించమని అడిగితే।

నో। నో। అలా తను ఎన్నటికి చెయ్యలేదు.

కాలింగ్ బెల్ మ్రోగింది. మళ్లీ మ్రోగింది.

ఎవరూ తలుపు తెరవరేం ? అందరూ ఎక్కడ చచ్చారు ?

తను మర్చిపోయింది. సుబ్బమ్మ మార్కెట్‌కు వెళ్ళింది. రాముడు ఆఫీసుకు క్యారియర్ తీసుకెళ్లాడు।

మళ్లీ కాలింగ్ బెల్ మ్రోగింది.

కల్పన బద్ధకంగా లేచింది. ఈ సమయంలో ఎవరు వచ్చారు ? మిసెస్ రాజు కానీ కాదు కదా ?

అసలు ఆవిడవల్లనే తమ సంసారంలో ఇన్ని కలతలు రేగాయి. ఆవిడకు సిద్ధార్థ అంటే కోపం ఎందుకో ? కోపం కాదు ! ఈర్ష్య ! సిద్ధార్థ ఎదుటి వాళ్ళను క్షణంలో అర్థం చేసుకోగలడు.

కల్పన తలుపు తెరిచింది.

స్థాణువులా నిలబడిపోయింది.

ఎదురుగా నిల్చున్న రవీంద్ర కూడా కొయ్య బారిపోయాడు. కళ్ళు పెద్దవి చేసుకొని కల్పనను చూడసాగాడు సంభ్రమాశ్చర్యాలతో.

ఇది కలా ?

కాదు ! నిజమే !

ఇద్దరి భావాలూ ఒకటే !

కల్పన బ్రతికే ఉన్నదా ? మరి ఆ టెలిగ్రాం ఎందుకు ఇచ్చినట్టు ? సిద్ధార్థ ఇలాంటి పని ఎందుకు చేసినట్టు ? సిద్ధార్థ చెయ్యడు. ఎవరైనా తమ ప్రేమ వ్యవహారం తెలిసిన వాళ్లు చేసిన మోసంగానీ కాదు కదా ?

రవీంద్రా ! ఎందుకు వచ్చాడు !

సిద్ధార్థకు ముందే ఎలా తెలిసింది రవీంద్ర వస్తున్నట్టు ! సిద్ధార్థ తనకు విడాకులు ఇస్తున్నట్టు తెలిసి ఉంటుంది. అందుకే వచ్చాడు. వస్తున్నట్టు సిద్ధార్థకు తెలియజేసి ఉంటాడు !

తన రవీంద్ర వచ్చాడు. తమ ప్రేమ పవిత్ర మైనది. అక్షయమైనది. తను కష్టంలో ఉన్నట్టు తెలియగానే రెక్కలు కట్టుకొని తన ముందు వాలి పోయాడు. సిద్ధార్థకు గర్వభంగం అయింది ! "నీ ప్రియుడు ఆదుకుంటాడని పాపం ఆశిస్తున్నావా ?" అంటూ ఎన్నిసార్లు ఎత్తి పొడిచాడు !

రవీంద్ర తన కోసం వచ్చాడు.

అందర్నీ వదిలి తన కోసం వచ్చాడు.

రవీంద్ర తన వాడు !

తమ ప్రేమ అమరప్రేమ ! ఆదర్శప్రేమ; దానికి క్షయం లేదు. ఇక తనూ ! రవీంద్రా ! కలిసి వుండవచ్చును ! కాని కాని - ఇదేమిటి ? ఇలా కోరుకుంటున్నది ? ఛ ! తమ ప్రేమ అమర ప్రేమ ! దానికి మురికి అంటకూడదు.

రవీంద్ర తనకు చెయ్యి అందించడానికే వచ్చాడు. ఆ చేతిని తను అందుకోకూడదు ! అతనికి జన్మంతా దూరంగానే ఉండాలి. అదేగా తన ఆదర్శం !

మళ్ళీ తను త్యాగం చేసే సమయం వచ్చింది. మరోసారి రవీంద్ర మనసును గాయపర్చక తప్పదు. తన జీవితమే అంత ! త్యాగాల పుట్ట !

రవీంద్రను జాలిగా చూసింది.

రవీంద్ర మునుపటికంటే నున్నగా బొద్దుగా ఉన్నాడు. నిండుగా ఉన్నాడు. కాని ఆ ముఖంలో అదే బేలతనం !

సిద్ధార్థ ముఖంలో ఉండే హుందాతనం లేదు. ఆ కళ్లలో ఉండే దర్పం ఈ కళ్లలో లేదు.

"నువ్వు బ్రతికే ఉన్నావా ?"

కల్పన త్రుళ్లిపడింది. ఏమిటి రవీంద్ర అడుగుతున్నది ?

"మరి ఆ టెలిగ్రాం ఎవరిచ్చారు ?"



రోసా మార్టినెజ్ అనే అమెరికన్ యువతి ఈ మధ్య పిల్లల్ని కనే విషయంలో నూతన రికార్డును స్థాపించింది. అంటే ఆమె ప్రపంచంలో కల్లా అత్యధిక సంఖ్యలో పిల్లల్ని కన్నదని అర్థం కాదు. ఆమెకి ముచ్చటగా ముగ్గురే ముగ్గురు పిల్లలు. ఆ మూడో పిల్ల పుట్టి నెల కూడా కాలేదు. అయితే వింత ఏమిటీ అంటే — రోసా తన పిల్లల్ని ప్రసవాసుపత్రిలోనో, ఇళ్ళల్లోనో కనలేదు. మొదటి పాప న్యూజెర్సీ నగరం మీదుగా ఆమె రైలులో ప్రయాణం చేస్తూ వుండగా జన్మించింది. రెండవ పాపని వర్జిన్ దీవులలో విమానాశ్రయంలోని విరామ మందిరంలో ఆమె కన్నది. ఇక మూడవ కుమార్తె గత నెల ఆమె అట్లాంటిక్ సముద్రం మీదుగా పోర్టరికాలోని సాన్‌జాన్ నుంచి చికాగో నగరానికి ప్రయాణం చేస్తుండగా విమానంలో పుట్టింది....మరి నాల్గవ శిశువు ఎక్కడ పుడుతుందో....ఏమిటో మరి !

"ఏ టెలిగ్రాం ?" అయోమయంగా అడిగింది.

"అదే నువ్వు చచ్చిపోయావని ఎవరో సిద్ధార్థ పేరు మీద టెలిగ్రాం ఇచ్చారు."

కల్పనకు అర్థం అయింది. నిట్టూర్చింది.

"సిద్ధార్థే ఇచ్చి వుంటాడు !"

"అంటే ?"

"లోపలకురా చెబుతాను."

రవీంద్ర లోపలకు వచ్చి కూర్చున్నాడు.

"కాఫీ తాగుతావా ?"

"ఇప్పుడేమీ వద్దు ! ముందు ఇది చెప్పు ! సిద్ధార్థ అలాంటి టెలిగ్రాం ఎందుకిచ్చాడు ? నీ పిచ్చి అతనికి కూడా తెలిసిందా ?"

"నాది పిచ్చి కాదు."

"మరి ప్రేమా ?"

"కాదంటావా ?"

"అసలు ఏం జరిగిందో చెప్పు !"

కల్పన అంతా చెప్పింది. రవీంద్ర వింటూ కూర్చున్నాడు.

"సిద్ధార్థ చాలా గొప్పవాడు."

కల్పన అయోమయంగా చూసింది.

"నా ఉత్తరం అతనికి ఇచ్చానన్నావు. అయినా అతను నిన్ను ఆదరించాడు. గౌరవించాడు. భార్య స్థానాన్ని ఇచ్చాడు. నువ్వే ఆ స్థానాన్ని నిలుపుకోలేక పోయావు."

"నువ్వూ అతన్నే సమర్థిస్తున్నావా ?"

"బుర్ర ఉన్న ఎవరైనా అతన్నే సమర్థిస్తాడు."

"నన్ను వేశ్య అన్నాడు."

"నువ్వు అలాగే ప్రవర్తించావు."

"ఉంపుడుగత్తె అన్నాడు."

"అయినా నీకు జ్ఞానోదయం కాలేదు. అతను ఎందుకన్నాడో నీకు అర్థం కాలేదు. నేను అతని స్థానంలో ఉంటే ఏం చేస్తానో తెలుసా ?"

కల్పన రవీంద్ర ముఖంలోకి చూసింది.

"పెళ్లయిన వెంటనే అలాంటి ఉత్తరం నా భార్య ప్రియుడి నుంచి వస్తే, మరుక్షణం ఆమెను ఇంట్లో నుంచి బయటికి నెట్టేస్తాను. మళ్లీ ముఖం చూడను. నాలో అంత విశాల హృదయం లేదు."

రవీంద్రేనా ఇలా మాట్లాడుతున్నది ?

కల్పనకు తను నిర్మించుకున్న స్వర్గధామం

ఒక్కొక్క పెళ్ళే విరిగి కాళ్లముందు పడిపోతు న్నట్టు అనిపించింది.

"రవీ! నేను చేసింది తప్పు అంటావా? నేను నిన్ను మనసారా ప్రేమించాను. నా మనసును మరొకరికి ఇవ్వలేను. వివాహం సామాజికబంధం. అది శరీరానికి మాత్రమే సంబంధించింది. నువ్వు మాత్రం నీ భార్యను ప్రేమించగలిగావా?"

"నేను నా భార్యను ప్రేమిస్తున్నాను. నాకు ఒక కొడుకు కూడా ఉన్నాడు. వాడు నాకు ప్రాణం!"

"మేము విడిపోతున్న సమయంలో నన్ను ఆదుకోవటానికి వచ్చావనుకున్నాను."

"ఇది కథ కాదు. కల అంతకంటే కాదు. నేను వివాహితుణ్ణి. ఎప్పుడో ప్రేమించిన స్త్రీ కోసం కట్టుకున్న భార్యనూ, కన్నకొడుకునూ వదిలేసి వచ్చేసేంతటి నీచుణ్ణి కాదు. జీవితానికి ప్రేమ ఒక్కటే పరమార్థం కాదు. మనిషిగా అనేక కర్తవ్యాలు నిర్వహించాలి." రవీంద్ర ఉద్రేకంగా చెప్పుకుపోతున్నాడు.

కల్పన నిర్మించుకున్న స్వర్గం విరిగి కాళ్ళ ముందు పడిపోయింది. మనసు విలవిలలాడి పోయింది.

"ఇప్పుడు నన్నేం చేయమంటావ్?"

"నీ భర్తను క్షమాపణ వేడుకో! ఇంతకాలం తెలివి తక్కువగా కలల్లో బ్రతికినందుకు సిగ్గుపడు తున్నానని చెప్పు!"

"ఆ పని నేను చెయ్యలేను."

"కలలు కనడం తప్పుకాదు. కలల్నే వాస్తవాలని భ్రమపడడమే తప్పు. నీలో ఏదో ఒక ప్రత్యేకత ఉందని మొదటినుంచీ నీకు ఒక భ్రమ పట్టుకుంది. చౌకబారు ప్రేమ నవలలు చదివి గాలిమేడల్లో నివసించడానికి ప్రయత్నించావు. నువ్వు రాసిన నవల ఎలా వుందని అడిగావు ఉత్తరం ద్వారా. పరమచెత్తగా వుంది. అటువంటి నవలలు చదివి నీలాంటి మరికొంతమంది ఆడపిల్లలు జీవితాలను నాశనం చేసుకుంటారు. అలాంటి నవలలు రాయడం మానెయ్!"

"ఇవ్వాళ ఆయన లాయర్ దగ్గిరకు ఏడు గంటలకు తీసుకెళ్తానన్నాడు. నీకు టెలిగ్రాం ఇచ్చాడు. నువ్వు ఆదుకుంటావో లేదోనని చూడ టానికే! నన్ను అవమానించడానికి ఆ పని చేశాడు. నేను ఏం చెయ్యాలో చెప్పు!"

"చెప్పానుగా!"

"ఆ పని మాత్రం చెయ్యలేను."

"అయితే ఒకటి చెయ్!"

"ఏమిటి?" ఆశగా రవీంద్ర ముఖంలోకి చూసింది.

"ఆత్మహత్య చేసుకో!"

కల్పన రవీంద్ర ముఖంలోకి వెర్రిచూపులు చూసింది.

"నేను వెళ్తున్నాను." లేచి నిలబడ్డాడు రవీంద్ర.

"ఆయన వచ్చేంతవరకూ ఉండు!"

"ఉండను! ఆ ఉత్తముడి ముఖం చూడలేను. నేను వెళ్తున్నాను. నువ్వు ఇకనుంచి నాకు ఉత్తరాలు కూడా రాయకు. నా భార్యకు తెలిస్తే బాధపడుతుంది."

"మన ప్రేమ గురించి నీ భార్యకు తెలియదా?"

"తెలియదు. తెలియాల్సిన పనిలేదు. వయసులో ఉన్నప్పుడు ఏదో ఉన్మాదంలాంటిది ఆవహిస్తుంది. దాన్నే తల్చుకుంటూ జీవితాన్ని నాశనం చేసు కోవడం నాకు ఇష్టంలేదు."

"మన ప్రేమ ఉన్మాదమా!"

"అవును! అదో రకమైన ఉన్మాదం! నేను వెళ్తున్నాను."

మరో మాటకు అవకాశం ఇవ్వకుండా రవీంద్ర వెళ్ళిపోయాడు.

కల్పన మంచుబొమ్మలా కూర్చుండిపోయింది. మస్తిష్కం మొద్దుబారిపోయింది.

రవీంద్ర తనను ఆత్మహత్య చేసుకోమన్నాడు. ఎంత నిర్దయగా మాట్లాడాడు? ఇతని కోసమేనా తను ఇంతకాలం కలల్లో బ్రతికింది. తన భర్త తనను ఏనాడూ ఆత్మహత్య చేసుకోమనలేదు. విడిపోయాక కూడా తనకు ఇబ్బంది కలుగుతుం దేమోనని అన్ని హంగులూ ఏర్పాటు చేశాడు.

తను నేల విడిచిన సాము చేసింది. పిచ్చి భ్రమల్ని పెంచుకుంది. జీవితపు విలువల్ని అర్థం చేసుకోలేకపోయింది. గాలిలో మేడలు కట్టుకొని అందులో నివశించాలని ఆశించింది.

కట్టుకున్న భర్తను అనేకవిధాల బాధపెట్టింది. అవమానించింది! ఎందుకు? ఎవరి కోసం?

స్త్రీ సహజమైన మాతృత్వాన్ని కూడా అవమా నించింది. దేనివల్ల? అదొక ఉన్మాదం.... ఉన్మాదం.... నిజమే!

రవీంద్ర భార్యను ప్రేమిస్తున్నాడట! తను అతని చుట్టూ ఎన్ని భ్రమల్ని అల్లుకుంది! అతనికి తన కొడుకు ప్రాణం! కాని తను...తను ఏం చేసింది? ఏ స్త్రీ చెయ్యని పని చేసింది. సిద్ధార్థ సహించాడు.

సిద్ధార్థ వ్యక్తిత్వంతో పోల్చి చూస్తే రవీంద్ర వ్యక్తిత్వం వెలా తెలా పోతున్నది. పిరికివాడు. తనైతే భార్యను బయటికి నెట్టేసేవాడట! ఎంత చిన్నబుద్ధి!

ఇప్పుడు తనేం చెయ్యాలి?

తన భర్తను క్షమించమని కోరాలి! ఆయన తప్పక క్షమిస్తాడు. తనలోని మార్పుకు ఉబ్బి పోతాడు. తనను మనసారా గుండెలకు హత్తు కుంటాడు. ఆ బలమైన చేతుల్లో తను—

ఇంతకాలం తనను ఏదో భ్రమ ఆవహించింది. మత్తులో ఉన్నది. నల్లమందులాంటి సాహిత్యం తను చదివింది. చుట్టూ రంగుల ప్రపంచాన్ని నిర్మించుకున్నది. తన భర్త చెప్పినట్టు తను ఆకా శంలో ఎగరడానికి ప్రయత్నించింది. కిందపడ్డది. గాయపడింది. కాని ఆ గాయాన్ని తన భర్త మాన్పుతాడు!

కల్పన ఉత్సాహంగా ముస్తాబు చేసుకొని భర్త కొరకు ఎదురుచూస్తూ కూర్చుంది.

# 19

కల్పన సిద్ధార్థ కొరకు ఎదురుచూస్తూ కూర్చుంది.

కారు ఆగిన శబ్దం అయి బయటికి వచ్చింది.

"ఇవ్వాళ ఇంత ఆలస్యం అయిందేం?" ఉత్సాహంగా అడగబోయి సిద్ధార్థ ముఖం చూసి ఆగిపోయింది.

అతను భార్యకేసి చూసి నిర్లక్ష్యంగా ముఖం తిప్పుకొని లోపలకు వచ్చాడు. కారు కీస్‌ను విలా సంగా ఊపుతూ ఉత్సాహంగా ఉన్నట్టు కన్పించాడు.

కల్పనకు వళ్ళు మండిపోయింది. అతను అంత ఉత్సాహంగా ఉండటానికి కారణం ఏమిటో? రేపు లాయర్ దగ్గిరకు వెళ్తున్నామనా? అంటే తనను నిజంగానే వదిలించుకోవాలనుకుంటున్నాడా? వెంటనే వివాహం చేసుకుంటాడా?

ఆలోచిస్తూ అతని వెనకనే లోపలకు వచ్చింది.

"రవీంద్రకు నేను చచ్చిపోయినట్టు టెలిగ్రాం ఇచ్చావా?"

"ఇచ్చాను!"

"కారణం తెలుసుకోవచ్చునా ?"

"రేపు వేరు ఇంట్లోకి వెళుతున్నావుగా? తోడు ఉంటాడని !"

"చచ్చిపోయినట్టు ఎందుకిచ్చావ్ ?"

"బ్రతికి ఉన్నావంటే రాడు అని !"

"అలా ఎందుకనుకుంటున్నావ్ ?"

"అతని గురించి నీకంటే నాకు బాగా తెలుసు కనక."

"నేను వేరు ఇంటికి వెళ్తే అతను నాతో ఉంటాడని ఎందుకు అనుకున్నావ్ ?"

"నేను అనుకోలేదు."

"మరి ! అతన్ని రప్పించడంలో నీ ఉద్దేశం ?"

"ఇంకా నువ్వు నింగి అంచులు పట్టుకొని వేలాడడానికి ప్రయత్నిస్తున్నావ్ కనక. అతను నిన్ను ప్రేమిస్తున్నాడనీ, నీకు కష్టం వచ్చిందంటే పెళ్ళాం బిడ్డల్ని వదిలేసి నీ కాళ్ళ దగ్గిరే పడి ఉంటాడని భ్రమ పడుతున్నావనీ నాకు తెలుసును కనక !"

"నీలా చాలా కృయల్టీ ఉన్నది."

"అవును ! అందువల్లనే ఇంతకాలం భరించాను."

సిద్ధార్థ గ్లాసు తీసుకొని టేబుల్ మీద పెట్టాడు. కల్పన గబగబా వెళ్లి ఫ్రిజ్‌లో నుంచి స్కాచ్ బాటిల్ తీసుకొచ్చి పెట్టింది.

"థాంక్యూ ! పర్వాలేదు. పెళ్లాంలా ప్రవర్తించడానికి ప్రయత్నిస్తున్నావ్."

"ఇలాంటి మాటలు ఇక ఆపేస్తే సంతోషిస్తాను."

సిద్ధార్థ విస్కీని గ్లాసులోకి వంపుకున్నాడు. కల్పన ఫ్రిజ్‌నుంచి నీళ్ళ బాటిల్ తెచ్చి పెట్టింది. నీళ్ళు వంపుకొని సిప్ చేస్తూ ఆలోచిస్తున్నాడు.

"రవీంద్ర వచ్చాడు."

"వచ్చాడు ! వెళ్లాడు కూడా !"

"నీకు తెలుసా ? కన్పించాడా ?"

"ఆ మాత్రం ఊహించగలను. చెప్పానుగా రవీంద్ర గురించి నీకంటే నాకు బాగా తెలుసునని."

సిద్ధార్థ తెలివైనవాడు. అతని నిండుతనాన్నీ ఆత్మ విశ్వాసాన్నీ అహంకారంగా ఇంతకాలం భావించింది.

"ఏమన్నాడు ?"

"ఎవరు ?"



# పూసలతో దండ

ఇప్పుడు ప్రతి వనితకి పూసలతో అల్లకం తెలిసినదే కదా! ఈ పూసలతో కుర్చీలు, బొమ్మలు, చాలా రకాలు అల్లుకుంటున్నాం. ఇప్పుడు పూసలతో దేవుని పటాలకి వేసే దండలు కూడా తయారు చేయవచ్చు. ఈ దండలని మీరు కూడా చేసి చూడండి.

ఈ దండ చాలా చవకగా, తేలికగా చేయవచ్చు. దండ అంతా ఒకేరంగు పూసలయితే చాలా బాగుంటుంది.

కావలసినవి :

1. దోస గింజ ఆకారంలో వున్న తెల్లపూసలు పెద్దవి - 40 గ్రాములు. ఇవి ఒక గ్రాముకి 8 పూసలు తూగుతాయి.

ఇటువంటి పూసలు సుమారు 200 తీసుకోవాలి.

2. తెల్లని పూసలు చిన్నవి (గుండ్రంగా వుండేవి)-50 గ్రాములు.

3. ఎర్రని ఎరుపురంగు పూసలు చిన్నవి (గుండ్రనివి)-20 గ్రాములు.

4. షో బటన్స్-11

ఏ రంగు అయినా సరే—ఏ రంగు పూసలకైనా వాటికి మేచ్ అయ్యే బటన్స్ అయితే బాగుంటుంది

5. సన్నని వైర్ కట్ట.

విధానం : మొదట దండలోని మధ్య చిన్న పువ్వులని, తర్వాత దానికంటే పెద్ద పువ్వు తయారుచేసుకోవాలి. మొదట వైరుకి ఒక పెద్ద పూసని తర్వాత రెండు చిన్న తెల్ల పూసలనీ, వాటి తర్వాత మరొక తెల్ల పెద్ద పూసని వేసి మొదలు పెట్టాలి



ఈ విధంగా పెద్ద వాటిని (పూసలు) 14 తో ఒక గుండ్రని చిన్న పువ్వులాగ చెయ్యాలి.



వీటిపైన ఒక చిన్న తెల్లపూసల వరస, మూడవలైన్‌లో ఎరుపు రంగు పూసలతోటి పూర్తి చేయాలి. ఇప్పుడు పువ్వు పూర్తయినట్లే. ఇటువంటివే 10 పువ్వులను తయారుచేసుకుని వేరుగా వుంచుకోవాలి.

ఇప్పుడు మధ్యలోని పెద్ద పువ్వు తయారు చేసుకోవాలి. ఇంత వరకు తయారు చేసిన చిన్న పువ్వుమాదిరి దానినీ ఇంకోదానినీ తయారు చేసి దానిపైన మరల ఇంకోవరస పొడవు తెల్లపూసలు, 2 చిన్న పూసలు వరసల చివర ఎర్ర పూసలు వేసి అల్లాలి. యిప్పుడు మధ్యలో పెద్ద పూవు తయారవుతుంది.

అన్ని పువ్వులు తయారయిన తర్వాత వాటిని చిన్న తెల్ల పూసలతో ఒకదానికి మరొకటి అతికించాలి. ఇప్పుడు ఈ దండలోని 11 పువ్వులకు మధ్యన గుండ్రని ఖాళీ ఏర్పడి వుంటుంది. ఈ ఖాళీని చక్కని షో బటన్స్‌తో పూర్తిచేయాలి. ఇప్పుడు ఈ దండ చాలా అందంగా, చాలా చక్కగా వుంటుంది. ఈ దండను మన దేవుళ్ళ పటాలికి పెద్దల పటాలకి అలంకరిస్తే చాలా అందంగా వుంటుంది.

—వకుళ

"నీ ప్రియుడు!"

కల్పన మాట్లాడలేదు.

"నీకేం భయం లేదు, నేను ఉన్నాను. మన ప్రేమకు చావు లేదు. సూర్యచంద్రులు ఉన్నంత వరకూ మన ప్రేమ ఉంటుంది. సిద్ధార్థ విడాకులు ఇస్తే నీకేం భయం? నాకు పెళ్ళాం అక్కర్లేదు. పిల్లలు అక్కర్లేదు. నీ కోసం అన్నింటినీ వదులుకుంటాను. నీ ప్రేమ ఉంటే చాలు. ఇంకేమీ అక్కర్లేదు. తిండి అక్కర్లేదు. బట్టలు అక్కర్లేదు...."

"ఇక చాలు ఆపు...." దాదాపు అరిచినట్టే అన్నది కల్పన.

"'ఓ నా కల్పనా! నా ఆరాధ్య దేవతా! నీ కోసం ఏం చెయ్యమంటావో చెప్పు!' అని ఒక చెయ్యి గాలిలోకి మరో చెయ్యి గుండెల దగ్గిరగా పెట్టి డైలాగులు చెప్పాడా?"

"ఎందుకు నన్ను ఇలా ఏడిపిస్తావ్!"

"ప్చ! ప్చ! నేను నిన్ను ఏడిపిస్తున్నానా? నువ్వు ఏడవడం ఏమిటి మామూలు ఆడదానిలాగా!"

కల్పన కింది పెదవిని పైపంటితో నొక్కుకుంటూ వస్తున్న దుఃఖాన్ని అణుచుకోవడానికి సతమతమౌతున్నది.

సిద్దార్థ కల్పన ముఖంలోకి చూశాడు.

"నీ ప్రియుడు ఏమన్నాడో చెప్పవేం?"

"ఆ మాట అనవద్దు. ఒక చపట! అతన్ని నేను ప్రేమించడం ఏమిటి? అతన్ని చూసి చాలాకాలం అయింది. మాట్లాడి చాలాకాలం అయింది. వయసులోని ఉన్మాదాన్ని ప్రేమ అనుకొని భ్రమ పడ్డాను. అంతే! అతన్ని నేను ప్రేమించలేను. అతని వ్యక్తిత్వం నీ వ్యక్తిత్వం ముందు దిగదుడుపే!"

"నాకు ముఖస్తుతి మాటలు ఇష్టం ఉండదు. అయినా ఇదేమిటి ఇలా మొదలెట్టావ్?"

"నువ్వు అన్నట్టు నేను ఇంతకాలం ఆకాశంలో బ్రతకడానికి ప్రయత్నించాను. నేలవిడిచిన సాము చేశాను."

"ఓహో! జ్ఞానోదయం కలిగినట్టుంది. మంచి బోధే చేసి వెళ్ళినట్టున్నాడు."

"అతడు నాకు బోధ చేసేదేమిటి?"

"అయితే నీకే జ్ఞానోదయం అయిందంటావ్? పాపం! చాలా ఆలస్యం అయిపోయింది. కబీర్‌దాస్ కవిత్వం ఒకటి విన్నావా?"



**జి. అనూరాధ**

కొందరు బాల్యంలోనే కళలలో అనురక్తి చూపిస్తారు. ప్రావీణ్యతా సంపాయిస్తారు. అటువంటి వారిలో కుమారి గుడివాడ అనూరాధ ఒకరు. తన పన్నెండవ ఏటనే కూచిపూడి, భరత నాట్యం, జానపద నృత్యాలలో ప్రదర్శనలిచ్చి ప్రముఖుల ప్రశంసలు పొందిన అనూరాధ విశాఖపట్నం సెయింట్ జోసెఫ్స్ కాన్వెంట్‌లో ఎనిమిదవ తరగతి చదువుతున్నది. విశాఖపట్నం శ్రీ శారదా ఫైన్ ఆర్ట్స్ అకాడెమీ వారు నిర్వహించిన కార్యక్రమాల్లో పాల్గొన్న అనూరాధ పై మూడు నృత్య రీతులలోనూ ప్రదర్శనలిచ్చి, ఆనాటి సభకు విచ్చేసిన ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ సాలూరు రాజేశ్వరరావుగారి ద్వారా మెమెంటో అందుకున్నది.

"ఏమిటి?"

"అబ్ పఛ్‌తాయే క్యా హోత హై
జబ్ చిడియా చుగ్ గయీ ఖేత్"

"అంటే?"

"తీరా పక్షులు పంటంతా తినేశాక ఇప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనం ఏమిటి? అని దాని అర్థం."

"ప్లీజ్! అసలే నా మనసు బాగాలేదు. నన్ను హింసించకు." దాదాపు ఏడుపు గొంతుతో అన్నది.

సిద్దార్థ విస్కీ తాగుతూ కూర్చున్నాడు.

"ఇవ్వాళ నన్ను ఎక్కడికైనా తీసుకెళ్ళు. ఇక్కడే కూర్చుంటే పిచ్చెక్కేలాగుంది."

సిద్దార్థ నొసలు ముడిచి, కళ్ళు చిట్లించి కల్పన ముఖంలోకి చూశాడు.

"ఎక్కడికి?" సాలోచనగా చూస్తూ అన్నాడు.

"క్లబ్బుకు వెళ్దాం!"

"సారీ!"

"పోనీ! సినిమాకు వెళ్దాం! కాదనకు ప్లీజ్!"

"అలాగే! ఆఖరు కోరిక! తయారవు!" అన్నాడు సిద్దార్థ.

కల్పన సంతోషానికి అవధులు లేవు. అంత దిగులూ క్షణంలో మాయం అయింది.

కల్పన ముస్తాబై ఉత్సాహంగా భర్తముందుకు వచ్చి నిలబడింది.

సిద్దార్థ కల్పన కేసి కన్నార్పకుండా చూశాడు.

"మీకు ఇష్టం అయిన చీరకట్టుకున్నాను."

"అలాగా! ఈ చీర నాకు ఇష్టమా?"

"మీరు ఎన్నిసార్లు అన్నారు?"

"నాకు గుర్తు లేదు."

"ఈ చీరలో నేను అప్సరసలా ఉంటానని అన్నారు."

"అలాగా?" వ్యంగ్యంగా అన్నాడు సిద్దార్థ.

"ఈ చీర చాలా కాలం తర్వాత కట్టుకున్నందుకు మీకు సంతోషంగా లేదా?"

"లేదు."

కల్పన బిక్క మొహం వేసింది.

"పోనీ ఈ చీర ఈ రోజు ఎందుకు కట్టుకున్నానో ఊహించగలరా?"

"అనవసరమైన విషయాలకు బుర్ర ఉపయోగించను."

రేడియోలో సన్నగా పాట విన్పిస్తోంది.

"నేను ఈ రోజు చాలా సంతోషంగా ఉన్నాను."

"అది సహజమే!"

"ఎందుకనో చెప్పండి."

"ఈ రోజు నీ బానిసత్వానికి చివరి రోజు! రేపు పదిగంటలకు లాయర్ దగ్గిర సంతకాలు అవుతాయ్!"

"కాదు. మొదటిరోజు. నా వైవాహిక జీవితం ప్రారంభం కాబోతున్న రోజు."

సిద్దార్థ భార్య ముఖంలోకి లోతుగా చూశాడు.

"నాకు వివాహం అయి రెండేళ్ళు అయింది. అయినా నా వివాహ జీవితం ఈ రోజు నుంచే ప్రారంభం కాబోతున్నది."

[సశేషం]



# కల్తీ వస్తువులు కనుగొనడం ఎలా?

పండక్కి కూతురు, అల్లుడు వచ్చారన్న సంబరంలో రుక్మిణి ఎంతో ప్రేమతో పిండివంటలు చేసింది. కాని ఆ ఆనంద సంరంభం కాస్తా అంతలోనే హరించుకుపోయింది. కారణం అవి తిన్న దగ్గర్నుంచి ఆ యింట్లో అందరికి వాంతులు, కడుపుబ్బరం పట్టుకున్నాయి. ఆ పరిస్థితి విషమించక ముందే వైద్యుడి దగ్గరికి వెళ్ళబట్టి సరిపోయింది. లేకపోతే....

అసలు మనం తరచు యిటువంటి వార్తలు వింటూనే వుంటాము. 'ఆహారపదార్థాల కల్తీవల్ల ఫలానా చోట యింతమంది మరణించారు.... యింతమంది ఆస్పత్రి పాలయ్యారు' అని.

అందులో ఈరోజుల్లో వస్తువుల ధరలు నానాటికీ పెరిగిపోతున్నట్టే వ్యాపారస్తుల పేరాశ కూడా పెనుభూతంలా పెరిగిపోతోంది. దాంతో వారు నూనెల దగ్గర్నుంచి పప్పు బెల్లాలదాకా అన్నిటినీ కల్తీమయం చేస్తున్నారు. ఇతరుల అనారోగ్యమే వారి మహాభాగ్యంగా భావించే ఈ వ్యాపారస్తులు వినియోగదార్ల ఆరోగ్యం గురించి ఎందుకు పట్టించుకుంటారు ?

సాధారణంగా పాలల్లో నీళ్ల కలపడం, నేతిలో వనస్పతి కలపడం – యిటువంటి కల్తీల గురించి మాత్రమే మునుపటి రోజుల్లోని గృహిణికి తెలుసు.

కాని నేడు కల్తీ అన్ని వస్తువులకి విస్తరించింది. ఆహారపు నూనెలో ఆముదాన్ని కలపడం వల్లనే రుక్మిణి అంత బాగా పిండివంటలు చేసినా అందరికి వాంతులు, విరేచనాలు పట్టుకున్నాయి. ఇంకా నయం. అందులో ఏ బ్రహ్మదండి గింజల నూనో కలిపి వుంటే కంటిచూపు పోవటమో, గుండె జబ్బు కలగడమో సంభవించి వుండేది.

వ్యాపారస్తులు కల్తీకి ఉపయోగించే కొన్ని పద్ధతులు గురించి తెలుసుకుందాం.

· ఒకసారి ఉపయోగించిన టీ పొడి పిప్పికి రంగు వేసి టీ పొడిలో కలిపి అమ్మడం కూడా జరుగుతున్నది. అట్లాగే సైజులనిబట్టి చిన్న, పెద్ద లంక పప్పుని కంది, శెనగపప్పులలో కలుపుతున్నారు. నిజానికి లంకపప్పుగానీ, దాని పిండిగానీ అమ్మకం చెయ్యడం — చట్టరీత్యా నిషేధింపబడింది. ఇక బియ్యంలో రాళ్లు కలపడం సర్వసాధారణమైపోయిందనుకోండి.

ఎండిన బొప్పాయి గింజలు చూడడానికి అచ్చం మిరియపు గింజల్లా వుంటాయి. వీటిని అలా హఠాత్తుగా చూస్తే మనం పోల్చుకోలేము. అందువల్లనే వ్యాపారస్తులు కానిని మిరియపు గింజల్లో మరిన్ని బొప్పాయి గింజలు కలిపి అమ్మకం సాగిస్తున్నారీమధ్య. మిరియాలు ఘాటుగా వుండడం లేదంటే ఎలా వుంటాయి మరి ?

పసుపుపొడికి రంగు వేసిన తౌడు కలుపుతున్నారు. కారపుపొడికి రంపం పొట్టు కలుపుతున్నారు. క్యాసియా చెక్క చూడ్డానికి దాల్చిన చెక్కలా వుంటుంది. ఈ క్యాసియా దాల్చిన చెక్కవలె చలామణీ అయిపోతున్నది నేడు. అంతటితో ఊరుకుంటే యిక వ్యాపారస్తుల ఘనతేముంటుంది? తేనెలో బెల్లం పానకం కలిపి 'మందార మకరంద మాధుర్యము గ్రోలుము' అంటూ ప్రకటనలతో టోల్తా కొట్టించేస్తున్నారు.

పిప్పరమెంట్లు, స్వీట్లు, చల్లని పానీయాలు తయారు చేయడానికి ప్రభుత్వం కొన్ని రంగులని పరిమితం చేసింది. అయితే ఈ పరిమితులని అధిగమించి అనుమతించబడని 'మెటానిల్ ఎల్లో', 'రొడమిన్-బి' మొదలైన రంగు పదార్థాలని ఉపయోగిస్తున్నారు. ఇవి శరీరానికి హాని కలిగిస్తాయి.

ఈ కల్తీలు కేవలం ఆహారపదార్థాలకే కాక మనం వాడే మందులకి కూడా వ్యాపించాయి. అంటే ఒకవేళ ఎవరైనా కల్తీ ఆహారం తిన్న తర్వాత మందు తీసుకోవాలన్నా ఆ మందు విషయంలో కూడా జాగ్రత్తగా వుండాలన్న మాట. ఒకవేళ అది కూడా కల్తీదే అయితే? బాగా జనాదరణ పొందిన మందుల పేర్లలో కాస్త స్పెల్లింగు మార్చి 'మందులు' మార్కెట్ చేయబడుతున్నాయి. అందువల్ల మందులు ఖరీదు చేసేప్పుడు బ్రాండ్ పేరు, మందు పేరు బాగా పరిశీలించి చూసి అది ప్రముఖ సంస్థ తయారుచేసిందేనా.... వైద్యుడు రాసిచ్చినదేనా అని రూఢి చేసుకొని మరీ కొనవలసి వస్తున్నది.

కొన్ని ఆహార పదార్థాలలో కల్తీకి ఉపయోగించే వస్తువులు–కలిగే వ్యాధులు

| ఆహారపదార్థం | కల్తీకి ఉపయోగించే వస్తువు | కలిగే వ్యాధులు |
|---|---|---|
| 1. ఆవనూనె | బ్రహ్మదండి గింజల నూనె | కంటిచూపు పోవడం, గుండెజబ్బు, వాపులు, నంజువ్యాధి |
| 2. వంటకి ఉపయోగించే నూనెలు | ఆముదం | అధిక విరోచనాలు, వాంతులు |
| 3. కొబ్బరి నూనె | రాతినూనె | కాలేయం దెబ్బతిని క్యాన్సర్ వ్యాధి సంభవించడం |
| 4. శెనగపిండి | లంకపప్పు పిండి | కాళ్లు, చేతులు పడిపోయి పక్షవాతం ఏర్పడడం, |
| 5. పసుపుపొడి | లెడ్ క్రోమేట్ | కంటి చూపుపోవడం, మూర్చరోగం |
| 6. తీపి, కారం తినుబండారాలు, పానీయాలు | మెటానిల్ ఎల్లో వంటి అనుమతింపబడని రంగులు | కాలేయం దెబ్బతినడం, క్యాన్సర్ వ్యాధి |
| 7. ఆల్కహాల్ పానీయాలు | మిథైల్ ఆల్కహాల్, క్లోరల్ హైడ్రేట్ | కంటి చూపు పోవడం, మరణం సంభవించడం |
| 8. కారపుపొడి | రంపపుపొట్టు, ఊక | కడుపునొప్పితో బాధపడడం |

అయితే ఈ కల్తీ వస్తువులని కనుగొనడానికి మార్గమేదైనా వున్నదా— అంటే వుంది. •కాని ఈ పరీక్షలన్నీ కేవలం ప్రయోగశాలలలోనే సాధ్యమవుతాయి.

మొదట టీ పొడి విషయమే తీసుకుందాం. టీ బాగా లేదని మీకు అనుమానం కలిగిందనుకోండి. టీ పొడిని నీటిలో ముద్దగా చేసి తడి అద్దుడు కాగితం (బ్లాటింగ్ పేపర్) పై కొంతసేపు వుంచాలి. అది రంగు వేసినపొడి అయినట్లయితే ఆ రంగు కాగితానికి అంటి అది కల్తీది అని స్పష్టంగా తేలిపోతుంది.

ఇక తినుబండారాలకు, పప్పులు, పసుపు, పానీయాలు మొదలైన వాటికి మెటానిల్ ఎల్లో అనే రసాయన పదార్థాన్ని కలుపుతూ వుంటారు. ఈ రంగుగల ఆహారపదార్థానికి పదిశాతం హైడ్రోక్లోరిక్ ఆమ్లాన్ని కలిపి నట్లయితే వెంటనే ఎరుపురంగుగా మారిపోతుంది. దాన్నిబట్టి మెటానిల్ ఎల్లోని గుర్తించవచ్చు.

నూనెలో గాఢ నత్రికామ్లం వేసి బాగా కలిసేటట్లు గిలకరించినట్లయితే ఆమ్లభాగంలో ఏర్పడే ఎరుపు రంగునుబట్టి ఆ నూనె బ్రహ్మదండి గింజల నూనెతో కల్తీ చేయబడినట్లు గుర్తించవచ్చును. నూనెలో ఆముదాన్ని కలిపారని తెలుసుకోవాలంటే పరీక్షానాళికలోకి స్పూనుడు నూనె తీసుకుని పెట్రోలియం-ఈథర్‌లో కరిగించి, ఐస్-ఉప్పు మిశ్రమంలో ఐదు నిముషాలు పరీక్షానాళికలోనే మిశ్రమాన్ని చల్లబరిస్తే నూనె పాలవలె తెల్లగా మారుతుంది. అలా మారినట్లయితే ఆముదం కలసినట్లు లెక్క. అట్లాగే నేతిలో వనస్పతి కలిసినట్లయితే ఒక పెద్ద స్పూనుడు నేతిని పరీక్షానాళికలోకి తీసుకుని చిటికెడు పంచదార, నేతికి సమాన పరిమాణంలో గాఢ హైడ్రోక్లోరిక్ ఆమ్లం వేసి బాగా కలిసేటట్లు ఆ మిశ్రమాన్ని గిలకరించినట్లయితే ఆమ్లభాగానికి ఎరుపు రంగు ఏర్పడుతుంది.

పాలల్లో ఈ మధ్య కొందరు ప్రబుద్ధులు నీళ్ళనేకాక పిండి కూడా కలుపుతున్నారు. ఇది తెలుసుకోవాలంటే పది చుక్కల పాలల్లో రెండు చుక్కల టించర్ ఐడిన్ వేసినట్లయితే పాలరంగు నీలిరంగుగా మారుతుంది. దీన్నిబట్టి పాలల్లో పిండి కలిసినట్లు తెలుసుకోవచ్చు. ఇక దాల్చినచెక్కలో క్యాసియా చెక్క కలపడం సులభంగా తెలుసుకోవచ్చు. దాల్చినకు వుండే సుగంధవాసన క్యాసియాకు వుండదు.

ఇలా కల్తీ వస్తువుల నెన్నిటినో ప్రయోగశాలలో పరీక్షల ద్వారా తెలుసుకోవచ్చు. కొన్నిటిని మనమే ఇళ్ళలో పరీక్షించి గ్రహించవచ్చును.

ఆహారపదార్థాలు కల్తీ చేసినట్లు ప్రయోగశాలలో రూఢి అయినట్లయితే కల్తీ నిరోధకచట్టం (1954) కింద ఆ కల్తీ చేసినవారికి తగిన జరీమానా, కఠిన జైలుశిక్ష విధించబడుతుంది. వస్తువులని కల్తీ చెయ్యడం, కల్తీ చేసిన వస్తువులని అమ్మడం ఘోరమైన నేరం. కాబట్టి ఈ విషయం దృష్టికి వచ్చిన వెంటనే అధికారులకి తెలియబరచడం ప్రతి పౌరుని ప్రధాన కర్తవ్యం.

తెలియబరచవలసిన చిరునామా :

ఔషధ, ఆహార (ఆరోగ్య)

శాసన పాలనాధికారి,

తారనాక, సికింద్రాబాద్-500017

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-53' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు నవంబర్ 30వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1980 జనవరి సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. నేత్రారోగ్యానికి అందానికి
2. కితకితలు పెట్టే చెట్టు ?
3. చిగిర్చిన లేత కొమ్మ
4. వనితలో వచ్చిన 'నీడ వెనక నిజం' కథా రచయిత్రి పేరులోని తొలి అక్షరాలు
5. వరసలు
6. ఇప్పుడు చెలామణిలో లేనే లేదు; మొదటి అక్షరమూ లేదు.
7. వంట ఇంటి దినుసు
8. రానున్నది—
9. రమతా
10. అలా ఇలా పోయిన కొడుకు
11. ఎన్నికల్లో గెలిచి చేబట్టాలనుకునేది
12. మధ్యభాగం లేని పట్టణము
13. చెదిరిన స్త్రీ

### ఆధారములు - నిలువు

1. బంగారము కాని బంగారము
2. ముక్కంటి భార్య
7. శ్రీకృష్ణుని అంటారు.
8. జరిగిన కథ
9. భయం !
14. జలపుష్పం అటూ ఇటూ అయింది.
15. భూమిలోంచి కాయలోకి వస్తుంది.
16. కొత్త దంపతులు పోసుకుంటారు
17. ఖండింపబడినదే ఆదిలో ఖండింపబడింది.
18. గాలి, వాన
19. పోయినసారి బామ్మగారు దీని గురించి చెప్పారు
20. ఈ మధ్య వనితలో ఒక చిట్టి కథ రాసిన అమ్మాయి పేరు
21. ఇలా ఈ వరస-సంగీత స్వరాల్లో వినవస్తుంది.



## చిట్టి కథ

# పాపం సుబ్రావ్

సుబ్రావ్ ఆఫీసులో కూర్చున్నాడన్న మాటేగాని, మనసంతా అదోలా వుండి, ఆలోచనా ప్రవాహంలో ఈదులాడుతున్నాడు. కడుపులో పేగులు రొద పెడుతున్నాయి. (నీ ఆలోచనలు తరువాత.... ముందు మా సంగతి చూడమని). క్రొత్తగా పెళ్ళయి, ముచ్చటగా కాపురం మొదలుపెట్టిన సుబ్రావ్‌కి అంతలేసి ఆలోచనలేమిటా....అని అనుమానం రావచ్చు. కాని కారణం తెలిస్తే అయ్యో....పాపం! అన్పించక మానదు. ఇంతకీ అతనిని వేధించే సమస్య........భార్యామణిగారి చేతివంట. కాపురం పెట్టిన మొదటి రెండ్రోజులూ అవీయివీ సర్దుకునే హడావుడిలో, హోటల్లో భోంచేసేశారు. అప్పుడు కాస్త కడుపునిండా ఏం తిన్నాడో....అంతే! ఆ తరువాత అంటే భార్యగారు వంట మొదలు పెట్టిన దగ్గర్నుండి, ఆవిడ చేతి అమృతం ఆస్వాదించలేక, క్రొత్తలోనే వంకలు పెట్టి, ఆవిడ మనసు నొప్పించలేక ఎంతో బాధపడుతున్నాడు.

అలా బోల్డంతసేపు ఆలోచించగా....చించగా... గొప్ప ఐడియా తట్టింది సుబ్రావ్ బుర్రకి. ఆహా! ఏమి నా తెలివితేటలు....ఈ దెబ్బతో మన కష్టాలన్నీ గట్టెక్కినట్టే అనుకుంటూ, హుషారుగా ఆఫీసు పని తెముల్చుకుని, సాయంత్రం అయిదు గంటలు కొట్టేసరికల్లా, బయటపడి, తిన్నగా ఓ పుస్తకాల షాపుకేసి దారి తీశాడు. వంటకి సంబంధించిన పుస్తకాలేవయినా వుంటే ఇమ్మ న్నాడు. షాపువాడు అందుకే ఎదురు చూస్తున్నట్లు, టక్‌మని ఓ పుస్తకం తీసి, 'ఇది చాలా మంచి పుస్తకం సార్. కొత్తగా వచ్చింది. వెల కూడా సరసం' అంటూ ఓ పుస్తకాన్నిచ్చాడు. సుబ్రావ్ అది పాక్ చేయించి, డబ్బు చెల్లించి, ఇంటిదారి పట్టాడు.

మొన్నామధ్యనెప్పుడో ఓ ఫ్రెండ్ ఇంటికెళ్తే "వంటా-వార్పు" అనే పుస్తకం కన్పించింది. అది గుర్తురాబట్టి ఇప్పుడు తన సమస్య పరిష్కార మయ్యింది అనుకుంటూ, తన తెలివినీ, జ్ఞాపక శక్తినీ అభినందించుకుంటూ, ఇంట్లో అడుగు పెట్టాడు.

'సుజా....ఓ సుజా....త్వరగా రా' అంటూ ఓ పొలికేక పెట్టాడు. వంటింట్లో వంకాయకూరతో కుస్తీపడుతున్న సుజాత గాభరాగా పరిగెత్తు కొచ్చింది. చేతులు వెనక్కి పెట్టుకొని, నేనేం తెచ్చానో చెప్పుకో – అంటున్న సుబ్రావ్‌ని మురిపెంగా చూస్తూ 'చీర... 'అంది. (అబ్బబ్బ, ఈ ఆడవాళ్ళకి చీరలూ, నగలూ తప్ప మరో ఆలోచన రాదుగదా, అని మనసులో అనుకొని, 'కాదు.'అన్నాడు. 'ఏంటబ్బా.'అని బుగ్గన వేలుంచు కొని, కాసేపు దీర్ఘాలోచనలోపడి, పొయ్యి మీద కూర మాడువాసన రావడంతో కంగారుగా వంటింటి వేపు వెళ్ళింది. ఏం తెచ్చారో అనే ఆశ నిలువనీ యక, అది అలా దించిపెట్టేసి, మళ్లీ వచ్చింది. సుబ్రావ్‌కి ఆ వాసనకి తల తిరిగినా, రేపటినుండి పుస్తకం వుందిగా....అని తన్నుతను ఓదార్చుకుని, 'ఇంకో ఛాన్స్' అన్నాడు. 'ఓడిపోయాను గానీ, త్వరగా చెప్పండీ....'అన్న సుజాత కనులముందు పాకెట్ వుంచాడు.

గబగబా విప్పి, పుస్తకం చూసిన సుజాత ఆశ్చర్యపోయి, 'అరే! ఈ పుస్తకమా? ఇది మీకెక్కడిది?'అంది. సుబ్రావ్ గర్వంగా నవ్వుతూ, 'షాపులో కొన్నాను. నువ్వు ఇకనుండీ ఈ పుస్తకం చూసి, వంట చెయ్యాలి'అన్నాడు.'కొనడమేమిటండీ ఖర్మ. అసలు పుస్తకం ఎవరు వ్రాశారూ. ఏమిటి? అని ఏమైనా చూశారా?' అంది. 'ఏం? మంచి పుస్తకం కాదా? నచ్చకపోతే ఇచ్చేసి ఇంకోటి తెస్తానులే' అన్నాడు.

'మహాశయా....ఒక్కసారి ఇటు చూడండి' అంటూ పేజీ తిరగేసి రచయిత్రి పేరు చూపిం చింది సుజాత. రచయిత్రి పేరు–కె. సుజాత. 'అంటే అంటే. ..'అన్నాడు గుటకలు మింగుతూ.

"ఆ సుజాతే – ఈ సుజాత. ఆ పుస్తకం పెళ్ళికాకముందు వ్రాశాను. పెళ్లి హడావుడిలో చెప్పడం మరిచాను. నా దగ్గర కూడా కాపీ లున్నాయి. వాటిలో వంటలే కదా రోజూ చేస్తు న్నాను. మీరు చూసి తెచ్చారేమో అనుకుంటు న్నానుస్మీ..."అంటూ వుపన్యాసం దంచుతున్నదల్లా, "హతోస్మి", అంటూ కుర్చీలో దబ్బుమని పడిపోయిన సుబ్రావ్‌ని చూసి, విషయం అర్థం కాక, నీళ్ళుతెచ్చి జల్లుదామని, వంటింట్లోకి పరిగెత్తింది శ్రీమతి సుజాతా సుబ్రావ్ "ది గ్రేట్ వంటల" రచయిత్రి.

—ఇంద్రాణి రత్నాకర్



# శ్రీమతి రెబెల్లో ఐ.ఏ.ఎస్

'ఆడవాళ్ళు, ఐ ఏ ఎస్ ఆఫీసర్లా? యింక అయినట్లే పనులు!' అని పెదవి విరిచి, నవ్వేవాళ్లు యిప్పటికీ వున్నారు. పరిపాలనా రంగంలో స్త్రీలు అంతగా రాణించరన్న మాట పురుషులేకాదు, స్త్రీలూ అంటూనే వుంటారు. మంచి ఆఫీసర్లుగా పేరు తెచ్చుకోవడం చాలా కష్టం. ముఖ్యంగా స్త్రీ జనానికే ఆఫీసర్లుగా పనిచేసే స్త్రీలు!

సరే, యిదంతా ఎందుకుగానీ, ఇక్కడ ఫొటోలో వున్న నాజూకైన ఆమెని నేను అడిగాను "ఏమండీ, ఒక అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా మీ అనుభవం చెప్పండి. మగవాళ్ళకి మహిళా ఆఫీసర్లంటే గౌరవం వుంటుందా?" అని.

ఆవిడ నవ్వారు. వేగంగా, అయినా తియ్యగా మాట్లాడుతారామె. "నామట్టుకునాకు హైదరాబాద్ దగ్గర్లోనే సబ్‌కలెక్టరుగా పనిచేయబట్టి, ఎక్కువ అనుభవం లేదేమో జిల్లాలోని పరిస్థితులని గురించి. జిల్లా కలెక్టరుగా పనిచేస్తే చాలా శ్రమ వుంటుంది టూరింగు వల్ల. మరి అప్పుడు నాపట్ల ప్రజలభావం ఎలా వుండేదో! కానీ నేను అర్థం చేసుకున్నది ఏమిటంటే, మగవాడు ఎప్పుడూ కూడా ఉద్యోగిని అయిన స్త్రీ శక్తి సామర్థ్యాలను ఒక బేరీజు, తూకం వేయడానికి ప్రయత్నిస్తాడు. మనం శక్తీ, శ్రద్ధా రెండూ వున్న వ్యక్తులమనీ, 'స్త్రీలము' అని ఏవో ప్రత్యేకమైన కన్సెషన్లు అడగమనీ వారికి నిర్ధారణ అయిపోతే, చాలా గౌరవం చూపిస్తారు. నిజానికి, అయ్యో-యీమెకు యింట్లో పిల్లలూ వగైరా బాధ్యతలు వుంటాయికదా-యీమెనెందుకు కష్టపెట్టడం అని, ఎక్కువపని వత్తిడి వున్న సమయాల్లో ప్రత్యేకమైన సానుభూతితో ప్రవర్తిస్తారు. అయితే, గౌరవం లభింపచేసుకోవడం పూర్తిగా మన వ్యక్తిగత లక్షణాలమీదే ఆధారపడి వుందని నా అభిప్రాయం."

శ్రీమతి డాఫ్నే మార్గరెట్ డి. రెబెల్లో 1964 వ సంవత్సరం నుంచీ, మన ఆంధ్రప్రదేశ్‌లో అనేక పదవులు నిర్వహించారు. హైదరాబాదు జిల్లా సబ్‌కలెక్టరు, రెవెన్యూశాఖలో అండర్ సెక్రటరీ మొదలైన ఉద్యోగాల తర్వాత, ప్రస్తుతం విద్యాశాఖ సంయుక్త కార్యదర్శినిగా వున్నారు. పాఠశాల విద్య, ముఖ్యంగా ప్రాథమిక విద్య, ఆ తర్వాత వయోజన విద్య, యీ విభాగాలకు 'సంబంధించిన' ప్రభుత్వ విధానాలను రూపొందించడం యీమె బాధ్యతల్లో ముఖ్యమైనవి.

1960 వ సంవత్సరం నుంచి 1977 వరకు గల 17 సంవత్సరాల కాలంలో ఈమె మన దేశంలోనూ, అమెరికాలోనూ మూడు ఎమ్.ఏ. డిగ్రీలు, పి. హెచ్. డి. పట్టా, ఐ. ఏ. ఎస్. లో ఉత్తీర్ణత - సాధించారు. ఆమె పొందిన అవార్డులూ, స్కాలర్‌షిప్పులూ, అధ్యాపక హోదాలోనూ, రిసెర్చి విభాగాల్లోనూ ఆమె చేసిన కృషీ; ప్రచురించిన పుస్తకాలు, పరిశోధనా వ్యాసాలూ అన్నీ పూర్తిగా చెప్పడానికి ఈ చిన్న వ్యాసంలో చోటు సరిపోదు. ఆమె కృషికి గుర్తింపు మనకి అర్థం కావాలంటే, ఇటీవలే జరిగిన ఒక జాతీయస్థాయి ఎంపిక గురించి తెలుసుకోవచ్చు. దేశం మొత్తాన, ఈమె పేరును ప్రపంచ బ్యాంకి ఎడ్యుకేషన్ స్పెషలిస్టు పదవికి సిఫారసు చేసింది భారత ప్రభుత్వం. మూడేళ్ల పాటు వాషింగ్టన్‌లో నిర్వహించవలసిన బాధ్యత అది - నియామకం జరిగాక.

"మీరెందుకు ఎన్నుకున్నారు ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు?" అని అడిగాను.

"నాకు చిన్నప్పుడు స్కూల్లో చదివే రోజుల్నుంచీ, నలుగురితో కలిసి మాట్లాడ్డం యిష్టం. నిజానికి మా అమ్మా, నాన్న నేనొక లెక్చెరరుగా స్థిరపడాలనీ, ఆడవాళ్ళకి యిల్లాంటి ఉద్యోగాలు తగినవి కావనీ అనుకునేవారు. కానీ, నేను ఐ. ఏ. ఎస్. చేస్తానంటే గట్టిగా వద్దనలేదు."

"రెండు విషయాలు అడుగుతాను. మామూలువేగానీ, మీ అభిప్రాయం వినాలని. ఉద్యోగం చేసేవాళ్ళు ఇంటా, బయటా రెండు బాధ్యతలు నిర్వహించడం కష్టమేనంటారా? ఆఫీసుల్లో పని చేయడంలో స్త్రీలు ఎంతవరకు దక్షత చూపిస్తారు? — వారి పనితీరు ఎట్లా వుంటుంది? — అన్నట్లు, ఆడవాళ్ళకి ఉద్యోగాల్లో రిజర్వేషన్లు అవసరమా?" — ఇవీ నా ప్రశ్నలు స్త్రీలూ-ఉద్యోగాలు గురించి.

ఆమె అన్నారు — "నాకు తెలిసినంతవరకు ఆడవాళ్ళు చాలా దీక్షతో పని చేస్తారు. అటూ ఇటూ తిరగడం, సమయం వృథా చేయడం వుండదు. ఐతే, ఇంట్లో కారణాల వల్లా, తమకీ, పిల్లలకీ అనారోగ్య కారణాలవల్ల సెలవులు ఎక్కువ పెట్టవలసిన అవసరం వస్తుంటుంది. మీరన్నట్లు రెండు బాధ్యతలూ నిర్వహించడం కష్టమే. ఆఫీసు పని అసంపూర్ణంగా వదలడానికి వీలు కాదు కనుక, ఇంట్లో పనే నిర్లక్ష్యం చేయడం జరుగుతుంది. ఉద్యోగాల్లో రిజర్వేషన్లు అవసరం లేదనుకుంటాను. మనకి అన్నిట్లోనూ సమాన హక్కులు యిచ్చారు. అన్నిరకాల ఉద్యోగాల్లోనూ మనం ఈనాడు పురుషులతో పోటీ చేయవచ్చు. ఇక కేటాయింపులు అనవసరం."

ప్రశ్న : రాను రాను ఉద్యోగరంగంలో పరిస్థితి క్లిష్టమవుతుంది. యువతులకి భవిష్యత్తులో ఎలాంటి సమస్యలు వుంటాయి?

జవాబు : ఉద్యోగ సమస్య యువతులకీ, యువకులకీ ఒక్కటే. ప్రత్యేకించి ఆడపిల్లలకి సమ

స్యలు ఏమీ వుండవు.

ప్రశ్న : అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో నాలుగేళ్ళనాడు చాలా ఆర్భాటం జరిగింది గానీ, ఈ ఏడాది బాలల సంవత్సరంలో ఏమన్ని కార్యక్రమాలు మన దేశంలో జరిపిస్తున్నట్లు లేదే ?

జవాబు : ఎందుకు జరగడం లేదు? నన్నడిగితే, ఎక్కువ పని నిజంగా ఇప్పుడే ఆరంభమవుతుంది. పెద్ద ఎత్తున, భారీ కార్యక్రమాలు జరక్కపోవచ్చు. కానీ, చిన్న చిన్నగా అనేక రకాలుగా పని జరుగుతుంది. బాల్వాడీలు, బాల భవన్‌లు, పాఠశాలల్లో



# మిరమిట్లు గొల్పే తెలుపు
# చూడగానే అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్ బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

ఉచిత భోజనం ఇవ్వడం, ఆరోగ్య కార్యక్రమాలు, ఇల్లా ఎన్నో ఆరంభమవుతున్నాయి. దీర్ఘకాల ప్రణాళికల కంటే, ఒక్కో సంవత్సరం పటిష్టమైన పని చేస్తూ, పిల్లల సమస్యలు తీర్చాలనే ధోరణి వుంది ఇప్పుడు. ఈ సంవత్సరం ఒక ఆరంభ దశగా అనుకుని, దీని మీద ఎంతో అభివృద్ధి క్రమేణా సాధించాలని ప్రయత్నం చేస్తున్నాం. పదేళ్ళో, పదిహేనేళ్లో అనే దీర్ఘ ప్రణాళిక వేస్తే, మానవనైజం ఎట్లా వుంటుందంటే, ఇంకా పదే ళ్ళుంది కదా అని ఈ ఏడాదిని జరిపేసే ప్రమాదం వుంటుంది.

అన్నిటికంటే ముఖ్యంగా మనుష్యుల్లో ఒక మాదిరి చలనం కలిగింది. ప్రతివాళ్లు పిల్లల్ని గురించి కాస్త ఎక్కువగా ఆలోచిస్తున్నారను కుంటాను. మా పని పిల్ల కూతురు చదువు బాధ్యత నేను తీసుకుంటానని చెప్పాను. నేను యిలా చేస్తున్నానని ఘనతకోసం కాదు గానీ, యిలా చిన్న చిన్న సాయాలు చేస్తున్నవాళ్ళు చాలామంది వున్నారు. మనం ఈ ఏడాది తలపెట్టిన కార్య క్రమాలన్నిటి ప్రభావం, ఫలితం కొంతకాలానికి స్పష్టమవుతుంది నిజానికి'' అన్నారు శ్రీమతి రెబెల్లో.

ప్రశ్న : అన్నట్లు—మీ సరదాలు ఏమిటి?

జవాబు : వినడానికి మీకు ఆశ్చర్యంగా వుండ వచ్చు గానీ, 'రిసెర్చి' నా సరదా. ఎప్పుడూ చద వాలనీ, విద్యారంగంలోని విషయాలని గురించి పరిశీలించి, వ్రాయాలన్నదే నా సరదా. 'చిన్న పిల్లలు – బడి చదువు' అనే విషయాన్ని గురించి ఇప్పుడే నేనొక పరిశోధనా పుస్తకం పూర్తి చేశాను. ఎటువంటి బడికీ వెళ్లకుండానే, వెళ్లినా రెండు మూడేళ్లలో చదువు మానేసి పిల్లలు చురుగ్గా, కుటుంబానికీ, సంఘానికీ ఎక్కువ ఉప యోగకరంగా వుంటున్నారన్న సంగతి, ఈ పుస్త కంలో నేను రాశాను. బడికి వెడితేనే తెలివితేటలు ఎక్కువవుతాయి అనే జనాభిప్రాయం తప్పని సూచించే ఈ సంగతిని గూర్చి, నిజంగా అందరం ఆలోచించాలి. మన ప్రాథమిక విద్యా విధానంలో పొరబాటు ఏమిటి అని పరిశీలించాలి. మరికొన్ని సంఖ్యా వివరాలు పరిశీలించాలనుకోండి యింకా ఈ విషయంలో.

ఇంకా నా సరదాలు ఏమిటంటే, పియానో వాయించడం. లండన్ ట్రినిటీ కాలేజీలో, మన ఎమ్. ఏ. తో సమానమైన పట్టా – పుచ్చుకున్నాను. కానీ, ఏదీ? టైమ్ వుండటం లేదు ప్రాక్టీసుకి' అన్నారామె. —'దేవయాని'

## గులాబి సీతాకోకల ముగ్గు

మొదట 19 చుక్కలు వరుసగా పెట్టుకోవాలి. తర్వాత రెండేసి చుక్కలు, మధ్య ఒక్కొక్కటి చొప్పున అంటే-18,17,16,15,14,13, 12,11,10,9,8,7 వచ్చేవరకు పెట్టుకోవాలి. రెండోవైపు కూడా యిదే విధంగా పెట్టుకున్న తర్వాత మొదటి చిత్రంలో చూపినట్లుగా కలుపు కుంటే చక్కటి గులాబి పువ్వులు, మధ్యలో సీతా కోక చిలకలతో ముగ్గు పూర్తవుతుంది. రెండో చిత్రంలో చూపినట్లుగా గులాబిలకు కాడలు, ఆకులు అమరిస్తే ముగ్గు చూడ ముచ్చటగా వుంటుంది.

—పి. సీతామహాలక్ష్మి





ROSE

మన వీధుల్ని
కాంతివంతంచేయాల్సిన
వేళయిందిగనక...

[illegible] అద్భుతాలు. మా వద్దనుండి
[illegible] ఆశించవచ్చు. ప్రతిసారీ.
మం[illegible] నాణ్యతను కూడా ఆశించవచ్చు.
అందులో ఆశ్చర్యమేమీ లేదు.
మీరు 80 ఏళ్ళకుపైగాగల మా నైపుణ్యం
గురించి ఆలోచించి చూస్తే మరి.

సమర్పిస్తున్నవారు :




స్టాండర్డ్ మిల్స్



సూరత్ కాటన్ మిల్స్

everest/79/SM/288-tl

టొమేటోలు, బంగాళదుంపల్లాంటి ఎన్నో రకాల ఆహార పదార్థాలకూ, పండ్ల రకాలకూ పుట్టినిల్లు దక్షిణ అమెరికా.

చాలామంది ఇష్టపడే జామపండ్ల కూడా దక్షిణ అమెరికాయే జన్మస్థానం. 'ఉష్ణదేశాల ఆపిల్' అని పేరు పొందిన జామపండ్లు ఇప్పుడు ప్రపంచంలోని పలు ప్రాంతాల్లోనూ పండించబడుతున్నాయి.

జామపండు శాస్త్రీయనామం 'సిడియంగువా జావా'. దీనిని కన్నడ భాషలో 'సీబె' అనీ, మరాఠీలో 'పెరు' అనీ పిలుస్తారు. జామపండును బెంగాలీలు 'పాయ్రా' అనీ, మలయాళీలు 'పెరక్క' అనీ, ఒరియాలో 'పిజిలి' అనీ వ్యవహరిస్తుండగా తమిళులు 'కోయపళమ్' అనీ గుజరాతీలు 'జామ్‌ఫల్' అనీ అంటున్నారు. హిందీలోనూ పంజాబీలోనూ దీని పేరు 'అమృద్'.

చక్కని రుచివల్ల అందరికీ ఇష్టమయ్యే జామపండ్లల్లో పోషక విలువలు కూడా చెప్పుకోదగినవిగా ఉన్నాయి. వంద గ్రాముల జామపండ్లల్లో **11.2** గ్రా.ల పిండి పదార్థాలూ, **0.9** గ్రాముల మాంసకృత్తులూ, **0.3** గ్రా. క్రొవ్వు పదార్థాలూ **0.7** గ్రా. ఖనిజ లవణాలూ, సున్నం **10** మి. గ్రాములూ, ఇనుము **1.4** మి. గ్రా. భాస్వరం **28** మి. గ్రా. ఉన్నాయి. విటమినుల విషయానికి వస్తే **0.03** మి. గ్రా. థయామిన్, **0.03** మి. గ్రా. రిబోఫ్లోవిన్, **0.4** మి. గ్రా. నియాసిన్, విటమిన్ సి **212** మి.గ్రా. వున్నాయి. వంద గ్రాముల జామపండ్లు **51** కెలరీల ఇంధన శక్తిని ఇవ్వగలుగుతాయి.

దీనినిబట్టి జామపండ్లల్లో విటమిన్ సి బాగా ఉందని అర్థమౌతుంది. అలాగే భాస్వరమూ, సున్నమూ కూడా సమృద్ధిగా ఉన్నట్లు తెలుస్తున్నది. 'చిత్తాదార్' రకం జామపండ్లలో ఎక్కువగా లభ్యపడుతుంది విటమిన్ సి. పహాడీ రకాల్లో మాత్రం తక్కువగా ఉంటాయి ఈ పోషక విలువలన్నీ.

యూరోపియన్ల నుండి మనదేశానికి జామపండ్లు పరిచయం గావించబడినప్పటికీ మనవాళ్లు ఎప్పటినుండో ఎన్నో ఔషధాల్లో వీటిని వాడుతూనే ఉన్నారు. ఔషధ విలువలరీత్యా చూసినా జామ పండ్లెంతో ప్రశస్తమైనవే! జామచెట్టు పట్టల్నీ ఆకుల్నీ పొడిచేసి దెబ్బలకూ,

# జామపండు



పుండ్లకూ పెడతారు. లేతజామ ఆకుల కషాయం జీర్ణసంబంధ దోషాన్ని పోగొడ్తుందని చెబుతారు. ఈ కషాయాన్ని ఆజీర్ణ విరోచనాలూ, వాంతులూ లాంటి లక్షణాల నరికట్టడానికి కూడా ఉపయోగిస్తారు. ఆకులపొడిని కీళ్ళ నొప్పులు తగ్గించే నిమిత్తమై వాడతారు. జామపూవులు చల్లదనాన్నిస్తాయనీ, 'బ్రాంకైటిస్'ను తగ్గిస్తాయనీ అంటారు. పళ్ళ నొప్పులకూ, చిగురు వాపులకూ కూడా పుక్కిలించేందుకు గాను జామ ఆకుల కషాయాన్నిస్తారు.

జామ పండ్లల్లో ఉండే గింజల్లోంచి సువాసన ద్రవ్యాలను తయారు చేయడం కూడా జరుగుతోంది. ఈ గింజల్లోంచి తీసే నూనెలో 'అయొడిన్' కూడా ఉంటుంది. కనుక దీన్ని కొన్ని మందుల తయారీల్లో కూడా వాడుతున్నారు.

జామ ఆకులనుండి కూడా కొన్ని నూనెల్ని తీయడం జరుగుతోంది. ఈ నూనెల్ని పరిమళ ద్రవ్యాల్లోనూ, తీపి పదార్థాల తయారీలోనూ ఉపయోగిస్తున్నారు.

జామ ఆకుల్ని మంచి నాణ్యతగల తోళ్ళకు పదునుపెట్టే పరిశ్రమలో కూడా వాడుతున్నారు.

జామ రకాల్లో సఫెదా, చిత్తాదర్, కేరళ రకాలు ప్రసిద్ధి గాంచినవి. ఈ రకాల్లో పండ్లు పెద్దగానూ, తియ్యగానూ ఉంటాయి. చక్కని పరిమళాన్ని వెదజల్లుతుంటాయి. అనకాపల్లి, హఫ్రి, బనారసి, గింజల్లేని మాధురి రకాలు కూడా పేరు పొందిన రకాలే. ఉత్తరప్రదేశ్ ప్రాంతంలోని పండ్లు ఇంకా బాగుంటాయని ప్రతీతి.

వ్యవసాయ పరిశోధనా సంస్థలు తయారు చేసిన లక్నో 49 నాసిక్, ధర్వార్‌లాంటి హైబ్రిడ్ రకాలు కూడా మంచి పేరు పొందాయి. మంచి నాణ్యతగల పండ్లను ఈ రకాల ద్వారా కూడా పొందవచ్చు.

జామ పళ్ళల్లో కూడా గింజలులేని రకాలున్నాయి. కాని అవి అంత రుచికరంగా ఉండవు గనుక ఎక్కువగా ఇష్టపడరు.

ఎర్రటి జామ పండ్లనిచ్చే పహడీ రకాలు మంచి రుచికరంగా ఉంటాయి. ఇవి 'స్ట్రాబెర్రీ'లను పోలిన రుచిని కలిగి ఉంటాయి గనుక 'స్ట్రాబెర్రీ గువాస్'గా పాశ్చాత్య దేశాల్లో పేరు తెచ్చుకున్నాయి. 'జామ్' చేయడానికి జామ పండ్లు తగినవి.

మామూలుగా జామ చెట్లు 9 మీటర్ల ఎత్తు వరకూ ఎదుగుతాయి. ఎక్కువ శ్రద్ధ కనబరచకపోయినప్పటికీ ఈ చెట్లు బాగానే పెరగడం, చాలాకాలం బ్రతకడం మనం చూస్తూ ఉంటాం. శీతల ప్రదేశాల్లో ఇవి మంచి ఆరోగ్యవంతంగా పెరుగుతాయి.

నారు పోయడం ద్వారానూ, నాటడంద్వారానూ జామ చెట్లను పెంచవచ్చు. వర్షా కాలంలో నారు పోసి పెంచితే బాగా పెరుగుతాయి మొక్కలు. నాలుగు సంవత్సరాల వయస్సు వచ్చేసరికే జామచెట్టు కాపుకు వస్తుంది. ఏభై సంవత్సరాల వరకూ ఈ చెట్లు పండ్లనివ్వగలవు. ఇంచుమించుగా ఒక చెట్టు సంవత్సరానికి నాలుగైదు వందల పండ్లనిస్తుంది. అన్ని కాలాల్లోనూ జామ పండ్లు దొరుకుతాయి. కాగా వర్షాకాలం శీతాకాలాల ప్రాంతాల్లో ఈ పండ్ల దిగుబడి హెచ్చుగా ఉంటుంది. పూత నుండి పళ్ళు అయ్యే వరకూ మధ్యకాలం ఇంచుమించుగా ఐదునెలలు ఉంటుంది.

మన ఆంధ్రప్రదేశ్‌లోనూ, కర్ణాటకలోనూ జామ పండ్ల పంట చెప్పుకోదగిందిగా ఉంది. ఐతే మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, బీహార్‌లతో పోలిస్తే తక్కువే అని చెప్పవలసి ఉంటుంది. తమిళనాడులో కూడా ఈ చెట్లు చక్కగా, త్వరగా పెరుగుతాయి. అలాగే కేరళలో కూడా. కాని ఆ ప్రాంతాల్లోని పండ్లు అంత నాణ్యమైనవి కావని చెబుతారు. కనుక ఆ రాష్ట్రాలవారు ఈ పంటకు వాణిజ్యపరంగా తగిన ప్రోత్సాహం లేనందున ఎక్కువ శ్రద్ధను కనబర్చడం లేదు.

త్వరగా ఎక్కువ శ్రమలేకుండా పెరిగి, ఎన్నో విలువైన పోషకపదార్థాల్ని కలిగిన జామపండ్లనివ్వగలిగే జామచెట్టులో ఔషధ విలువలకు కూడా కొదువలేదని చెప్పుకున్నాం గనక, ప్రతీ పెరటి తోటలోనూ శ్రేష్ఠమైన రకపు జామ చెట్టు నొకదాన్నయినా పెంచడం మంచిదని పిస్తోంది. ఇప్పటికే ఎన్నో పెరటితోటల్లో జామ చెట్లు ఉన్నాయనుకోండి. లేని చోట్లల్లో పెంచడం అవసరం కాదా?

జామపండ్లల్లో 'పెక్టిన్' అనే పదార్థం బాగా ఉన్నందున జామ్‌లూ, జెల్లీలూ, చీస్‌లూ చేయడానికి 'కేనింగ్' ద్వారా నిలువచేయడానికి బాగా పనికివస్తాయి. జామపండ్ల తొక్కల్ని సలాడ్‌లలో కూరల్లో తరచుగా వాడడం జరుగుతోంది. ఫ్రూట్ సలాడ్‌లలోనూ, ఐస్‌క్రీమ్‌ల్లోనూ జామ 'ఫ్లేవర్' చేర్చబడుతోంది.

జామపండ్ల రసం ఆహ్లాదాన్ని కలిగించే మధుర పానీయం. టొమేటో నారింజరసాలకు బదులుగా ఈ రసాన్ని 'హవాయ్'లో పిల్లలకు బాగా ఇస్తారు. జామపళ్ళ రసాన్ని పంచదారను చేర్చి శక్తినివ్వగల ఆహారంగా చేయవచ్చు. పసిపిల్లలకు ఇది చక్కని బలవర్ధకమైన ఆహారం.

—జయసాజన్యామూర్తిశ్రీ

ప్రకృతి:

# మీ మహత్తర సౌందర్య సాధనం.

ప్రకృతి మీకు మచ్చలేని నునుపైన చర్మాన్ని యిచ్చినప్పుడే, దాన్ని అదే విధంగా ఉంచగల సాధనాలపై దృష్టి సారించింది.

మీ చర్మానికి మరింత రంగొచ్చేలా నునుపుగా, ఆరోగ్యంగా చేసేందుకు పసుపు యిచ్చింది (ఇది క్రిమి నిరోధకంగా పనిచేస్తుందని మీకు తె

మరి గంధపు చెక్క ను మీ ల్లగా చేసి మొటిమల్ని వ

కాపా కుంకుమ పువ్వునిచ్చింది.

నిజానికి ప్రకృతికి మీ చర్మాన్ని ఎలా సంరక్షణ చెయ్యాలో తెలుసు. అందుకే మేం యీ మూడింటిలోని ...ణాలన్నిటిని ఒకే క్రీమ్‌లో రూపొందించాం. ... శింగార్ టర్మరిక్ బ్యూటీ క్రీమ్.

కొత్తది

# శింగార్

## టర్మరిక్ బ్యూటీ క్రీమ్

మీ చర్మ సంరక్షణ కోసం ప్రకృతి సహజమైన సాధనం.







శింగార్ కాస్మటిక్స్
ప్రయివేట్ లిమిటెడ్
809, ప్రసాద్ ఛాంబర్స్,
బొంబాయి 400 004

# సమస్యలూ సలహాలూ

నిర్వహణ: కమలా వసంత కుమారి

బి. ఎస్. ఆర్.

నా వయసు ముప్పైరెండు సంవత్సరాలు. నేను ఉద్యోగం చేస్తూ వుండగా, ఒక అబ్బాయితో నాకు రిజిస్టర్డ్ వివాహం జరిగింది. నాకు తలిదండ్రులు లేరు. తక్కిన మా బంధువులకు మా వివాహం ఇష్టం లేదు. కాని, వివాహం జరిగిన తర్వాత నా భర్త మారిపోయి, తనతో తెగతెంపులు చేసుకోమని, తను వేరే వివాహం చేసుకుంటాననీ చెబుతూ వచ్చారు. నాకు విడాకులు ఇచ్చినా కూడా నేను తన దగ్గరే వుండాలట. నాకు అదేమిటో అర్థం కాలేదు. ఆయన బాధలు భరించలేక, మా అన్నగారింటికి వెళ్లిపోయాను. నా విషయం విన్న తర్వాత— "అతనితో నీకెలాంటి సంబంధమూ లేదు. అయితేనే ఇక్కడ వుండు – లేకపోతే లేదు." అని కచ్చితంగా చెప్పేశాడు మా అన్నయ్య. వేరు దారిలేక అంగీకరించాను.

నేను పుట్టింట్లో వుండిపోవడం వల్ల, నా భర్త నాకు నోటీసు పంపించారు. నేను కోర్టుకు హాజరయ్యాను. ఆయనతో సంసారం చెయ్యడం ఇష్టం లేదని చెప్పుకున్నాను. అటు తర్వాత నేను స్కూలు టీచరుగా వుద్యోగంలో ప్రవేశించాను. కాని, నా భర్త మాత్రం ఎవరికీ తెలియకుండా నా దగ్గరకు వచ్చి వెళ్లడంతో, ఆయన ఇంకో పెళ్లి మాట ఎత్తడం లేదనుకున్నాను. కాని, ఆ తర్వాత ఇంకొక ఆమెను వివాహం చేసుకున్నారని తెలుసుకున్నాను. ఒక బిడ్డకూడా వుందట. అయినా నేను, ఆయనతో తెగతెంపులు చేసుకోలేక, రమ్మని రాయగా వచ్చి వెళ్తున్నారు. ఈ విషయం మావాళ్లెవరికీ తెలియదు. అయితే, మేము ఇద్దరమూ ఇలా కలుసుకుంటున్నట్టుగా కోర్టువారితో చెప్పి, తిరిగి కాపురం చెయ్యవచ్చునా? నా భవిష్యత్తు ఏమిటి? మానసికంగా నేను బాగుపడేదెలా?

మీ సమస్య చాలా చిత్రంగా వుంది. కోర్టులో కేసు జరుగుతూనే వుంది; మీ ఆయనకి మీ మీద ఇష్టం లేదంటున్నారు; అయినా మీరు ఆయన్ని రహస్యంగా కలుసుకుంటున్నారు! ఆయనకి ఇంకో వివాహమైందంటున్నారు; బిడ్డా వుందంటున్నారు. మీ భర్త మిమ్మల్ని, మీ బలహీనతను వినియోగించుకుంటున్నారు తప్ప— మరొకటేం కాదు. ఇలా జరుగుతూ వుంటే, మీ భవిష్యత్తు ఏమిటో ఆలోచించారా? అతని భార్యాబిడ్డల విషయం ఆలోచించారా? ఒక వంక మీకు విడాకులు ఇవ్వడానికి ప్రయత్నాలు చేస్తూ మీ భర్త మీ బలహీనతను వినియోగించుకోడం ఆశ్చర్యకరం! మీరు ఇది గుర్తించాలి. ఇంతదూరం వచ్చిన తర్వాత, మీరు ఇంకేమీ చెయ్యలేరు. భర్త నుంచి విడాకులు తీసుకున్న తర్వాత, కొత్త జీవితం గురించి ఆలోచించండి.

### లోకజ్ఞానం - సమాధానాలు

1. మైన్ కాంఫ్
2. భూమధ్యం నుంచి చంద్రమండలం మధ్యకి అయితే 384,402 కిలోమీటర్లు. భూమి అంచు నుంచి చంద్రమండలం అంచువరకూ అయితే 376,285 కి.మీ.
3. ప్లాటో
4. వీనస్ లేక బుధగ్రహం. ఉష్ణోగ్రత 460° సెంటిగ్రేడు.
5. గుజరాత్. గార్బా అక్కడి జానపద నృత్యం.
6. స్టోన్‌ఫిష్. ఉష్ణోగ్రత అధికంగా గల హిందూ-పసిఫిక్ మహాసముద్రాలలో వుండే ఈ చేప ముళ్ళు తగిలితేనే సాధారణంగా ప్రాణాంతకమవుతుంది.
7. పన్నెండుమంది. కళలలోనూ ప్రజాజీవితంలోని వివిధ రంగాలలోనూ ఆరితేరిన ప్రముఖ వ్యక్తులను రాష్ట్రపతి నియామకం చేస్తారు.
8. రష్యాకు చెందిన లెఫ్టినెంట్ కల్నల్ అలెక్సీ ఎ. లియెనోవ్. ఆయన వోస్ఖాడ్ II అనే అంతరిక్ష నౌకలో మార్చి 18, 1965న ప్రయాణం చేసి ఇరవై నిముషాల సేపు అంతరిక్షంలో 'నడిచారు'.
9. సర్ ఐసాక్ పిట్‌మన్.
10. అమెరికా దేశస్థుడైన రాబర్ట్ పియరీ. ఏప్రిల్ 6, 1909న ఆయన ఉత్తరధృవం చేరుకున్నారు.

జి. వి.

నాకు పదహారేళ్ళ క్రితం వివాహం జరిగింది. ఇద్దరు పిల్లలు సంతానం. బాగా ఆస్తిపరులం. నేను అందంగానే వుంటాను; నా భర్తా అందంగానే వుంటారు. కాని, ఆయనకు ఒక దురలవాటు వున్నది—పరస్త్రీలతో వ్యభిచరించడం! దానివల్ల ఆయనకూ నాకూ వ్యాధులు సంక్రమించినాయి. ఎప్పుడు చూసినా మందులూ మాకులూ "ఏమిటండీ?" అని ఆయన్ని అడిగితే, తిట్టడం కొట్టడం! శారీరికంగానూ, మానసికంగానూ నాకు సుఖం లేదు! ఇలాంటి భర్తను విడిచిపెట్టి నేను బయటికి వెళ్తే ఎలా బతగ్గలను? విడవకుండా ఎలా బతగ్గలను?

మీ భర్త వ్యభిచరించడం మూలంగా సుఖవ్యాధులకు గురి కావడం, అవి మీకూ రావడం-నిజంగా విచారించదగ్గ విషయం. మీ భర్త వెంటనే ఎవరైనా స్పెషలిస్టును చూడాలి; వ్యాధులు నయం చేసుకోవాలి. అంతవరకూ మీరు అతనితో ఎలాంటి సంబంధాలూ పెట్టుకోకుండా వుండడం మంచిది. అలాగే, మీ విషయం కూడా డాక్టర్లు చూడాలి. ఈ సమస్యకు ఏం చెయ్యాలంటే-మీ భర్త తన ప్రవర్తనకు దండింపబడాలి. అప్పటికీ ఆయన తన ప్రవర్తన మార్చుకోకపోతే మీరు వేరు పడవలసిందే. అయితే, తర్వాత? మీకు పిల్లలున్నారు-వాళ్ల గతేమిటి?- ఇవన్నీ ఆలోచించుకుని, మీరే మీ భర్తను తిప్పుకోడానికి ప్రయత్నించండి. చాలామంది, ఇలాంటి వ్యాధులు సంక్రమిస్తే సిగ్గుతో మంచి డాక్టర్ల దగ్గరకు వెళ్లరు. అలాంటిదేమీ పెట్టుకోకుండా, ఆయన 'వెనిరియాలజిస్ట్'ను సంప్రతించేలా, ప్రయత్నించండి. ఇవాళ మనదేశం ఇలాంటి (S. T. D) వ్యాధులు (Sexually Transmitted Diseases) సోకకుండా వుండాలనీ, వాటి నివారణకూ ఎన్నో పథకాలు వేస్తున్నది. మీ భర్త అలా వ్యాధుల్ని ముదరబెట్టుకోవడం-సాంఘికపరంగా కూడా ఘోరమైన నేరం! మీరు ఎలాగైనా ఆయనకి నచ్చజెప్పి, పెద్ద డాక్టర్ల దగ్గరకు వెళ్లమని చెప్పండి. మళ్లీ ఆయన అలాంటి తిరుగుళ్లు తిరగకుండా జాగ్రత్త పడండి. ఒకవేళ మీలో 'లైంగికస్తబ్దత' వుందేమో

చూసుకోండి. అలాంటిది ఏదైనా వున్నప్పుడు కూడా, భర్త తప్పు దోవలు తొక్కుతూ వుంటారు. ఏమైనా, ఈ విషయంలో మీరు ధరించవలసిన పాత్ర చాలా వుంది – అశ్రద్ధ చేశారంటే, ఆయనకీ, మీకూ, మీ బిడ్డలకూ, తద్వారా దేశానికీ ముప్పే.

యన్. పి.

మాది ఆదర్శ వివాహం; వివాహం జరిగి కొద్ది నెలలే అయింది. నన్ను ఆయన మనసారా కోరు కున్నారు. కానీ కట్నం అడగకుండా చేసుకున్నారు; ఆయనకు తలిదండ్రులూ, అన్నదమ్ములూ ఎవరూ లేరు; నాకు మాత్రం ఎందరో వున్నారు. చాలా పెద్ద కుటుంబం మాది. మేమిద్దరం కూడా ఉద్యోగస్తులమే. ఇద్దరమూ ప్రేమగానే వుంటాము. కాని – నేను మావాళ్ళ ఇంటికి వెళ్తే మాత్రం ఆయన సహించరు. వాళ్ల మీద ఎందుకనో ఆయనకు కోపం; ఆయన రారు; నన్ను వెళ్ల నివ్వరు. కన్న వారి మీద మమకారంతో నేను వెళ్లానా – ఆయన ఇష్టం వచ్చినట్టుగా తిడుతున్నారు. అది నేను సహించలేక పోతున్నాను. ఎంత ఓర్పుగా నేను వూరుకుంటున్నా, ఆయన రెచ్చిపోతున్నారు. వాళ్లతో ఆయనకి విరోధం లేదు గాని – ఏదో పట్టుదల, పంతం; మధ్యలో నేను నలిగిపోతున్నాను. నాకు ఈయనా కావాలి; వాళ్లూ కావాలి. కాని ఎలా? నా మనసులోని బాధ చెప్పుకోలేని బాధ. ఈ బాధ నుంచి ఎలా బయటపడగలను?

మనదేశంలో, పెళ్లికాక ముందు అబ్బాయి అమ్మాయిల మనస్తత్వాలు ఏమిటో తెలియడానికి అవకాశం లేదు. పెళ్లయిన కొన్ని మాసాలకుగాని అవి బయటపడవు. అలా, మీ ఆయన విషయం కొద్దినెలలకు గాని బయట పడలేదు.

బహుశా, మీ ఆయనకు ఎవరూ లేకపోవడం, మీకు బంధువర్గం వుండడం – ఆయన సహించలేక పోతున్నారేమో! లేక, మీ ప్రేమాభిమానాలు తన ఒక్కడికే సొంతం అన్న భావం వుందేమో!

ఏమైనా, మీరు మాత్రం చాలా ఓర్పు వహించాలి. అనవసరంగా ఆయనతో పోట్లాట పెట్టుకోకండి. నిదానంగా ఆయన మనస్తత్వం గ్రహించి, ఆ ప్రకారం నడుచుకోడమో, లేక మీ తెలివితేటలతో మీవేపు తిప్పుకోడమో చెయ్యండి గాని, ఆవేశపడి, మాటలు అనకండి! మనం మంచిగా వుంటే, ఎన్నో సాధించుకోవచ్చు.



# వంటలపోటీ

మీరు ఎన్నో వంటలు తిని వుంటారు; తయారుచేసి వుంటారు. అలా ఒకరి ద్వారా నేర్చుకున్నవీ, చూసినవీ కాకుండా మీ పాక పరిజ్ఞానంతో మీరు ఏదైనా కొత్త వంటకం కనిపెట్టగలరా? అదీ స్వీటయినా, హాటయినా మరేదైనా పర్వాలేదు; కొత్త రకంగా వుండాలి; రుచికరంగా వుండాలి; చెయ్యడానికి తేలికగా వుండాలి. అలాంటి వంటకాన్ని చేసి మీరు తిని, "బాగుందీ, అందరూ మెచ్చుకుంటారు" అనిపించినపుడు ఆ వంటకం గురించి - అదెలా తయారుచెయ్యాలి? ఏమేం పదార్థాలు వెయ్యాలి? అన్న వివరాలతో మాకు రాసి పంపండి. మీ వంటకం కొత్తగా వుండి, బాగుందనిపిస్తే ఆ వంటకానికి–

## నూరు రూపాయలు బహుమతి!

జనవరి (80) నుంచి ప్రతి సంచికలోనూ ఒక్కొ వంటకం వుంటుంది. వంటకాలలో ఆరితేరిన ప్రఖ్యాత పాకశాస్త్రజ్ఞురాలు – న్యాయనిర్ణేతగా వ్యవహరిస్తారు. మీ తెలివితేటలతో రుచికరమైన వంటకం తయారుచేసి వెంటనే మాకు పంపండి।

చిరునామా : వంటల పోటీ, వనిత—చందమామ బిల్డింగ్స్ మద్రాసు 600026

బి. ఎస్.

నాకు వివాహం జరిగి పదమూడు ఏళ్ళయింది— ముగ్గురు పిల్లలు. పది సంవత్సరాలపాటు ఎంతో అన్యోన్యంగా సాగిన మా దాంపత్య జీవితం, గత మూడేళ్ళుగా చిక్కులు అనుభవిస్తున్నది. కారణం ఏమిటంటే — మా దూరపు బంధువు ఒకామె మా యింటికి వచ్చింది. కొంతకాలం మా యింట వున్నది. మా ఆయనకీ ఆమెకూ ఎలాగో కలిసింది. వాళ్లిద్దరికీ సంబంధం వున్న విషయం నేను తొందరగానే కనిపెట్టాను; ఆ విషయం ప్రస్తావించగా, ఆయన 'తప్పయిపోయింది, క్షమించ'మన్నారు. దేవుడి మీద ప్రమాణం చేశారు. ఆమెను ఇంటి నుంచి పంపించి వెయ్యగలిగాను. అటు తర్వాత మా పక్క యింట్లో వున్న పద్దెనిమిదేళ్ల పెళ్లికాని అమ్మాయితో సంబంధం పెట్టుకున్నారేమోనని – అనుమానం. ఇద్దరూ చూసుకోడం, సైగలు చేసుకోడం నేను గమనించాను. చుట్టుపట్లవాళ్ళు కూడా – "నువ్వు ఇంటలేనప్పుడు ఆ పిల్ల వస్తుంది" అని చెప్పారు. ఆ మాట ఆయన్ని అడిగాను. అలాంటిదేమీ లేదని, తనని నమ్మమని, దేవుడి మీద ప్రమాణం చేశారు. నన్ను ప్రేమగా చూసుకుంటారు; దేనికీ కోపం తెచ్చుకోరు. కాని, ఈ విషయంలో మాత్రం అబద్ధం చెబుతున్నారేమోనని, నా అనుమానం. ఎందుకలా ప్రవర్తిస్తున్నారో అర్థంకాక, తికమక పడిపోతున్నాను. మనసంతా చికాగ్గా వుంటున్నది. జీవితాంతం ఈయన (పైగా చేసే వుద్యోగం కాలేజ్ లెక్చరరు) ఇలాగే ప్రవర్తిస్తారా–అని మథనపడుతున్నాను. నా సమస్యకి పరిష్కారం ఏమిటి?

మీరు చాలా చిత్రమైన వ్యక్తిలా వున్నారు. తనకు ఇతరత్రా ఎలాంటి సంబంధమూ లేదనీ, జరిగిందేదో జరిగిపోయిందనీ మీ భర్త మీతో చెప్పారు గదా! పైగా మీ భర్త మిమ్మల్ని ప్రేమగా చూస్తారనీ, తను చేసిన దానికి బాధపడి క్షమించమన్నారనీ కూడా చెబుతున్నారు.

ఇరుగు పొరుగు వాళ్ల మాటలు విని, మీకు మీరుగా ఏవేవో కల్పించుకుని, అనుమాన బీజాన్ని పెంపొందింపజేసుకోకండి. 'అనుమానం పెనుభూతం' అన్నారు. అది ఎన్నో అనర్థాలకి కారణం అవుతుంది. 'అనుమానించడం' ఆరంభిస్తే ఎవరి మనసూ స్థిరంగా వుండదు. భర్త మీద విశ్వాసం పోగొట్టుకొని అనవసరమైన కలతలకి లోను కాకండి! □



# నేరస్థుల కథలు

సుప్రసిద్ధ హిందీ రచయిత్రి శ్రీమతి గౌరాపంత్ శివానీ ఎనిత' పఠితలకు పరిచితురాలు. కొన్నాళ్ళ క్రితం 'వనిత'లో ప్రచురించిన గోష్ఠిలో ఆమె గురించి, ఆమె రచనల గురించి ప్రస్తావించడం జరిగింది. కొంత కాలం క్రితం శ్రీమతి శివానీ–వివిధ నేరాలపై జైలు శిక్షలను అనుభవిస్తున్న కొందరు స్త్రీ ఖైదీలను కలుసుకుని, ప్రభుత్వ అధికారుల అనుమతితో–వాళ్ళ అనుభవాలను కథలుగా రాసి, కొన్ని ప్రముఖ హిందీ పత్రికలలో ప్రచురించారు. ఆ గాథలనే 'అపరాధిని' పేరుతో పుస్తకంగా కూడా ప్రచురించారు. ఆసక్తిదాయకమైన ఆ కథలను 'వనిత' పఠితలకు అందజేస్తున్నాము. 'అపరాధిని'కి శ్రీమతి శివానీ రాసిన ఉపోద్ఘాతంతో ఈ శీర్షిక ఆరంభమవుతున్నది.



కథలు రకరకాలు!

అవి పఠితల మనసుల్లో పలురకాల అనుభూతులను కలిగిస్తాయి. రచయిత కథలోను, పాత్రలలోను అంతర్భాగంగా వుంటూ, పాత్రలు పొందే వివిధ మానసికావస్థలలో పాలుపంచుకుంటూ – కథను నడిపిస్తూ వుంటాడు. ఆ ప్రయత్నంలో చాలావరకు వూహలే రచయితను నడిపిస్తూ వుంటాయి.

కానీ, ఈ కథలు అలాంటివి కావు వీటిలో కనిపించేవి నగ్నసత్యాలు. ఆ సత్యాలకు కథారూపం కల్పించడంలోను, ఆ కథల ద్వారా రసానుభూతిని కలిగించడంలోను– నేను పూర్తిగా సంతృప్తి పొందలేక పోయాను. నేను చెప్పదలచుకున్నది – చెప్పడానికి ఎంతగా కృషిచేసినా, ఇంకా ఎక్కడో ఏదో లోటు వుందన్న భావం నన్ను పీడిస్తూనే వచ్చింది. ఎంచేతంటే, ఒకొక్క కథలోను, కథకు మూలమైన 'నేరస్థురాలి' జీవితంలోను–వూహకు అందని విచిత్రమైన మానసికస్థితి అంతర్లీనంగా వుంది. అది మాటలకు అందదు! ఆ భావాలను, వాళ్ల మస్తిష్కాలలోని అగాథాలను–యథాతథంగా చెప్పడంలో నేను పూర్తిగా విజయం సాధించానా? లేదా? అన్నది నాకు అనుమానంగానే మిగిలిపోయింది!

జానకి కళ్లల్లో ఏదో మత్తు, మైకం....వాటి వెనక తీవ్రమైన కాంక్ష, రగిలే అగ్నిపర్వతాలూ కనిపించేవి. ఆ కళ్లల్లో–చదువుకోడానికి వేయి కథలైనా వుంటాయి. ఆ చూపులను నేను ఎలా రాయను?

మగ్గి పెదాలు, ఆ మోటైన పెదాలు చిందించే అమాయకమైన చిరునవ్వు, ఆ భయంకర కారాగారంలోని వార్డర్ అమానుషమైన నవ్వు–వీటి మధ్య వున్న తేడాలను ఎలా అభివర్ణించను?

పద్నాలుగేళ్ల ప్రాయంలో ఉన్న చిన్నారి బాలికను పరిచయం చేసి, 'ఈ అమ్మాయి హత్యానేరంపై జైలుశిక్ష అనుభవిస్తోంది' అని చెప్పినప్పుడు–నా కళ్లను నేను నమ్మలేక పోయాను. ఆమె కథ విన్నప్పుడు–ఆమె చేసింది 'నేరమేనా'? అన్న భావం కూడా కలుగుతుంది! కానీ చట్టం దృష్టిలో ఆమె నేరస్థురాలు. 70 యేళ్ళ ఆమె పెదనాన్న ఆ అమ్మాయికి ఏవో మాయమాటలు చెప్పి, ఆమె స్నేహితురాలిని యింటికి తీసుకు రమ్మని చెప్పాడట. ఆమె అమాయకంగా తన స్నేహితురాలిని యింటికి తీసుకు వచ్చింది. కానే ఆ ముసలివాడు దుర్బుద్ధితో– తన స్నేహితురాలిపై అఘాయిత్యం కలపెడతాడన్న సంగతి ఈ చిన్నారికి ముందే ఎలా తెలుస్తుంది? వాడి అఘాయిత్యానికి బలైన ఆ స్నేహితురాలు–చనిపోతూ, మరణ వాఙ్మూలంలో తన స్నేహితురాలే, ఆ ముసలి వాడి దగ్గరకు తీసుకువెళ్లినట్లు చెప్పింది. దాంతో ఆ నేరంలో ఈమెకు కూడా భాగం వున్నట్లు ఆరోపించబడింది. దాని ఫలితమే ఈ కారాగారవాసం!

మరో చోట అద్భుతంగా పాటలు పాడుతున్న ఓ గొంతు వినిపించింది. ఆమె పాటలు ఎంతో తియ్యగా వున్నాయి. కాని ఆమె జీవితం చేదు నిజాలనే చెబుతోంది. ఆమె ఒక వేశ్య!

ఈ గాథలు 'ధర్మయుగ్', 'సాప్తాహిక్ హిందుస్తాన్' పత్రికలలో ప్రచురితమవుతున్నప్పుడు – పాఠకుల నుంచి నాకు చాలా ఉత్తరాలు వస్తుండేవి.

ఒక పాఠకుడు – నా రచనల్లోని ఒక నేరస్థురాలిని గుర్తించి యిలా ఉత్తరం రాశాడు.

"మీరు ఆ కథలో రాసిన మాలిని టీకమ్‌గఢ్'లో వుండేది. 30 సంవత్సరాల క్రితం ఆమె తన భర్తను హత్య చేసింది. ఆమెను పోలీసులు మా యింటి మీదుగా తీసుకు వెళ్తున్నప్పుడు చూశాను.

ఆమె గురించే మీరు రాశారు కదూ ?''

నిజమే.

ఆ పాఠకుడు ఆమెను సరిగ్గా గుర్తించాడు. మాలిని ఎప్పుడూ జబ్బుతో బాధపడే భర్తను - తన ప్రియుడి సహాయంతో చాలా ఘోరంగా చంపింది. హత్య జరిగిన రోజున రాత్రి పూట అలవాటు ప్రకారం భర్త లఘుశంకకు తనను బయటకు తీసుకు వెళ్లమన్నాడు. ఆ సంగతి ఆమెకు తెలుసు గనుక ముందుగానే ఆమె ప్రియుణ్ణి గునపం తీసుకుని ఫలానా చోటుకు రమ్మన్నది. అక్కడ యిద్దరూ కలిసి, అతన్ని చంపి, ఆ శవాన్ని ఒక చోట పాతి పెట్టి, ఏమీ తెలియనట్లుగా వచ్చేశారు. కొన్నాళ్లకు - కుండపోతగా ఒక రోజు వర్షం కురిపినప్పుడు, పైన కప్పిన మన్నంతా కొట్టుకుపోయి, అస్థిపంజరం బైటపడింది. ఆ అస్థిపంజరం రకరకాల అనుమానాలకు దారి తీయించింది. పోలీసులు దర్యాప్తు చేసిన తర్వాత నిజం బయట పడింది!

మరో ఉత్తరం .... ''మీరు నేరస్థుల జీవిత కథలు రాస్తున్నారు. నేనూ నేరం చేశాను. నా గురించి రాయరూ ?''

ఆ ఉత్తరం చూడగానే నాకు భయం వేసింది. వెంటనే చింపి, పారేశాను.

నేను రాసిన ఈ కథలకు సంబంధించిన వ్యక్తులను కలుసుకున్నాను. వాళ్ళ అనుభవాలను, వాళ్ళ మానసిక సంఘర్షణను ఆకళింపు చేసుకోడానికి ప్రయత్నించాను. ఆ అనుభవం చాలా చిత్రమైనది. మొదట వాళ్ళ గాథలు తెలుసుకోడానికి భయపడ్డాను. కానీ, తెలుసుకున్న తర్వాత ఆ అనుభవాలను రాయాలన్న ఆకాంక్ష నాలో ఎక్కువైంది. నా కలం ఉత్సాహంతో విజృంభించింది!

ఐతే, వాళ్ళ బాధలను, ఆ గాథలను మీకు చెప్పడంలో నేను ఎంతవరకు కృతకృత్యురాలిని కాగలిగాను? ఏమో.... నాకు తెలియదు.

ఆ సంగతి మీరే చెప్పాలి!

## వనిత మాటల కొలువు – 51

సరైన సమాధానం:

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 ఆం | గ | 17 న | | 2 వి | 18 మో | హ | 19 ము |
| గు | | 3 ఖ | 20 గ | రా | జు | | ని |
| శ్రీ | | 4 ర | వ | శ్రీ | | 5 మ | చీ |
| 6 యు | 21 డు | ము | | | 7 పి | లి | క |
| 8 క | కా | | 9 మే | ని | | 10 న | టి |
| ము | | 11 బో |ను | | 12 సా | ము | |
| | 13 కో | న | | 14 ఊ | హ | | 22 సో |
| 15 వా | ట | ము | | 16 త | సి | ద్ధాం | ము |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపిన వారు నూటఇరవైఆరుగురు. వారు:

1. పి. అన్నపూర్ణ, విజయవాడ 2. సి. భువనేశ్వరి, శ్రీకాళహస్తి 3. డి. వి. రమణమ్మ, పామిడి 4. ఎస్. లక్ష్మి, భీమవరం 5. ఏస్. ఎస్. సుధావల్లి నర్సాపురం 6. పి. నారాయణమ్మ, విశాఖపట్నం 7. రాగసుధాశాస్త్రి, ఆదోని 8. సంధ్యారాణి, మామిళ్ళగూడెం 9. జె. వి. రత్నం, హైద్రాబాదు 10. ఎన్. లక్ష్మి, అంగలూరు 11. పి. ప్రేమలత, ఉప్పలపాడు 12. పి. లక్ష్మి, మంచిర్యాల 13. పి. లక్ష్మి, హైదరాబాదు 14. కె. మంజులాదత్త, ఆదోని 15. వి. గీత, హైదరాబాదు 16. ఎస్. జ్యోతిర్మయి, విశాఖపట్నం 17. జయంతి, హైదరాబాదు 18. పి. శ్రీకృష్ణరత్నామణి, విశాఖపట్నం 19. టి. కుసుమకుమారి, గుడిపాటిపల్లె 20. పి. ప్రభావతి, శ్రీకాకుళం 21. ఐ పద్మావతి, నర్సీపట్నం 22. ఎన్. కామేశ్వరి, విశాఖపట్నం 23. జి. మంగళాదేవి, నెల్లూరు 24. కె. పద్మజ, మోదుగులకుంట 25. ఎ. శుభలక్ష్మి, తణుకు 26. పి. శకుంతల, లక్ష్మి పోలవరం 27. సి. హెచ్. వి. కామేశ్వరి, కొత్తపల్లి 28. సుధారాణి, విశాఖపట్నం 29. ఎమ్. వసంత, వరంగల్లు 30. అజీజునీసాబేగం, మద్రాసు 31. ఏ. హైమవతి, నందివెలుగు 32. శ్యామలాదేవి, బుచ్చిరెడ్డిపాలెం 33. టి. అహల్యాదేవి, హనుమకొండ 34. హెచ్.వి. హేమావతి, హొసూరు 35. డి. శ్యామ, దార్జిలింగ్ 36. పి. సత్యవాణి, హైదరాబాదు 37. ఎ. భారతీదేవి, తెనాలి 38. టి. జయలక్ష్మి, తెనాలి 39. జి. యస్. ఉమాదేవి, చిత్తూరు 40. జి. సరస్వతమ్మ, శ్రీకాకుళం 41. పి. అరుంధతీదేవి, పార్వతీపురం 42. వసులక్ష్మి భగవాన్, శ్రీకాకుళం 43. ఓ. సలోనీదేవి, విజయవాడ 44. జి. రామామణి, శ్రీకాకుళం 45. వి. నిర్మల, మహేశ్, (ప. బెం) 46. ఎం. బి. లక్ష్మీకుమారి, కావలి 47. శ్రీదేవి, ఖమ్మం 48. వై. సుబ్బరత్నమ్మ, ప్రొద్దుటూరు 49. ఎ. జె. శాంతాబాయి, అనంతపురం 50. శమంతకమణి, విశాఖపట్నం 51. బి. సరోజ, బెల్లంపల్లి 52. మాధురీప్రసాద్, 53. సి. ఉమాదేవి, కావలి 54. సి. హెచ్. జయశ్రీ, ఖరగ్‌పూర్ 55. పి. సుశీల, విజయవాడ 56. టి. శైలజకుమారి, బెల్లంపల్లి 57. సి. హెచ్. సరోజ, కోసూరు 58. వై. రాజరాజేశ్వరి, మంగళగిరి 59. సి. విజయలక్ష్మి, నిడదవోలు 60. సి. సత్యశ్రీ, నిడదవోలు 61. ఎం. మంగళ, గద్వాల్ 62. కె. శారద, పాలకొల్లు 63. సి. హెచ్. సరోజ, విజయవాడ 64. జి. కమల, హైద్రాబాదు 65. బి. లక్ష్మీరావు, దుర్గాపూర్ 66. సి. ఎస్. ఇందిరా జ్యోతి, కలకత్తా 67. ఎం. విజయలక్ష్మి, కావలి 68. వి. సుగుణ, నెల్లూరు 69. జి. సీతారామమ్మ, ఖరగ్‌పూర్, 80. బి. పద్మావతి, మద్రాసు 71. జి. సరోజినీదేవి, అనంతపురం 72. జె. బాలా త్రిపురసుందరి, కూచిపూడి 73. వి. ఇందిర, తిరుపతి 74. వై. రామసుబ్బమ్మ, ఆకుమళ్ల 75. వై. లక్ష్మీదేవమ్మ, ఆకుమళ్ల 76. కె. పార్వతి, ప్రొద్దుటూరు 77. కె వరలక్ష్మి, హైదరాబాదు 78. బి. రాణీరుద్రమ్మ, విజయనగరం 79. బి. హెచ్. పద్మావతి, మచిలీపట్నం 80. బి. రామలక్ష్మి, విజయనగరం 81. డి. సూర్యకాంతం, హైదరాబాధు 82. సి. హెచ్. విజయ, మద్రాసు 83. పద్మా శ్రీనివాసన్, హైదరాబాదు 84. బి. పద్మావతి, సికింద్రాబాదు 85. ఎన్. కామేశ్వరీమూర్తి, దుర్గాపూర్ 86. టి. సుశీల, తణుకు 87. పి. సత్యవాణి, బొంబాయి 88. డి. శ్యామల, విశాఖపట్నం 89. జి. మమత, కోట 90. పి. శ్రీదేవి, బరంపురం 91. ఎమ్. విశాలాక్షి, కడప 92. డి. కళావతి, దుర్గాపూర్ 93. కె. నటరాజకుమారి, జగ్గయ్యపేట 94. పి. చూడామణి, పినపాక 95. రోజామూర్తి, బృందావనం 96. కె. సరోజ, తణుకు 97. కె. చంద్రలేఖ, హైదరాబాదు 98. కె. జయలక్ష్మి, పెద్దకడబూరు 99. జి. కమల, నెల్లూరు 100. ఎన్. రమణి, హైద్రాబాదు 101. వై. వి. శివకాంత, అచ్చుతాపురం 102. టి. రాజేశ్వరీబాయి, పామిడి 103. ఎమ్. పద్మాసిని దమాల్‌చెరువు 104. ఎస్. అన్నపూర్ణ, కాకినాడ 105. సి. శ్యామలాదేవి, విజయవాడ 106. టి. ఆర్. ఈశ్వరి, నర్సీపట్నం 107. బి. సంధ్య, సికిందరాబాదు 108. ఎ. లక్ష్మీకామేశ్వరరావు, కల్పాక్కం 109. వి. జగదాంబ, నర్సీపట్నం 110. ఐ. సీతారామదేవి, హైదరాబాదు 111. టి. వి. ఎల్. కుమారి, తణుకు 112. ఎస్. దుర్గాంబ, తణుకు 113. అర్. శశిరేఖ, మదనపల్లె 114. పద్మామోహన్, గూటీ 115. ఎమ్. ప్రమీల, వరంగల్లు 116. ఎం. హైమవతి, నందిగామ 117. జి. మహాలక్ష్మి, సికింద్రాబాదు 118. కె. రాజేశ్వరి, హైదరాబాదు 119. టి. ఈశ్వరి, టిటాఘర్ 120. ఎం. వేదవల్లి, విశాఖపట్నం 121. ఎమ్. భానుమతి, కాకినాడ 122. ఎం. శ్యామలమ్మ, అనంతపురం 123. కమలా రామలింగం, కొత్తగూడెం 124 బి పుష్పావతి, చిత్తూరు 125. పి. కన్నకుమారి, హైదరాబాదు 126. బి. ఎస్. పద్మజ, హైదరాబాదు

బహుమతి మొత్తం రూ. 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.



# హేమలతా ఆంజనేయులు

మద్రాసులో పత్రికా విలేకరుల సమాఖ్యలు రెండు మూడు వున్నాయి. వాటిల్లో మద్రాసు ప్రెస్ క్లబ్ పేరు గాంచినది. ఇందులో దాదాపు అరవై మందిదాకా సభ్యులు వున్నారు. వీరు ప్రతి సంవత్సరం అధ్యక్ష పదవికి తమలో ఒకరిని ఎన్నుకుంటూ వుంటారు. అయితే యిన్నాళ్ళూ ఆ పదవి కేవలం పురుషులకే పరిమితం అయిపోతూ వచ్చింది. కేవలం సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపాల కోసం, ఆరోగ్యకరమైన వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడడానికి ఏర్పాటు చేసిన ఈ సంస్థ సభ్యులు ఇన్నాళ్ళ ఆచారానికి స్వస్తి చెప్పి - ఒక వనితని ఈ సంవత్సరం అధ్యక్షురాలుగా ఎన్నుకున్నారు. ఆ విధంగా అధ్యక్ష పదవిని అలంకరించిన ప్రప్రథమ వనిత శ్రీమతి హేమలతా ఆంజనేయులు తెలుగు వనిత కావడం విశేషం!

ఆమె పుట్టింది మచిలీపట్నంలోనైనా పెరిగింది మధ్యప్రదేశ్‌లోని రాయ్‌పూర్‌లో. అక్కడ ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు విద్యార్థుల సమస్యల మీద 'కరుణా కా పాథేయర్' అనే ఏకాంకిక రాశారు. ఆ నాటిక ఆమే నటించి ప్రదర్శించారు. అదే ఆమె తొలి రచనా ప్రయత్నం.

ఆ తరువాత 1952లో అలహాబాద్ ఆకాశవాణిలో పని చేస్తుండగా 'ఇంక్‌స్టాండ్', 'మైక్రోఫోన్' మొదలైన రేడియో నాటికలు రాశారు. అప్పుడే జోనల్ స్టేషన్‌లు ప్రారంభమయ్యాయి. మొట్టమొదటి నాటక పోటీలు కూడా ఆకాశవాణి నిర్వహించింది. ఆ పోటీలలో హేమలత కూడా పాల్గొన్నారు. రవికుమార్‌వర్మ పన్నా జీవితం మీద రాసిన 'దీప్‌దాన్' - సంగీత రూపకంలో ఆమె నటించి ప్రదర్శించారు. ఆ పోటీలలో 'దీప్‌దాన్' నాటికకి ప్రథమ బహుమతి లభించింది. పన్నా వేషం వేసిన హేమలత ఉత్తమ నటిగా బహుమతి అందుకున్నారు. ఆ విధంగా ఆమె రేడియో నాటక పోటీలలో మొట్టమొదటి బహుమతి పొందిన వనితగా నిలిచిపోయారు. అయితే ఆమెలో కళాతృష్ణ అంతటితో తీరలేదు. మద్రాసు వచ్చిన తరువాత 'రంగాయన్' సంస్థ తరఫున కొన్ని నాటకాలు వేశారు.

గ్వాలియర్ విశ్వవిద్యాలయం ద్వారా పట్టభద్రురాలైన హేమలత లక్నోలోని మారీస్ సంగీత కళాశాలలో వున్నత విద్యనభ్యసించారు. ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు శంకర్‌లాల్ మిశ్రా వద్ద ఆమె హిందుస్తానీ సంగీతంలో ఇండోర్‌ఘర్ పద్ధతిలో శిక్షణ పొందారు. వాయులీన వాద్యంలో కూడా ప్రవేశమున్న శ్రీమతి హేమలత వివిధ నగరాలలో పలు కచ్చేరీలు కూడా యిచ్చారు.

దక్షిణా ఆఫ్రికా డర్బన్ నగరంలోని భారతీయుల పిల్లలకి మన సంస్కృతి, భాష తెలియజెప్పాలని-హిందీ భాష చిన్నపిల్లలకి అర్థమయ్యేలా అత్యంత మధురంగా దాదాపు నలభై అయిదు పాటల రూపంలో ఆమె తనే స్వరకల్పన చేసి పాడారు.

సంగీత విమర్శకురాలుగా ఆమె పలు పత్రికలకు పనిచేశారు. గతంలో ఆమె ఆంగ్ల వార పత్రిక 'థాట్'; మాధురి, దినమాన్, ఆంధ్రజ్యోతి దిన పత్రికలకు విలేకరిగా పనిచేశారు. ప్రస్తుతం ఆమె వారణాసి నుండి వెలువడుతున్న హిందీ దిన పత్రిక 'ఆజ్' హాత్రస్ నుంచి వెలువడుతున్న మాస పత్రిక 'సంగీత్'లకి మద్రాసు విలేకరిగా వుంటున్నారు.

ఆమె రచనలు-'బోగన్‌విలియా' పేరిట కవితా సంకలనం, భారతీయ కళలపైన రాసిన 'భారతీయ కళా పర్ ఫిర్ ఏక్ నజర్', సాహిత్య అకాడెమీ ప్రచురణలకై 'భారతీయ కవిత' పేరిట హిందీలో కొన్ని కవితలు - మొదలైనవి.

శ్రీమతి హేమలతకి రష్యన్, మరాఠీ, గుజరాతీ, ఉర్దు, హిందీ, ఆంగ్ల తెలుగు భాషలు అనర్గళంగా వచ్చును. పంజాబీ, బెంగాలీ, తమిళ భాషలలో కూడా ఆమెకు ప్రవేశముంది.

రేడియో మాస్కోలో న్యూస్ రీడర్‌గా కూడా ఆమె కొంతకాలం పనిచేశారు. అప్పుడే ఆమె బ్రసెల్స్, లండన్, కైరో, ఏడెన్, కరాచీ, బుడాపెస్ట్ మొదలైన నగరాలు సందర్శించి అక్కడి టెలివిజన్ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

1971 నుంచి '78 వరకూ ఆమె ప్రాంతీయ సెన్సారుబోర్డు సభ్యురాలుగా వున్నారు.

ప్రస్తుతం డాక్టరేట్‌కి కృషి చేస్తున్న శ్రీమతి హేమలత 1964లో ప్రముఖ జర్నలిస్ట్ శ్రీ ఆంజనేయులను వివాహం చేసుకున్నారు.

"మీరు తెలుగులో ఎందుకు రాయలేదు?" అని అడిగితే—

"మా పూర్వీకులు చాలాకాలం క్రితమే రాయపూర్‌లో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. నేను పుట్టింది మచిలీపట్నంలోనైనా పెరిగిందంతా ఉత్తర భారతదేశంలోనే. తెలుగులోంచి హిందీలోకి అనువాదాలైతే చెయ్యగలను గానీ సొంతంగా రాయడానికి ధైర్యం చాలడం లేదు. నిజానికి నేను ఎమ్. ఏ. పాసైన తర్వాతే తెలుగు నేర్చుకున్నాను" అన్నారు హేమలత నవ్వుతూ.

"నేడు జీవన ప్రమాణం చాలా హెచ్చుగా వుంది. ఈ కరువు రోజుల్లో స్త్రీ ఎదుర్కొనే సమస్యలలో ముఖ్యమైనది – పిల్లల్ని కని పెంచడమే కాదు. వారిని సరైన విధంగా పోషించడం కూడా. పోషించడానికి పురుషుడు వున్నాడు కదా అనవచ్చు. కాని చాలీచాలని జీతాలతో పెరిగిపోతున్న వస్తువుల ధరలతో సతమతమయ్యే ఈ రోజుల్లో పురుషుడి సంపాదన పిల్లల పాలడబ్బాల దాకా వస్తున్నదా?

అందుకే విద్యావంతులైన యువతులు కేవలం 'పెళ్ళయ్యేదాకా తోచక చదువుకున్నాం' అని వూరుకోక ఏదో ఉద్యోగమో, వ్యాపకమో కల్పించుకోవాలి. కలిసి కట్టుగా సహకార సంఘాలు స్థాపించి వివిధ వస్తువులు తయారు చేసి పంపకం చెయ్యొచ్చు. మూడునాలుగేళ్ళు ఈ విధంగా కొంత సంపాయించి ఆ తరువాత వివాహం చేసుకుంటే ఆ సంపాదన కుటుంబానికి ఉపయోగపడుతుంది. జనాభా పెరుగుదలా తగ్గుతుంది. స్త్రీలందరిలోనూ ఈ ఆలోచన రావాలి. ఆచరణలో పెట్టాలి. నేడు స్త్రీలు అన్నిరంగాలలోనూ ముందంజ వేస్తున్నారు. చివరకి అంతరిక్షం దాకా కూడా ప్రయాణం చేసి వచ్చారు. కాబట్టి ప్రారంభంలో కొన్ని సమస్యలు ఉత్పన్నమైనా పట్టించుకోకుండా ముందుకు వెళ్ళితే సరి. అవహేళన చేసినవారే హారతి పడతారు." అన్నారు ఆమె. □

## *Come to Spencer's and welcome to*




**VUMMIDI**
**Bangaru Chetty & Sons**

Phone: 88730

—the master jewellers since 1900 • 769 Anna Salai, Madras-600 002


VBC Showroom

- GOLD
- DIAMONDS
- SILVERWARE
- QUARTZ WATCHES
- VBC WET GRINDERS

CCC/VBC/40

**JOIN OUR JEWELLERY SAVINGS SCHEME. ATTRACTIVE FREE GIFT.**

---

# "లోధ్ర" టానిక్ వనితలకు మాత్రం!




ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికి
నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికి
"లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్య
మయమైన జీవితాన్ని గడపండి.

78 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి
పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

Sistas

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________ PIN ____________

**కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్**

27, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు.




## చిట్టి కథ

ఆ జంక్షన్ ఎప్పుడూ సందడిగానే వుంటుంది. సాయంకాలం అయ్యేక ఆ వూళ్లో యువతరం అక్కడ సమావేశం అవుతుంది. కాలేజీ చదువులతో బుర్రలు వేడెక్కిపోయినవాళ్ళూ, ఉద్యోగాల వేటలో అలసిపోయినవాళ్ళూ, రోజంతా డ్యూటీచేసి విసిగిపోయిన వాళ్ళూ ఆ జంక్షన్‌లో గుంపులు గుంపులుగా చేరి గుసగుస లాడుకుంటారు.

ఓరోజు సాయంత్రం వచ్చేపోయే వాహనాలతో ఆ జంక్షన్ రద్దీగా వున్నప్పుడు, ఓ అడుక్కు తినే ముసల్ది రోడ్డుకి అటునుండి ఇటు రావడానికి ప్రయత్నం చేస్తూంది. వయసు మళ్లిన కారణంగా, తొందరగా నడిచే ఓపికలేక అడుగు ముందుకు వెయ్యడానికి ఆమె భయపడుతూంది. జంక్షన్‌లో గుమిగూడిన కుర్రకారు చాలాసేపటి నుండీ ఆమె పడుతున్న అవస్థ చూస్తూ వున్నారు. కానీ, ఎవరూ కూడ సాహసించి రోడ్డు దాటడంలో ఆ ముసలిదానికి సహాయం చెయ్యలేదు. అడుక్కునే ముసలిదాన్ని ఆదుకోవడానికి వాళ్లకి 'కాంప్లెక్స్' అడ్డమొచ్చింది. అంచేత ఎవరిమట్టుకు వారు ఆ ముసలిదాన్ని చూడనట్టే ప్రవర్తించారు. రోడ్డు మీద నడిచివెళ్ళే ఆడపిల్లల్ని అల్లరిచేస్తూ ఆ ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

ఈ లోపల ముసల్ది ఎలాగో మెల్లగా కాళ్లీడ్చుకుంటూ సగం రోడ్డు దాటేసింది. 'హమ్మయ్య! ఫర్వాలేదు. ఇవతలకొచ్చేసినట్లే' అనుకుని మరో నాలుగు అడుగులు ముందుకి వేసేసరికి 'రఁయ్' మని ఓ రిక్షా వచ్చి ముసలిదాన్ని గుద్దేసి 'కుయ్యోఁ' మని ఓ మూలకి ఒరిగిపోయిండి. రిక్షావాడు ముందుకి పడబోయి నిలదొక్కుకుని నిలబడిపోయాడు. రోడ్డుకి అడ్డం పడిన ముసలిదాన్ని వాడు బూతులు తిట్టడం మొదలుపెట్టాడు. ఇంతలో రోడ్డువార ఒరిగిపోయిన రిక్షాలోనుండి వయసులో వున్న ఓ అందాల చిన్నది ఒళ్లంతా ఒయ్యారం ఒలికిస్తూ బయటికి వూడిపడింది. ఆ చిన్నదాని కష్టం చూసి జంక్షన్‌లో పోగయిన కుర్రకారంతా వెంటనే ఆమె చుట్టూ వచ్చి చేరారు. 'అయ్యో పాపం!' అని సానుభూతి వచనాలు పలికేవాళ్ళు, 'దెబ్బలేమీ తగల్లేదు కదా!' అని పరామర్శించేవాళ్ళూ, 'సోడా తాగుతారా మేడమ్!' అని ఉదార స్వభావం నటించే వాళ్లూ.... ఆ ఒక్కక్షణంలో ఆమె మీద కొండంత అభిమానం కురిపించారు. చిన్నది, కట్టుకున్న చిలకపచ్చ నైలాన్ చీరను ఒకసారి సరిచేసుకొని, నవ్వుతూ అందరికీ 'థాంక్స్' చెప్పి మళ్ళీ వెళ్లి రిక్షాలో కూర్చుంది. వెనుకనుండి కుర్రకారు 'టాటాలు చీరియోలతో' రిక్షా ముందుకి సాగిపోయింది.

కుర్రకారు ఎప్పటిలా రోడ్డువారకి చేరి, 'ఏమి కళ్ళూ.... ఆహా ఏమీ నవ్వు'.... అని రిక్షాలో వెళ్లిపోయిన చిన్నదాని అందాన్ని నెమరువేసుకుంటున్నారు.

రోడ్డుకి మధ్య బోర్లా పడిపోయి కాళ్ళూ, చేతులు, నుదురు గీసుకుపోయి, రక్తం కారుతూ, బాధతో గిలగిలా కొట్టుకొని, అతికష్టం మీద పైకి లేచిన ముసలిదానివైపు మాత్రం పొరపాటున కూడ ఎవరూ కన్నెత్తి చూడలేదు.

—కవితాదేవి

## ముగ్గుల పోటీ

వనితలో మీరు ఎన్నో ముగ్గులు చూశారు. ఇతరత్రా కూడా ఎన్నో చూసివుంటారు. అవి కాకుండా, మీ ఊహా శక్తితో మీరు కొత్త ముగ్గు వెయ్యగలరా?

సంక్రాంతి – 'ముగ్గుల పండగ' గనక వచ్చే సంక్రాంతి సంచికలో (జనవరి 80) పోటీలో గెలుపొందిన మూడు ముగ్గులను ప్రచురిస్తాము.

### ఒక్కో ముగ్గుకి పారితోషికం యాభై రూపాయలు

ముగ్గు వేసే విధానం: ముగ్గు ప్రారంభం, పూర్తి ముగ్గు – రెండు బొమ్మల్లో వివరించాలి. పూర్తి ముగ్గు సైజు 6" × 6"కి తక్కువ కాకుండా వుండాలి. సిరా పూరకుండా వుండే కాగితం పైన, ఇండియన్ ఇంక్‌తో ముగ్గును – శుభ్రంగా అందంగా వెయ్యాలి. ముగ్గులు మాకు చేరవలసిన ఆఖరు తేదీ 24–11–79

పంపవలసిన చిరునామా: సంక్రాంతి ముగ్గుల పోటీ, వనిత, చందమామ బిల్డింగ్స్ మద్రాసు-26

[గత సంచిక నుంచి]

"అదీ జరిగిన కథమ్మా" అంది శాంతి. తన తల్లి వర్ధనమ్మతో అన్ని విషయాలూ వివరంగా చెప్పి.

వర్ధనమ్మ హతాశురాలై పోయింది.

శాంతి తప్ప వర్ధనమ్మకు వెనకా ముందూ ఎవరూ లేరు. అందుకే అన్ని ఆశలూ ఆమె మీదే పెంచి పెద్ద జేసింది వర్ధనమ్మ.

కాని – ఇదేమిటి? తన ఆశలన్నీ తలక్రిందులయ్యాయి. ఒక్కగానొక్క కూతురని ఎంతో అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసింది తను. అటువంటి తను యిప్పుడు కూతుర్ని ఎలా దండించగలదు? లేదు. అలా చెయ్యలేదు.

కాని....కాని....తన కూతురు పెళ్ళి కాకముందే ఎవరితోనో తిరిగి, కడుపు తెచ్చుకుందని ఊరూవాడా కోడై కూస్తుంటే తను భరించగలదా? అమ్మో! ఆ ఆలోచనే తను భరించలేదుగాక భరించలేదు.

అందుకే శాంతికి నచ్చజెప్పాలని చూసింది వర్ధనమ్మ.

"చూడమ్మా! జరిగిపోయిందేదో జరిగిపోయింది. నా మాట విని అబార్షన్ చేయించుకో. మరో పెళ్ళి చేసుకుందువు గాని" కన్న ప్రేమ అలా అనిపించింది. కాని వర్ధనమ్మకు కూతురు పట్టుదల తెలియంది కాదు. తను పట్టిన కుందేలుకి మూడే కాళ్ళు అనేరకం కూతురు. అయినా తల్లిగా తన బాధ్యతను చెయ్యాలిగదా! అనే ఉద్దేశంతో ఎన్నో రకాలుగా నచ్చజెప్ప చూచింది వర్ధనమ్మ.

కాని - శాంతి ససేమిరా వినలేదు.

"చూడమ్మా! నువ్వంటే నాకెంతగౌరవమో చెప్పలేను. ఆ విషయం నీకు తెలీంది కూడా కాదు. కాని ఈ ఒక్క విషయంలో నాకేమీ చెప్పొద్దు. నన్ను క్షమించు....అమ్మా! ఒక స్త్రీగా నువ్వు కూడా నన్ను అబార్షన్ చేయించుకోమనీ, మరో పెళ్ళి చేసుకోమనీ బలవంతం చెయ్యడం నేను హర్షించలేనమ్మా! ఇంత నిర్మొహమాటంగా నీ మాటను కాదంటున్నందుకు నన్ను క్షమించు.... పోయిన శీలాన్ని కప్పిపుచ్చుకొని, మరొకరికి అర్ధాంగిని కమ్మంటావు. అంతేనా? ఇది మోసం కాదంటావా? చెప్పమ్మా! ఒకవేళ ఆ వ్యక్తితో దాచకుండా నిజం చెప్పినా అతడు అర్థం చేసుకుంటాడా? జీవితాంతం నా శీలాన్ని శంకిస్తూ, నన్ను అనుమానిస్తుంటే నేను భరించగలనా? ఒకవేళ ఎవరైనా నా దీన స్థితికి జాలిపడి నన్ను పెళ్ళి చేసుకున్నా, నా పాపం అనుక్షణం నన్ను వెంటాడి నాకు మనశ్శాంతి లేకుండా చేస్తుంది. అనుక్షణం నన్ను పీడిస్తుంది. వద్దమ్మా! వద్దు....మనశ్శాంతి లేని జీవితం నాకొద్దు. నన్నిలాగే బ్రతకనియ్యి....ఈ జీవితంలోనే నేను మనశ్శాంతిని వెతుక్కుంటాను" అంది శాంతి.

కూతురు పట్టుదల తెలిసిన వర్ధనమ్మ మరి మాట్లాడలేదు.

కాని - మరోవారానికల్లా ఏ జబ్బూ లేకుండానే ఆమె మంచమెక్కింది.

మరో మూడు నెలలు అయినా గడవకముందే మనోవ్యాధితో తీసుకొని తీసుకొని, శాంతిని ఈలోకంలో ఒంటరిగా వొదిలేసి, తను మరో లోకానికి వెళ్ళిపోయింది.

తల్లి మరణం గొడ్డలి పెట్టులా అయింది శాంతికి.

ఇంతకాలం తనకు తోడునీడగా నిలిచిన తల్లి ఇక ముందు లేదనే భయంకరమైన నిజం ప్రత్యక్షంగా తెలియగానే, తల్లడిల్లిపోయింది శాంతి.

ఇప్పుడిక శాంతి ఒంటరిది.

ఒంటరి శాంతిలో పెరుగుతోన్న మరో ప్రాణి!

ఇంతకాలం పుట్టి పెరిగిన తమ ఇంట్లో తల్లి జ్ఞాపకాలు ఉక్కిరి బిక్కిరి చేసి మరీ భయపెడుతున్నాయి తనని. అదీకాక, పువ్వులమ్మిన చోట కట్టెలమ్మటం తనకి ఇష్టంలేదు. అందుకే ఉన్న ఒక్క ఇంటినీ అయినకాడికి తెగనమ్మి తన జాడ ఎవ్వరూ తెలుసుకోలేని ఓ మారు మూల పల్లెటూరు చేరుకుంది. ఒక ఇంటిని అద్దెకు తీసుకొని క్రొత్త కాపురం పెట్టింది.

అక్కడే కొన్ని నెలలకి ప్రసవించింది కూడా.

కూర్చొని తింటే కొండలైనా కరిగిపోతాయన్న సామెత ప్రకారం, ఇంతకాలం కూర్చుని తిన్నందుకూ, ఇంటి అద్దెకూ శాంతి వెంట తెచ్చుకున్న డబ్బు కాస్తా హారతి కర్పూరంలా హరించుకుపోయింది.

ఇక చేసేదిలేక తన దగ్గర వున్న నగలు ఒక్కటొక్కటిగా అమ్మడం మొదలు పెట్టింది. అవి మాత్రం తనకీ తన కొడుక్కీ ఎంతకాలం తిండి పెట్టగలవు? తన ఒంటి మీద బంగారు నగల దగ్గర్నుండీ ఇంటిలో వెండి, ఇత్తడి సామాన్ల వరకూ అన్నీ పలాయనం చిత్తగించాయి. ఆలోచనలో పడింది శాంతి.

ఇల్లు గడవటం మాట ఎలా వున్నా ఇల్లు గల వాళ్ళకి ఇంటద్దె కూడా రెండు నెల్లు బాకీ పడింది. ఇంటద్దె బాకీ ఎలా కట్టాలో అర్థంకాక ఆలోచిస్తూ వున్న సమయంలో ఇంటిగలావిడ వచ్చింది శాంతి దగ్గరికి.

శాంతి అంటే ఆ చుట్టుప్రక్కల ఇళ్ళల్లో అప్పుడే ఒక అభిమానం ఏర్పడిపోయింది. ప్రత్యేకంగా శాంతి అంటే శాంతి ఇంటిగలావిడకి మరీ ఎక్కువ అభిమానం వుంది.

అందుకే ఆవిడ అడిగింది శాంతిని.

"చూడమ్మా శాంతీ! నువ్వు చూస్తే చదువుకున్న దానిలా వున్నావు. నువ్వొచ్చి రెండు సంవత్సరాలు గడిచిపోతున్నా మీ వాళ్ళెవరూ నీ దగ్గరికి రాలేదు. అందుకే అనుమానం వచ్చి అడుగుతున్నాను. మరో విధంగా అనుకోకు శాంతీ! నేను నీ తల్లిలాంటి దాన్ని, నాతో నీ బాధ చెప్పుకో. చెప్పుకుంటే గుండెల్లో బాధ కొంత తీరుతుందంటారు. నిజంగా నీ కష్టాలు చూస్తుంటే నా గుండె తరుక్కుపోతుంది. వచ్చినప్పుడు ఎంత కళగా వుండేదానివో....ఇప్పుడు చూడు-లంకణాలు చేసిన దానిలా ఎలావున్నావో....అందుకే ఇంతగా అడుగుతున్నాను శాంతమ్మా .... నాకేదో ఇంటద్దె బాకీ ఇవ్వాలని నేనీ ఆరాలు తియ్యడంలేదు. నాకు నువ్వు డబ్బు ఇవ్వకపోయినా ఫర్వాలేదు. నాకెలాగూ పిల్లలు లేరు. నువ్వే నా కూతురు అనుకుంటాను." అంది ఎంతో వాత్సల్యంగా ఇల్లుగలావిడ – వరలక్ష్మి.

ఆవిడ ఆప్యాయతకు కళ్ళు చెమర్చాయి శాంతికి.

భోరున ఏడ్చింది.

తన కథనంతా చెప్పుకుంది.

శాంతి కథను విన్న వరలక్ష్మి హృదయం ద్రవించింది.

ఆ రాత్రే శాంతి కథను భర్త చెవుల్లో కూడా వేసి, ఏదో విధంగా శాంతికి ఉద్యోగం వచ్చే ఏర్పాట్లు చెయ్యమని పురమాయించింది వరలక్ష్మి.

వరలక్ష్మి వాళ్ళ ఆయనకు ఆ ఊళ్ళో మంచి పలుకుబడి వుంది. ఆ పలుకుబడిని ఉపయోగించి నెలరోజులు తిరిగే నాటికల్లా శాంతికి ఆ ఊరి పంచాయితీ స్కూల్లో టీచరుగా ఉద్యోగం వేయించాడు.



# నాణానికి మూడో వైపు

డాక్టర్ టి. విమల

అలా శాంతి కష్టాలు గట్టెక్కాయి.

అలా....అలా....కష్టాలు గట్టెక్కిన శాంతి జీవితంలో నిలద్రొక్కుకో గలిగి, సారధిని ఎం. ఎ. వరకూ చదివించగలిగింది.

*

"అదీ బాబూ....మీ అమ్మ కథ....ఈ లోకం నన్ను చెడిపోయిన ఆడది అంది. మొగుడు వొదిలేసిన ముండ అన్నారు. ఇంకా ఎన్నెన్నో కథలు అల్లుకొని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ నా మనసును గాయపరిచారు....కాని అవేమీ నేను లెక్క చెయ్యలేదు. నా ఆశయం అల్లా ఒక్కటే. అదే నిన్ను కనాలి....పెంచి పెద్ద చెయ్యాలి....ఈ సంఘంలో ఒక మనిషిగా నిన్ను తీర్చి దిద్దాలి. వ్యక్తిత్వం వున్న మనిషిగా నిన్ను నేను చూడాలి. ఆ ఆశతోనే నేను నీకు జన్మ యిచ్చాను....ఇప్పుడు చెప్పుబాబూ! నీకు నేను జన్మ నివ్వటం తప్పా?....చెప్పు బాబూ....చెప్పు...." కన్నీటి మధ్య తలొంచుకొని నిలబడ్డ తల్లిని చూస్తూనే చలించిపోయాడు సారధి.

సారధి హృదయం బరువెక్కింది.

"అమ్మా! తప్పు చేసింది నువ్వు కాదమ్మా - ఈ సంఘం తప్పు చేసింది. ఈ వ్యవస్థ తప్పు చేసింది. ఈ మనుష్యులు తప్పు చేశారు. వాళ్ళు సిగ్గుపడి తలొంచుకోవాలిగాని, నువ్వెందుకమ్మా సిగ్గుపడాలి. నువ్వు గర్వపడాలి....నిన్ను చూచి ఈ లోకం గర్వపడాలి. నీలాంటి స్త్రీ కడుపున పుట్టినందుకు నేను గర్వపడాలి. అమ్మా! నువ్వు దేవతవి. నువ్వు నమ్ముకున్న ఆశయాల కోసం నిన్ను నువ్వు బలి చేసుకున్నావు. ఇంతకాలం కష్టాలు అనుభవించావు. కన్నీళ్లు రుచి చూశావు. ఇక నువ్వేమీ దిగులు పడకమ్మా....నీకు నేనున్నాను. నన్ను కన్నందుకు కొడుగ్గా నీ ఋణం తీర్చుకుంటాను. నిన్ను పువ్వుల్లోపెట్టి పూజిస్తానమ్మా...నా మాట నమ్మమ్మా."

ఆవేశంగా అంటున్న కొడుకుని దగ్గరకు తీసుకొని, గుండెలకు చేర్చుకొని, తల నిమురుతూ-

"బాబూ! ఈ క్షణం కోసమే నేనింతకాలమూ ఈ కష్టాలనీ, కన్నీళ్ళనీ భరించాను బాబూ! కొడుగ్గా నువ్వయినా నన్ను అర్థం చేసుకున్నావు. ఈ క్షణంలో భగవంతుడు నా ప్రాణాలు తీసుకుపోయినా సంతోషంగా కళ్ళు మూస్తాను బాబూ! నాకీ ఆనందం చాలు...నాకీ ఆనందం చాలు" అంటూ ఆనంద బాష్పాలు కార్చింది శాంతమ్మ.

## 3

సారధి ఇంటర్వ్యూకి వెళ్లొచ్చి వారం రోజులవుతోంది.

ఆ రోజు ఉదయమే ప్రక్క ఊరికి పని మీద వెళ్లిన సారధి సాయంత్రం పొద్దుపోతూండగా ఇల్లు చేరుకున్నాడు.

ఇంటి ముందు పెద్ద కారు వుండటం చూచి క్షణం నివ్వెరపోయాడు.

ఎవరిదీ కారు?

తమకెవరూ ఇంత పెద్ద కారున్న బంధువులు గానీ, మిత్రులుగానీ, పోనీ తెలిసిన వాళ్ళుగాని లేరే!

మరి ఎవరిదై వుంటుందబ్బా!

ఆలోచనలు ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే ఇంట్లో అడుగు పెట్టబోయాడు.

కాని - వరండాని ఆనుకొని వున్న గదిలోంచి ఎవరివో అపరిచిత వ్యక్తి మాటలు వినబడుతుంటే మంత్రించినట్లు ఠక్కున ఆగిపోయాడు.

"చూడు శాంతీ! నీ పట్టుదల నీదేగాని, నా మాట కొంచెం కూడా వినిపించుకోనంటావ్?" అంటూంది ఓ మగ కంఠం.

ఆ కంఠం ఎక్కడో విన్నట్లుంది సారధికి.

ఎక్కడ?....ఎక్కడ?

ఎప్పుడు?....ఎప్పుడు?

ఎక్కడ?....ఎప్పుడు?

ఎప్పుడు?....ఎక్కడ?

మైక్రోవేవ్స్ కంటే వేగంగా పయనించాయి ఆలోచనలు. ఆలోచనల్లో అంతు దొరికింది, సారధికి.

అవును. ఆ గొంతు వారం రోజుల క్రితం....తను అటెండైన ఇంటర్వ్యూలో....విన్నాడు. అది రాజశేఖరానిది. అవును....రాజశేఖరానిదే....తను ఆరోజే అనుకున్నాడు - రాజశేఖరానికీ తనకూ ఏవో పోలికలున్నాయని....అందులోనూ ఆయన ప్రవర్తన

కూడా అనుమానాస్పదంగానే కనబడింది తనకి....

అంటే....అంటే....

అమ్మ ప్రేమించిన రాజశేఖరం....ఈ రాజశేఖరం ఒక్కరేనన్నమాట. ఇంటర్‌వ్యూకి వెళ్లొచ్చి, రాజశేఖరం అనే ఆఫీసరు అచ్చం తనలాగే వున్నాడనీ, ఆయన ప్రవర్తన మీద అనుమానం కలిగే, ఇలా నాన్న నిజంగా చనిపోయాడా? అని అడగవలసి వచ్చిందనీ తల్లితో తను చెప్పలేదు.

ఇప్పుడు మళ్ళీ రాజశేఖరం - అంటే తన తండ్రి మళ్ళీ రంగప్రవేశం చేశాడు. ఇప్పుడు తన తల్లి ప్రవర్తన ఎలా వుంటుందో గమనించాలి.

గతాన్ని మరచిపోయి, గతంలో రాజశేఖరం చేసిన ద్రోహాన్ని క్షమించి తన తల్లి రాజశేఖరం వంచన జేరుతుందా?

ఏమో చెప్పలేం....!

తరతరాలుగా మగవాడు స్త్రీని మోసం చేస్తూనే వున్నాడు. మోసం చేసినప్పుడల్లా ఆడది తన తప్పును తెలుసుకొంటూనే వుంది. మగవాడి వంచనకు దూరంగా వుండాలని శపథాలు చేసుకొంటూనే వుంది. కాని అదే మగవాడు - మోసం చేసిన మగవాడు ఆడదాని దగ్గరికి వచ్చి–'తప్పయిపోయింది. నన్ను క్షమించమని' కళ్ళనీళ్ళు పెట్టుకొని ప్రాధేయపడి అడగ్గానే ఆడది కరిగిపోతుంది. మళ్ళీ ఆ మోసగాడ్ని నమ్ముతుంది. అదేనేమో ఆడదానిలో తరతరాల నుండీ జీర్ణించుకుపోయిన క్షమాగుణం!!

ఆ క్షమాగుణమే యిప్పుడూ తన తల్లిలోనూ వుంటే!

ఆ క్షమాగుణం తను క్షమించగలదా? రాజశేఖరాన్ని తండ్రిగా అంగీకరించగలదా?... ఏమో!....ఏమో!

ఆలోచించలేకపోయాడు సారధి.

ప్రక్క గదిలోంచి మాటలు వినిపిస్తూనే వున్నాయి. సభ్యత కాదని తెలిసినా ఆ మాటలు వినసాగాడు సారధి.

"క్షమించండి రాజశేఖరంగారూ!.... పాతిక సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనల్ని మళ్ళీ గుర్తుకుతెచ్చి, నా మనసును అల్లకల్లోల పరచకండి. జరిగిందేదో జరిగిపోయింది. ఈ వృద్ధాప్యంలో నాకు కావాల్సింది - మళ్ళీ చెడిపోయిన నా సంసారం కాదు. నాకు కావాల్సింది ప్రేమ, ఆప్యాయత, అనురాగం. అవే నాకు కావాలి....అవి నా నోముల పంట నా సారధి దగ్గర లభిస్తాయనే నమ్మకం నాకుంది. నాకింతకంటే ఈ జీవితంలో ఇంకేమీ అవసరం లేదు. దయ వుంచి ప్రశాంతంగా బ్రతుకుతున్న మా జీవితాల్లోకి ప్రవేశించాలని ఆశ పడకండి. ఆస్తి అంతస్తు పేరుతో మమ్మల్ని ప్రలోభ పెట్టకండి. ఈ విధంగా మాట్లాడుతున్నందుకు నన్ను క్షమించి ఇక్కడి నుంచి వెంటనే వెళ్ళిపొండి. ఇప్పుడో ఇంకాసేపట్లోనో నా కొడుకు రావొచ్చు. వాడు మన మాటలు వింటే బావుండదు. దయవుంచి వెళ్ళిపొండి...." అంటోంది తన తల్లి.

"లేదు శాంతా....లేదు. నేనిప్పుడు ఏకాకిని. ఏ ప్రేమానురాగాలకీ నోచుకోని దౌర్భాగ్యుణ్ణి. నీకు చేసిన ద్రోహం ఈ లోకంలోనే నాకు తగిలింది. నిన్ను నమ్మించి మోసం చేశాను కాదనను. కాని నిజానికి నీకు మోసం చెయ్యాలనే తలంపు నాకు లేదు. ఛండశాసనుడైన మా నాన్న మాటకు ఎదురుచెప్పే ధైర్యంలేక, ఆస్తి కోసం అంతస్తు కోసం ఒక మూర్ఛరోగి మెడలో తాళి కట్టిన పిరికివాడిని. కాని ఆ మూర్ఛరోగికైనా జీవితాంతం భర్తగా వుండాలని ఆశించినా ఆశ ఫలించని దౌర్భాగ్యుడ్ని....నా భార్య అకస్మాత్తుగా పెళ్ళయిన రెండు సంవత్సరాలకే మేడ మీది నుండి మూర్ఛవచ్చి క్రిందపడి దారుణంగా చనిపోయింది. మా నాన్న ఇంచుమించుగా ఆ సంవత్సరంలోనే ఒక కారు యాక్సిడెంటులో ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

"నా భార్య చావు, నా తండ్రి చావు నాకు ఆస్తినీ, ఏక ఛత్రాధిపత్యాన్ని తెచ్చిపెట్టిందేగాని, మనిషికి కావాల్సిన మనశ్శాంతిని దూరం చేసింది. వీటన్నిటికి కారణం ఆనాడు నువ్వు కార్చిన కన్నీళ్ళే! ఆడదాని కన్నీళ్ళు మగవాడికి జయం కాదు. అరిష్టాన్నే తెచ్చిపెడుతుంది. అందుకే నీకోసం ఎంతగానో ప్రయత్నించాను. నీకు జరిగిన అన్యాయానికి కనీసం క్షమాపణలు చెప్పుకోవాలనీ, మనస్ఫూర్తిగా క్షమించమనీ అడగాలనుకున్నాను. కాని నువ్వు ఊరు విడిచి వెళ్ళిపోయినట్లు తెలిసింది. అప్పటి నుంచీ నీ గురించి ఆలోచించని రోజంటూ లేదు కాని వారం రోజుల క్రితం ఇంటర్‌వ్యూలో సారధిని చూచిన తర్వాత సారధి ఫైల్లో నీ ఫొటో చూచిన తర్వాత మీ వివరాలు తెలిశాయి. నిన్ను కలుసుకోగలిగాను.

"చూడు శాంతీ....సారధికి నా దగ్గరగానీ, మరొకరి దగ్గరగానీ ఉద్యోగం చెయ్యవలసిన ఖర్మేం పట్టింది? నేనెటూ ముసలివాడిని అయిపోయాను. ఇప్పుడు నాకు కావాల్సింది బాధ్యతలు కాదు. విశ్రాంతీ, మనశ్శాంతి. సారధికి నా బరువు బాధ్యతలు అప్పగించి విశ్రాంతి తీసుకోవాలని కలలు కంటూ ఇంతదూరం వచ్చాను. నీకు చేసిన అన్యాయానికి ఈ విధంగానైనా నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవడం తప్పని నేననుకోను.

"అందుకే నా మాట కాదనకు శాంతీ! నువ్వు చెప్పితే సారధి కాదనడు. సారధికి నచ్చచెప్పు. మీరిద్దరూ నాతో వచ్చేయండి. నా కోరిక తీర్చండి. ప్లీజ్...."

రాజశేఖరం ప్రాధేయపడి అడుగుతున్నాడు.

సారధి వళ్ళు వేడెక్కింది.

ఇరవైఅయిదు సంవత్సరాలు తననీ తన తల్లినీ గాలికి వొదిలేసి, మేమేమైపోయామో కూడా ఆరా తియ్యని పెద్ద మనిషికి, అకస్మాత్తుగా మేం కావాల్సివచ్చామన్న మాట!

ఎందుకు?....ఎందుకు?....

ఆలోచిస్తున్నవాడల్లా తక్కున ఆగిపోయాడు సారధి.

అమ్మ అంటోంది.

"క్షమించండి. ఎన్నివిధాలుగా చెప్పినా మీరు అర్థం చేసుకోడం లేదు. నేను ఇదివరకటి శాంతని కాదు. జీవితంలో పూర్తిగా ఎదురు దెబ్బలు తిని జీవితాన్నీ, మనుష్యుల్నీ కాచివడబోసిన శాంతమ్మని. కాబట్టి మీ మాటలు నా మీద పని చెయ్యవు. వెళ్ళిపొండి. దయవుంచి నన్ను విసిగించకండి."

ఇంక ఎక్కువసేపు తెర వెనుక వుండటానికి మనసు బుద్ధిపుట్టలేదు సారధికి. క్షణం ఆలోచించి, సభ్యతకోసం తలుపు మీద రెండుసార్లు చేత్తో తట్టి లోపలికి వెళ్ళాడు సారధి.

సారధిని చూచి నోరు తెరచింది శాంతమ్మ. రాజశేఖరం ముఖం ఆనందంతో విప్పారింది.

"సారధీ!....బాబూ!....మీ అమ్మ...." ఏదో చెప్పబోయాడు రాజశేఖరం.

"సారీ! రాజశేఖరంగారూ...మీరు నన్నా పేరుతో పిలవొద్దు. 'బాబూ' అన్న పిలుపుకి అపవిత్రత ఆపాదించవద్దు. మీరు అలా పిలవడానికి అనర్హులు. మీ కామానికి కళ్ళు తెరచి తండ్రి ప్రేమకు నోచుకోని నేను – ఈనాడు కూడా ఆ తండ్రి ప్రేమను ఆశించడం లేదు. ఇకపోతే అసలు విషయానికి వద్దాం. మీరు నాకేమీ చెప్పవద్దు. సభ్యత కాదని



*

'భర్తే భార్యను మానభంగం చేస్తే వంటి మకుటాల్తో కథలు, సినిమా సన్ని వేశాలు మనకి చాలానే వచ్చాయి. కాని అమెరికాలోని సేల్‌నగరంలో ఒక గ్రెటా రైడ్ అవుట్ అనే భార్యామణి తన భర్త తనని మానభంగం చేశాడని ఫిర్యాదు చేసింది. అంతేకాదు. అతను తన మీద చేయి కూడా చేసుకునేవాడని, నానా విధాలుగా హింసించేవాడనీ చెప్పింది. ఆమె తరపున వాదించిన న్యాయవాది-వివాహమనేది భార్యని బలవంతంగా అనుభవించడానికి పొందిన రక్షణ కవచం కాదని వాదించాడు. ఆమె భర్త జాన్‌రైడ్ అవుట్ తరపున వాదించిన న్యాయవాది మాత్రం 'ఇదంతా గ్రెటా విడాకులు పొందడానికి చేస్తున్న కుట్ర అనీ, తనకంటె చిన్నవాడైన తన భర్తతో ఆమె ప్రేమించడమైతే ప్రేమించిందికానీ మనసు కలిపి కాపురం చెయ్యలేకపోతోందనీ.... అసలు సంగతి యిదనీ' తేల్చి చెప్పాడు.

శ్రీ కోర్టువారు తల్చుకుంటే జాన్‌కి ఇరవై ఏళ్లు శిక్షపడివుండేది కాని 21 ఏళ్ళ జాన్‌ని 23 ఏళ్ళ గ్రెటాని చూశాక వారికి ఆ లాయర్ చెప్పింది సబబుగానే అనిపించి అతన్ని నిర్దోషిగా నిర్ణయించి విడిచిపెట్టారు.

*

తెలిసినా, నాలోని ఉత్సుకత తలుపు చాటు నుండి మీ మాటల్ని మొత్తం వినేట్లు చేసింది. అందుకు ముందుగానే క్షమాపణలు చెప్పుకుంటున్నాను.... మీరు నాకేమీ చెప్పనవసరం లేదు. మీకూ మా అమ్మకూ జరిగిన సంభాషణ అంతా విన్నాను. అందుకే నా నిర్ణయాన్ని కూడా చెబుతాను వినండి.

"మీకు భార్య పోయింది కనుక ప్రస్తుతం మీకు భార్య కావాల్సి వచ్చినా, మీకు తల కొరివి పెట్టడానికీ, మీ బాధ్యతలు స్వీకరించడానికీ మీకో కొడుకు కావాల్సి వచ్చినా, మేము అందుకు అంగీకరించడానికి సిద్ధంగా లేం.... మీరు చాలా గొప్పవాళ్లే కావొచ్చు. మీకు తరతరాలు తిన్నా తరగని ఆస్తిపాస్తులే వుండవచ్చు. కాని వాటి మీద మాకు మోజులేదు. మాకూ మానాభిమానాలున్నాయి. మీరు తరిమేసినప్పుడు బయటికి పోవడానికీ, రమ్మన్నప్పుడు రావడానికీ మేము ఆత్మ విశ్వాసం లేని మనుష్యులం కాదు.

"రాజశేఖరంగారూ! మీరు ఎరగా చూపించే ఆస్తిపాస్తులేవీ మమ్మల్ని ప్రలోభ పెట్టలేవు. మేము పేదరికంలోనే పుట్టాం. పేదరికంలోనే పెరిగాం. ఇక ముందూ పేదరికాన్నే రుచి చూచి అందులోనే కళ్ళు మూస్తాం. మాకు అందులోనే హాయీ ఆనందమూ వున్నాయి.

"మీరు నాకు జన్మ నిచ్చిన తండ్రనే నగ్నసత్యం ముందుగానే తెలిసి వున్నట్లయితే మీ దగ్గరికి వుద్యోగానికే కాదు — అసలు మీ మొఖం చూడటానికే ఇష్టపడేవాడ్నికాదు. ఇప్పుడు మీ ఉద్యోగమేకాదు. మీరు అందల మెక్కిస్తానన్నా నేను అందుకు సుముఖంగా లేను.

"రాజశేఖరంగారూ! మీరు నాణానికి బొమ్మా-బొరుసూ రెండే చూశారు. కాని నాణానికి మూడో వైపు కూడా వుంటుందని ఊహించలేకపోయారు. అదే ఆత్మాభిమానం. మీలాంటి ఏ కొద్ది మందో తప్పించి ఆత్మాభిమానం చంపుకుని బ్రతికే మనుష్యుల్ని నేను ఎక్కడా చూడలేదు. మాకు ఆత్మాభిమానమే ఆస్తిపాస్తులు.

"రాజశేఖరంగారూ!....నాకు ఉద్యోగం రాకపోయినా పర్వాలేదు. ఆస్తిపాస్తులు లేకపోయినా పర్వాలేదు. కాయకష్టం చేసి నా తల్లిని పోషించగల కండబలం వుంది. గుండెబలం వుంది. ఈ సంఘాన్ని, ఈ మనుష్యుల్ని ఎదిరించి నిలబడగలిగే మనోధైర్యం వుంది. ఇవన్నీ మీలాంటి ఒక సిరికివాడి దగ్గర నుండి సంక్రమించినవి కావు. నా తల్లి పోషణలో, శిక్షణలో నేను అలవరచుకున్న గుణాలు. ఈ ఇల్లు ఒక పవిత్ర దేవాలయం. అందులో నా తల్లి ఒక పవిత్ర దేవత. నేను ఆ దేవతను ఆరాధించే పూజారిని. ఈ పవిత్ర దేవాలయంలో నీలాంటి సిరికివారికీ వంచకులకీ తావులేదు. దయవుంచి వెళ్ళిపొండి. ఈ ఆలయం పవిత్రతకేకాదు — ప్రేమకూ, ఆప్యాయతకూ, అనురాగానికీ నిలయం. వెళ్ళిపొండి మీలాంటి వారి నీడ పడినా ఇది మైలపడిపోతుంది పొండి. వెళ్ళిపొండి."

ఆవేశంగా అంటున్న సారధిని చూచి ఆశ్చర్యపోలేదు శాంతమ్మ. తన రక్తం పంచుకుని పుట్టిన తన బిడ్డ తన కళ్ళముందే తప్పటడుగులు వేసి, వచ్చీరాని మాటలు మాట్లాడిన తన బిడ్డ తన కళ్ళ ముందే పెరిగి పెద్దవాడైన తన బిడ్డ....తన సారధి. ఇంత ఉన్నతంగా మహోన్నతంగా తన కంటే ఉన్నతంగా ఎదిగి పోయినందుకు ఆనందపడిపోయింది. ఆనందబాష్పాలు రాల్చింది.

రాజశేఖరం ఖిన్నుడై పోయాడు.

"అవును....తనకు ఇక్కడ స్థానం లేదు.... స్థానం లేదు...."

గొణుక్కుంటూ, వెనక్కి తిరిగాడు. ఆ తల్లినీ, కొడుకుని చూసే ధైర్యం చాలక, రాజశేఖరం. □

# ఆడపడుచు అర్ధమొగుడు

పెదపూడి రాజ్యలక్ష్మీదేవి

ఆరేళ్ళక్రితం నాకూ నా స్నేహితురాలు సరోజకీ జరిగిన సంభాషణ యిది. వంటింటి ముచ్చట్ల దగ్గర్నుంచి ప్రపంచ రాజకీయాల వరకూ అనేక విషయాలు మా మధ్య దొర్లాయి.

మాటల సందర్భంలో సరోజ వాళ్ళ అన్నయ్యకి సంబంధం కుదిరిన సంగతి చెబుతూ "రేపు ఆ వచ్చే పిల్ల ఎటువంటిదవుతుందోనే! రేపు పెళ్ళయ్యాక మా అన్నయ్య మమ్మల్ని సరిగా చూస్తాడో లేదో–!'' అన్న సందేహాన్ని వెలిబుచ్చింది.

"అంటే–?'' అన్నాను ఆశ్చర్యంగా.

"ఇప్పుడైతే సెలవు లిచ్చినప్పుడల్లా ఇక్కడికి వస్తున్నాడు. అమ్మకీ నాకూ ప్రతి పండుగకూ చీరలు కొనిపెడుతున్నాడు. సినిమాలకి తీసుకు వెడుతున్నాడు. రేపు పెళ్ళయితే ఇప్పట్లా తరుచు రాలేడు కదా! ఆ వచ్చే వదిన అన్నయ్యని మార్చేస్తుందేమోనని భయంగా వుందే రాజా! లోకంలో ఎందర్ని చూడటం లేదు? మా అన్నయ్య అసలే అమాయకుడు. వాడిని కొంగుకు కట్టుకు తిరుగుతుందేమోనని భయమేస్తోంది. నా మట్టుకు నాకు అన్నయ్య పెళ్ళి చేసుకోకుండా వుంటేనే బాగుంటుందనిపిస్తోంది.''

విద్యావతి, సంస్కారవంతురాలు అయిన నా స్నేహితురాలి మాట తీరుకు, ఆలోచనా సరళికి విస్తుపోయాను.

కాస్త తేరుకున్నాక, "సరోజా! నువ్వేనా యిలా మాట్లాడుతున్నది....?'' అన్నాను.

"వున్న మాట అన్నాను. ఏం–?'' అన్నది సరోజ తల ఎగరేసి.

"ఈ మాటలు నీ అంతట నువ్వే అంటున్నావా? లేక మీ ఇంట్లో వాళ్ళ ద్వారా నీ బుర్రలోకి ట్రాన్స్‌ఫర్ అయ్యాయా?'' అన్నాను చివరి మాట ఒత్తిపలుకుతూ.

"భావాలు ఎవరివైతేనేం లే ఏం తప్పా—?'' అంటూ మళ్ళీ ప్రశ్నించింది సరోజ నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"అహఁ అంతమాట నేను అనగలనా? ఒక రకంగా రైటే – నీ దురాలోచనకు చాలా సంతోషంగా వుందే!''

నా మాటల్లోని వ్యంగ్యాన్ని అర్థం చేసుకోలేని సరోజ నేను దూరాలోచన అని అన్నాననుకుని మరి కాస్త వుత్సాహాన్ని పుంజుకుని లోకంలో పెళ్ళి అయీ అవగానే కొత్త పెళ్ళికూతురు భర్త మనసు ఏ విధంగా విరవడం మొదలెడుతుందో సోదాహరణంగా చెప్పుకొచ్చింది.

ఓపిగ్గా అంతా విని, "నే నొక్కమాట చెప్పుతాను, వింటావా సరోజా?'' అన్నాను.

"ఏమిటీ?" చీర కుచ్చెళ్ళు సర్దుకుంటూ ఓరగా చూసింది సరోజ.

"రేపు ఆ వచ్చే వదినమ్మ మీ అన్నయ్యని మార్చేసి మీకు కాకుండా ఎక్కడ చేస్తుందో అన్న భయాన్ని వెలిబుచ్చావు. అలాగే భవిష్యత్తులో నీ పెళ్ళయ్యాక నీ ఆడపడుచు కూడా అచ్చు యిప్పుడు నువ్వాలోచించినట్లే ఆలోచిస్తే—!'' అంటూ నాన్చేసి సరోజ ముఖ కవళికలను పరీక్షించాను.

అంతవరకూ నవ్వుతూ వున్న సరోజ మొహం ముడుచుకు పోయింది.

"నేనేం అలాంటి దాన్ని కాను.'' అన్నది సీరియస్‌గా.

దాని వాలకం చూసి ఫక్కుమని నవ్వేశాను.

"ఓసి వుడుకుమోతా! ప్రతి ఆడపిల్లా నీలాగే ఆలోచిస్తుందే! ప్రతి కన్నెపిల్లా తన వైవాహిక జీవితం గురించి నీలాగే తీపితీపి కలలు కంటుందే!" అంటున్న నావేపు వింతగా చూసింది సరోజ.

అదేం గమనించనట్లుగా నా ధోరణిలో నేను చెప్పుకు పోసాగాను. "పెళ్ళి కాగానే కలలు కనే కాటుక కళ్ళతో, పసుపు రాసిన పచ్చటి పాదాలతో అత్తవారింట్లో అడుగు పెట్టిన ఆ ముగ్ధ భర్త వైపు ఆరాధనగా చూస్తుంది. బావగార్లను, మామగారిని చూసి భయభక్తులతో కళ్ళు వాల్చుకుని తొలగిపోతుంది. అత్తగారిని గౌరవిస్తుంది. తోడికోడళ్ళను, ఆడపడుచులను అభిమానిస్తుంది. తన యీడు వారయితే మనసు విప్పి చెప్పుకుని మరింత చేరువ కావాలని వాంఛిస్తుంది.

కొత్త వాతావరణానికి అలవాటు పడవలసిన ఆ యింటి కొత్త కోడల్ని అంతా సానుభూతితో అర్థం చేసుకుని చేయూత నివ్వాలి. అలవాట్లలోనూ, ఆచార వ్యవహారాలలోనూ తెలియని తనంలో భిన్నంగా ప్రవర్తించిందనుకో, ఆ విషయాల్ని ఆమెకు సున్నితంగా తెలియ చెప్పాలి. అయినవాళ్ళనందర్నీ వదులుకుని కొత్త వాళ్ళ మధ్య మనుగడ సాగించాలని వచ్చిన ఆ అమ్మాయి పట్ల అనురాగాభిమానాల్ని చూపిస్తే, ఆ అమ్మాయికి కూడా కన్నతల్లిని మరిపించే అత్తగారిపట్ల– ఆ కుటుంబ సభ్యులపట్ల పూజ్యభావం అనురాగం కలుగుతాయి. ఆ సంసారం తనది. అందులోని వ్యక్తులంతా తన్నభిమానిస్తారు. ఇంతకంటె ఏ ఆడదానికైనా జీవితంలో ఏం కావాలి? ఇంతకంటె గొప్పవరం వేరే ఏం కోరుకుంటుంది చెప్పు....? ఆ స్టేజి కొచ్చాక తన సంసారం కోసం ఏ విధమైన త్యాగమైనా చెయ్యడానికి వెనుకాడదా గృహిణి. తన చుట్టూ వున్నవారికి వెలుగుల్ని పంచి యిస్తూ, తనని తాను దహించి వేసుకునే కొవ్వొత్తి అవుతుందామె. అలా కాకుండా కోడలు కాపురానికి వచ్చిన క్షణం నుంచీ ఆమె నిలబడితే తప్పు, కూర్చుంటే తప్పు. చివరికి కన్నవారు వచ్చినా అత్తగారి ముందు తప్ప వాళ్ళతో మాట్లాడకూడదు. పుట్టింటివారికి వుత్తరాలు రాయకూడదు.

# భానుమతీ రామన్



ఇటీవల మద్రాసు స్టాన్లీ వైద్య కళాశాల ఆవరణలో - రాష్ట్ర వైద్య కళాశాలల మధ్య ఆటల పోటీలు (ఇంటర్ మెడికో స్పోర్ట్స్ ఫెస్టివల్) జరిగాయి. అందులో స్త్రీలకు జరిగిన షటిల్‌కాక్, టేబుల్ టెన్నిస్ - పోటీలలో పాల్గొని విశేషమైన సామర్థ్యం ప్రదర్శించి మూడు ఛాంపియన్ షిప్పులు సాధించి అందరి దృష్టినీ ఆకర్షించింది కుమారి భానుమతి రామన్.

మద్రాసు వైద్య కళాశాలలో ఎం.బి.బి.యస్. చివరి సం॥ చదువుతున్న కుమారి భానుమతి తండ్రిగారికి క్రికెట్ అంటే ఎంతో ఉత్సాహం. సదర్న్ రైల్వే స్పోర్ట్స్ అసోసియేషన్ అధ్యక్షులు ఆయన. తల్లి కూడా క్రీడాకారిణి కావడంతో భామమతికి చిన్నప్పటినుంచే ఆటలంటే ఆసక్తి ఏర్పడింది. తల్లిదండ్రులు అందించిన ప్రోత్సాహం వల్ల తన సామర్థ్యానికి మరింత మెరుగులు దిద్దుకోగల్గింది.

"మా నాన్నగారి ఉద్యోగరీత్యా గత ఐదేళ్ల ముందు వరకు మైసూరులోనూ ఆ తర్వాత బెంగళూరులోనూ విద్యాభ్యాసం చేశాను. ఎస్. ఎస్. ఎల్. సి - నిర్మలా కాన్వెంటులోనూ, బెంగళూరు మౌంట్ కార్మెల్ కళాశాలలో పి. యు. సి. చదివేప్పుడూ నేనే కర్ణాటక రాష్ట్ర-జూనియర్, సీనియర్ షటిల్‌కాక్ ఛాంపియన్‌ని. మా తండ్రిగారు మద్రాసుకు బదిలీ కావడంతో మద్రాసు వైద్య కళాశాలలో చేరాను. షటిల్ కాక్‌లో కూడా మరింత శ్రద్ధ కనబరుస్తూ అభ్యాసం చేయడం ప్రారంభించాను. హైదరాబాదు, కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, గౌహతి, గోరక్‌పూర్, లూధియానా, ఉదయపూర్ మొదలైన నగరాలలో జరిగిన ఆలిండియా ఇంటర్‌స్టేట్ పోటీలలో పాల్గొన్నాను. అఖిల భారత వనితా క్రీడోత్సవాల (ఆలిండియా విమెన్స్ స్పోర్ట్స్ ఫెస్టివల్)లో పాల్గొని వరుసగా రెండుసార్లు గెలుపొందాను. మూడోసారి గెలుపొంది 'హేట్రిక్' సాధించగలనన్న విశ్వాసం నాకు వుంది" అన్నారు ఆమె.

ఎం. బి. బి. యస్ పూర్తి కాగానే పై చదువులు చదివి పోస్టు గ్రాడ్యుయేట్ కావాలని కోరుకునే భానుమతి-షటిల్‌కాక్‌లోనే కాకుండా బాడ్మింటన్, టెన్నిస్ ఆటలలో కూడా శిక్షణ పొంది నేర్పు, సామర్థ్యం సంపాయించింది. కుట్టుపని, ఎంబ్రాయిడరీ అంటే కూడా ఇష్టం.

వింటున్నావా సరోజా! యీ రకంగా ఆ అమ్మాయిని హద్దుల్లో పెట్టి ఆమె లేత హృదయాన్ని సూటీ పోటీ మాటలతో చిత్రహింసల పాలు చేసి, అదే 'పెద్దరికానికి చిహ్నం' అని భావించే అత్తగారిపట్ల ఆ అమ్మాయికి వుండే గౌరవం రోజు రోజుకీ తగ్గిపోతుంది. గౌరవమూ - ప్రేమాభిమానాలూ యిచ్చి పుచ్చుకోవాల్సినవి. సరోజా – నా మాటలు విన్నావు కదూ! భవిష్యత్తులో రాబోయే మీ వదిన గురించిన నీ ఆలోచనలంతా ఆరోగ్యకరమైనవి కావే! నీ మనసులో ఇప్పుడే ఇలాంటి ఆలోచనలు వేళ్ళు పాతుకుంటున్నాయీ అంటే రేపు ఆ పూర్‌గర్ల్ నడిచిన ప్రతి అడుగులోనూ, మాట్లాడిన ప్రతి మాటలోనూ నీకు పెడర్థమే తోస్తూ వుంటుంది. కొత్తగా పెళ్ళయిన ఆ జంట సరదాగా బీచ్‌కి వెళ్ళినా, ఏకాంతం కోసం మూన్ లైట్ వాక్‌కి వెళ్ళినా అందులో నీకు తప్పే కనిపిస్తుంది. 'చూశావా అన్నయ్య నన్ను రమ్మని పిలిచాడు కాదు.' అని నీలో నువ్వు వాపోతావు. అది సహజం. ఎప్పుడూ నువ్వు లేకుండా ఎక్కడికీ వెళ్ళని అన్నయ్య వదినతో వెళ్ళాలనుకుంటున్నాడంటే ఆ సందర్భాన్ని నువ్వు ఎనలైజ్ చేసుకుని అర్థం చేసుకోవాలి. పెళ్ళయిన కొత్తల్లో దంపతులు ఏకాంతంగా వుండాలనీ, ఏవో స్వీట్ నథింగ్స్ చెప్పుకుంటూ ఒకరి ఒడిలో ఒకరు కరిగిపోవాలనీ కోరుకుంటూ వుంటారు. ఒకవేళ వాళ్ళు మర్యాదకి నిన్ను ఆహ్వానించినా నువ్వు వెళ్ళే సందర్భం కాదది. అన్నా వదినలకి కాస్త ఏకాంతం కల్పించాలనే ఇంగితం నీకుండాలి. అసలు నువ్వే వాళ్ళను ప్రోత్సహించి పంపించాలి. నువ్వు నీ అక్కయ్యపట్ల నడుచుకున్నట్లే వదినపట్ల కూడా ప్రవర్తించావంటే మీ వదిన 'మా ఆడపడుచు ఎంతమంచిది-! మా ఆయన కన్న మంచిది.' అని మురిసిపోతుంది."

"అబ్బపోదూ! ఏం ఉపన్యాసం యిచ్చావు?" దీర్ఘం తీస్తూ నవ్వింది సరోజ.

"నీ వాలకం చూస్తూంటే మీ అన్నయ్యా వదినలతో హనీమూన్‌కి కూడా తయారయేలా వున్నావ్." అన్నా నేనూ నవ్వుతూ.

"ఛ....పో....నువ్వింత నీతి బోధ చేసాక కూడానా....!" కిలకిల నవ్వుతూ నా బుగ్గ గిల్లింది సరోజ.

"చంపావే....! నీకేమొచ్చినా పట్టలేం...." అంటూ బుగ్గ తడుముకున్నాను.

"రేపు పెళ్ళయితే నువ్వూ కోరుకుంటావు. మా ఆయనతో కలిసి సినిమాకి వెడితే బాగుండును. బీచ్‌కి వెడితే బాగుండును....అని" అంటూ హాస్యమాడాను.

"వూ...." తెచ్చిపెట్టుకున్న చిరుకోపంతో సిగ్గుపడుతున్న సరోజ ఎంతో అందంగా కనిపించింది నా కళ్ళకి.

కొంచం ఆగి యిలా అన్నాను.

"చూడు సరూ....ఆడపిల్లకెప్పుడూ పుట్టింటి ఆశ వుంటుంది. కాదనను. కానీ నీ ఆశ తీర్చుకుందుక్కైి మీ అన్నయ్య ఆజన్మాంతం బ్రహ్మచారిగా వుంటే బాగుండుననే కోరిక మాత్రం మహాదారుణమైనదే....! మొన్న మీ అమ్మగారికొక సూచన చేసాను, 'ముందు సరోజ పెళ్ళయ్యాకే అబ్బాయి పెళ్ళి తలపెట్టకూడదా....?' అని."

"అమ్మ ఏమంది....?" కుతూహలంగా అంది సరోజ.

"వాడి వయస్సు మీరిపోతోంది. హోటలు భోజనం తినలేక నానా అవస్థా పడుతున్నాడు. సరోజకేం తొందర? యింకా చదువుకుంటోంది కదా!" అన్నారావిడ, కాని నా పుద్దేశం నీ పెళ్ళే ముందయితే మంచిదని. ఏదో మీకాస్త చేదోడు వాదోడుగా వుంటున్నాడు కదా! రేపు పెళ్ళయితే అతడికీ ఒక సంసారం ఏర్పడుతుంది. ఖర్చులు పెరుగుతాయి. ఈ కాలానికి తగ్గట్టు పిల్లలు కూడా పుడితే మరి ఖర్చులకేం లోటుండదు కదా! మనవి

నెల జాతాల మీద ఆధారపడ్డ సంసారాలు, పిల్లల పాలడబ్బాలు, మెడికల్ బిల్లులు, అనేక విధాలుగా పెరుగుతాయి ఖర్చులు. మరి అటువంటి పరిస్థితుల్లో పూర్వంలా మీకు డబ్బు పంపగలడా? పంపినా కొద్ది మొత్తం పంపగలడు కాని మునపట్లా మీ మీద ధారాళంగా ఖర్చు పెట్టలేడు కదా....కొంచం ఆలోచించుకుని మీ వదిన్ని కనికరించవే సరూ'' అంటూ పూర్తి చేసాను నా నీతి బోధను.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా వున్న తరువాత ''చక్కగా చెప్పావే రాజా....! ఏదో మా పెద్ద వాళ్ళు మాట్లాడుకునే మాటలు యంత్రావతుగా నా మనసులో రికార్డయిపోయాయంతే. నువ్వు చెప్పాక తెలిసింది నేనెంత హేయంగా ఆలోచిస్తున్నానో!'' అంది, సరోజ.

''నా మాటల ప్రభావం వల్ల నీలో కాస్తయినా మార్పు కలుగుతే ధన్యురాలిని.'' అన్నాను చిరునవ్వుతో.

ఆ తర్వాత - కొంత కాలానికి సరోజ అన్నయ్యకి పెళ్ళయింది. ఆ తర్వాత రెండేళ్ళకి సరోజ పెళ్ళయింది.

మరో మూడేళ్ళకు గాని మేం కలుసుకోలేక పోయాం, నేను వచ్చినప్పుడు సరోజ వుండక పోవడం, సరోజ వచ్చినప్పుడు నేను వుండక పోవడం.

దీర్ఘకాల వియోగానంతరం మొన్న దసరాల్లో యిద్దరం ఒకేసారి పుట్టిళ్ళకు రావడం తటస్థించింది.

నన్ను చూడగానే, ''ఎన్నాళ్ళకు చూసానే రాజా....!'' అంటూ పరుగున వచ్చి నన్ను వాటేసుకుంది సరోజ. ఇద్దరి కళ్ళల్లోనూ నీళ్ళు చిప్పిల్లాయి, ఇంత కాలానికి తిరిగి కలుసుకున్న మా ఆనందం ఏమని చెప్పను?

సరోజ వీపుమీద చేత్తో రాస్తూ ''సరూ....! బాగా చిక్కిపోయావు సుమా....!'' అన్నాను అనునయంగా.

శుష్కహాసం చేసి, ''నాకిప్పుడు ముగ్గురు పిల్లలు.'' అంది సరోజ.

''ఓ....అలాగా! చాలా సంతోషంగా వుందే! ముత్యాల్లా ముగ్గురన్నమాట. ఇక చాల్లెండి. స్టాప్ చేసేసారా....?''

''నాదేముందే! అంతా వాళ్ళిష్టం. నిమిత్త మాత్రంగా వుంటున్నానంతే.'' అంది సరోజ.

నిరాశా నిస్పృహలు మూర్తీ భవించినట్లున్న సరోజను చూస్తూంటే నా హృదయం ద్రవించి పోయింది.

''అదేమిటే! పిల్లల్ని కనడంలో కూడానా!'' అన్నా ఆశ్చర్యంగా.

''ఆ ప్రతి చిన్న విషయం దగ్గర్నుంచీ – నా అభిప్రాయమంటూ ఏం లేదు రాజా! ఆలోచన, నిర్ణయించడం అంతా వాళ్ళ యిష్టమే. వాళ్ళకి బుద్ధి పుడితే నాతో చెబుతారు లేకుంటే లేదు. ఖర్మం చాలక ఎప్పుడేనా 'యిలా చేస్తే బాగుంటుం దేమో' అంటే చాలు 'నీ సలహా ఎవరడిగారు? బోడి సలహాలు చెప్పకు,' అంటారు. బొత్తిగా బానిస బ్రతుకైపోయిందే రాజా! మా ఆయన ఎప్పుడేనా, 'అది చెప్పింది బాగానే వుందే అమ్మా! పోనీ అలా చేస్తేనో!' అనేసరికి మా అత్తగారు, ఆడపడుచు సాధింపులు మొదలుపెడతారు. వాళ్ళ అబ్బాయిని నేను వల్లో వేసుకుని కొంగుకి ముడేసుకున్నానుట. సంసారంచేసే లక్షణాలు నాలో కాస్తయినా లేవుట. అంటే వాళ్ళ వుద్దేశం నేను దుబరా మనిషినని. అది వాళ్ళ పరిభాష. కానీకి అర్థణాకి కక్కుర్తి పడలేను నేను. కూరగాయల వాళ్ళ దగ్గిర గాసగాస బేరాలు చెయ్యలేను. పిల్లల బట్టలు నా బట్టలు అన్నీ నేనే వుతుక్కుంటాను. అవసరమైతే ఆయన బట్టలూ వుతుకుతాను లాండ్రీకి పట్టుకు వెళ్ళి యిస్త్రీ చేయించుకుంటాను. ఇది పొదుపుగా వుండటం కాదా! కాని మా అత్తగారి వుద్దేశంలో కానీ అర్థణాలకూడా బేరాలాడితేనే పొదుపుగా వున్నట్లు లెక్క. 'చిన్న మొత్తాల్లో జాగ్రత్తలేనివాళ్ళు పెద్దమొత్తాల్లోనూ జాగ్రత్తపడలేరు.' అంటారు. చివరికి పిల్లల విషయంలో కూడా అంతేనే! వాళ్ళింట్లో మా ఆయనా, మా ఆడపడుచు యిద్దరే – అందుకని నేను కరువు తీరా యిల్లునిండేలా పిల్లల్ని కనిపెట్టాలిట.''

సరోజ చెప్పే తీరుకి నాకు నవ్వొచ్చింది. నాతో అదీ జత కలిపింది.

''ఇలా వుందేరాజా నా సంసారం! కాపురానికి వెళ్ళినప్పట్నించీ ప్రతి చిన్న విషయంలోనూ నన్ను వేలెత్తి చూపడానికే ప్రయత్నిస్తున్నారంటే నమ్ము. మా అత్తగారూ ఆడపడుచూ కలిసి మాది వుమ్మడి కుటుంబం, ఏ పని ఎలా చెయ్యాలో చెప్పక పోవడం, నాకు తోచినట్లు చేస్తే 'యిలా ఎందుకు చేశావు!' అంటూ చివాట్లు పెట్టడం. ఎప్పుడేనా నేను కాస్త ధైర్యం చేసి, 'ఎలా చెయ్యాలో మీరు చెప్పలేదత్తయ్యా! యిలా చెయ్యాలేమో నని చేశాను.' అన్నానో కొంప మునిగిపోయిందన్న మాటే: ''ఏం అనకపోయినా మీ అమ్మ మాటకి మాట అనడం మాత్రం బాగా నేర్పింది. నువ్వంటే నువ్వని ఎదిరించటమే! పెద్దవాళ్ళంటే కాస్తయినా భయమూ భక్తీ లేవు కదా! ఇదంతా నా ఖర్మ. నన్ను వీళ్ళమొహాన పడేసి అందరిచేతా మాటలు పడుతూ వుండు పిచ్చి పీనుగా! అని ఆయనదారి ఆయన చూసుకున్నారు.'' అంటూ సాగ తీసి యిక ఆ రోజు రోజల్లా సణుగుతూనే వుంటారు.''

''ఆవిడలా నిన్ను యిష్టం వచ్చినట్లు అంటూంటే నువ్వు ముద్దరాల్లా నోరు మూసుక్కూర్చుంటావా! తిరిగి రెండని తగిన సమాధానం చెప్పక'' అంటూ విసుక్కున్నాను సరోజ మీద.

''అయ్యా బాబోయ్....అలా చెబితే యింకేమన్నా వుందా....! కొంప మునిగిపోదూ....! వూరికేనే నానా మాటలూ అంటున్నారే....! ఏమన్నా అంటే యిక నన్ను బ్రతకనిస్తారా....! ఇప్పటిదాకా నోటి దగ్గరికి వచ్చిన మాటల్ని అతి కష్టం మీద నిగ్రహించుకు వస్తున్నాను. ఏమోలే... ఏదో ఒకనాడు ఆ రోజూ వస్తుందేమో....! భరించి....భరించి అగ్ని పర్వతంలా ఒక్కసారిగా బ్రద్దలైపోతానేమో ఎవరు చెప్పగలరు....?'' అంది సరోజ.

మా మధ్య కొన్ని నిముషాలు విషాదంగా గడిచాయి.

## సిగ్గు

వేలకు వేలు
కట్నం తీసుకొని
నా మెడకు
'ఉచ్చు' బిగిస్తున్న
మగవాడ్ని
పెళ్లాడుతున్నందుకు
నలుగురిలో
తలెత్తుకోలేక
తలవంచుకున్నానే కాని
సిగ్గుల మొగ్గనై కాదు!

—కె. వాసంతీ కిషన్‌శాస్త్రి

స్త్రీ విద్య విస్తృతం కావడంతో ఉద్యోగాలు చేసే వనితలు రోజు రోజుకూ ఎక్కువై పోతున్నారు. ఇలాంటి పరిస్థితిలో పెళ్ళయిన వెంటనే పిల్లలు కనాలంటే అది తమ వృత్తికి ఆటంకం కల్గిస్తుందని కొందరు వెనుకంజ వేస్తారు.



# తల్లి కావడానికి తగిన ప్రాయం

మరి కొందరు పెళ్ళయిన తర్వాత కొంతకాల మైనా ఎలాంటి బాదరబందీలేకుండా హాయిగా గడుపుదామన్న ఉబలాటం కొద్దీ సంతానోత్పత్తికి గడువు పొడిగిస్తారు.

ఆర్థికస్తోమత లేకపోవడంతో కాలప్రవాహానికి ఎదురీదలేక యౌవనమంతా అడవికాచిన వెన్నెలగా నిర్లిప్తంగా గడుపుతూ వయసు దాటినా కన్నె పిల్లలుగానే కుమిలిపోయేవారు ఇంకా కొందరు.

ఇలా కారణాలు కొన్ని అనివార్యాలే అయినప్పటికీ తల్లి కావలసిన ప్రాయం దాటి తల్లి కావడం ఆరోగ్యదృష్ట్యా మంచిది కాదు.

తల్లీ పిల్లల సంక్షేమంలో పౌష్టికాహారం, సామాన్య ఆరోగ్యం, చుట్టుపట్ల వాతావరణం, మొదలైనవాటితోపాటు గర్భధారణకు, సుఖప్రసవానికి, పాప ఆరోగ్యానికి—తల్లి వయసు కూడా ఎంతో ప్రాముఖ్యం వహిస్తుంది.

సాధారణంగా పదిహేనేళ్ళ నుంచి నలభై ఎనిమిది సంవత్సరాలవరకు పిల్లలకనే అవకాశం వుంది. అయితే ఎన్నేళ్ళ ప్రాయంలో ప్రసవం జరగడం మంచిది? అన్న విషయం మీద ఇటీవల ఒక పరిశోధన జరిగింది. ఈ పరిశీలనవల్ల ఎన్నో నిజాలు తెలియవచ్చాయి.

గర్భస్రావాలు, ప్రసవకాల ఇబ్బందులు, అపాయాలు - ఇరవైయేళ్ళకు లోబడి - ముప్పైయేళ్ళకు పైబడినవారిలోనే ఎక్కువగా కనిపించాయి.

ముప్పైయేళ్ళ తర్వాత గర్భం ధరించినవారికే గర్భస్రావాలు, అరకొర ప్రసవాలు చాలా మందికి సిజేరియన్ ఆపరేషన్ ద్వారా ప్రసవాలు జరిగాయి.

వయసు మీరినవారి జననేంద్రియాలు బలహీనంగా చలనరహితంగా వుండడం వల్ల పిండం సక్రమంగా అభివృద్ధి చెందడం సాధ్యం కాదు. పర్యవసానంగా వికారమైన పిల్లలు చాలా వరకు వయోధికులైన తల్లులకే పుడుతూ వుంటారు. ముప్పైఅయిదేళ్ళకు పైబడి గర్భం ధరించే స్త్రీలకు రక్తం చెడడం, దీర్ఘ కాల వాంతులు, మూత్రాశయపు ఇబ్బందులు, ప్రసవసమయంలో ఎక్కువ రక్తస్రావం మొదలైనవి ఏర్పడే ప్రమాదాలు ఎక్కువ. అందువల్ల ప్రిమెచ్యూర్ డెలివరీ జరుగుతుంది.

నిర్ణీతకాలానికన్నా ముందుగా పుట్టే శిశువుల శారీరక, మానసిక ఆరోగ్యం, మనుగడ – దినదిన గండంగా వుండడంతో వారి భవిష్యత్తు ఆశాజనకంగా వుండదు.

పాతికేళ్ళ నుంచి ఇరవైతొమ్మిదేళ్ళ లోపు తల్లులలో మిగతావారికన్నా తక్కువ గర్భస్రావాలు కనిపించాయి. ప్రసవకాల ఇబ్బందులూ చాలా తక్కువే. అందరికీ సుఖప్రసవాలే కావడంతో ఈ ప్రాయంలో పుట్టే పిల్లలకు ప్రసవకాల గాయాలు, రోగాలు కూడా తక్కువే. ప్రతి పాప కూడా ఎంతో ఆరోగ్యంగా కనబడ్డారు.

అందువల్ల —

ఇరవైయేళ్ళ నుంచి ముప్పై సంవత్సరాల లోపల సంతానవతులు కావడమే మంచిది. పాతికేళ్ళ నుంచి ముప్పైయేళ్ళ లోపు కాలమే తల్లులు కావడానికి శ్రేయస్కరమైన ప్రాయం. తొలి ప్రసవం ఈ ప్రాయంలో వుండేట్టు చూసుకోడం - ఆరోగ్యకరం; అవసరం కూడా. —డాక్టర్

"కొన్నేళ్ళక్రితం ఒక రోజున నువ్వూ నేనూ మాట్లాడుకున్నాం జ్ఞాపకం వుందా సరోజా...." అంటూ ప్రశ్నించాను మెల్లగా.

"ఎందుకు జ్ఞాపకం వుండదు....? ఆ రోజు నేను నా జీవితంలో మరచిపోలేనే రాజా....! నువ్వానాడు నాకు జ్ఞానోదయం కలిగించావు కనుక సరిపోయిందికాని లేకుంటే నేను కూడా మా ఆడపడుచులాగే ప్రవర్తించి వుండేదాన్ని, మా అమ్మ వదిన్ని ఏమన్నా అన్నా నేను మా వదిన పక్షమే వుంటాను. మా వదిన నన్నెంతో అభిమానిస్తుందే రాజా....! మామధ్య అరమరికలులేవు. నేనంటే ఆడపడుచు – అర్ధమొగుడు అన్నంత చనువుగా గౌరవంగా వుంటుంది మా వదిన." అంటున్న సరోజను చూసి కిలకిలా నవ్వేను.

"చాలమ్మా తల్లీ ...చాలు, వదినమ్మ మీద తెగ వాలకపోసేస్తున్నావు....ప్రేమ...." మనసులో నాకెంతో ఆనందంగా వుంది. ఆనాటి నా మందలింపుతో సరోజకి ఆమె వదిన మీద వుండే అపోహ వృద్ధిపొంది ద్వేషంగా పరిణమించకుండా ఆదిలోనే నశించిపోయిందంటే.

మా యిద్దరి మధ్యా కాసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది-కాలం.

రెండు మూడు నిముషాల తరువాత చిన్నగా నిట్టూర్చి యిలా అంది సరోజ.

"నీవల్ల నాలో చాలా మార్పు వచ్చిందే రాజా....! కాని....ఏ భావాలను నీచమైనవిగా గ్రహించి నా మనసులోంచి కష్టం మీద తుడిచి వేసుకున్నానో ఆ విషపుభావాలే నా అత్తవారింట్లో ప్రజ్వరిల్లి అనుక్షణం నన్ను దహించివేస్తున్నాయి. క్షణక్షణం చిత్రహింసననుభవిస్తూ మనశ్శాంతి లేక అల్లాడిపోతున్నానే రాజా....! నువ్వు నాకిచ్చిన సలహాలాంటిదే ఎవరైనా మా అత్తగారికీ, మా ఆడపడుచుకీ యిస్తే బాగుండును. మా అత్తగారి మాటెలా వున్నా కనీసం మా ఆడపడుచయినా నాతో కాస్త ఆదరంగా మాట్లాడితే పొంగిపోయే దాన్ని. నా హృదయానికి రవంత పూరటలభించేది." అంది సరోజ గద్గద స్వరంతో!

సరోజ కన్నీటిని పమిటచెంగుతో వొత్తుతూ, "బాధపడకు - సరూ....! మనకు సాధ్యమైన సమస్యల్ని పరిష్కరించగలిగేది ఒక్క కాలమే! ఈ సమస్య నీ ఒక్కదానిదే కాదు. ఇది యింటింటి సమస్య." అన్నాను వోదార్పుగా. □

# ఒక ప్రేమలేఖకు జవాబు



ప్రియమైన రాజేష్‌గారికి,

నమస్కారం.

నేనేనండి.... మీ కలలో తరచూ కనిపిస్తూ మిమ్మల్ని కలవరపెడతానన్నారే.... ఆ మైథిలిని-రాస్తున్నాను.

నిన్న కాలేజి ముగిసిన తర్వాత ఇంటికి వస్తూ మీరు నా వైపు అదోలా చూస్తూ ఎదురు బెదురుగా దగ్గరికి వచ్చి "మైథిలీ.... నన్ను అపార్థం చేసుకోకుండా దీన్ని తీసుకెళ్ళి విప్పి చూడండి" అన్నారు. మీ చేతిలో ఆరెంజ్‌కలర్ పై అట్టతో ఒక పుస్తకం కనబడింది. నేను ఒక్క క్షణం తటపటాయించిన మాట నిజమే. ఆ తర్వాత మీపై గల గౌరవం, విశ్వాసం వల్ల దాన్ని వెంటనే తీసుకున్నాను. "థాంక్స్" అంటూ మీరు సంతోషంగా వెళ్ళిపోయారు.

దారి పొడవునా, ఆ పుస్తకంలో ఏం వుంటుందో అన్న ఆలోచనలతోనే ఇల్లు చేరుకున్నాను. ఇంటి పనులు పూర్తి చేసిన తర్వాత దాన్ని తీసి చూదామని నా గదిలోకి వెళ్ళి ఎర్రదారంతో అడ్డదిడ్డంగా కట్టబడిన ఆ పుస్తకం తెరిచేలోపల "మైథిలీ...." అన్న అమ్మ పిలుపు విని వులిక్కిపడ్డాను. అలాగే దాన్ని డ్రాయర్లోపడేసి వంటగది వైపు పరుగెత్తాను.

అమ్మ బజారుకెళ్ళొస్తానని బయటికి వెళ్ళింది. ఎలాగూ నాన్నగారు ఊళ్ళో లేరు. నేను నెమ్మదిగా వెళ్ళి ఆ పుస్తకం తెరచి చూశాను. అందులో అందమైన కవర్ కనబడింది. కవర్ తెరిచాను. ఎందుకోమరి. నా చేతులు వణకసాగాయి. కవర్ విప్పాను. లోపల ఒక కాగితం వుంది. దాని మీద "నా కంటిపాప మైథిలికి నా కానుక" అన్న మాటలతోపాటు ఒక మంచి చిత్రం కూడా కనబడింది (మీరే గీశారా చిత్రం! చాలా బావుంది!)

అంతలోనే అసలు విషయం నాకు కొంత వరకు అర్థమైపోయింది. అయినా ఇన్నాళ్ళూ బాగానే వున్నారుగదా? ఉన్నట్టుండి ఇంతలో ఏమయిందా.... అని తెలుసుకునే ఉత్సాహంతో ఉత్తరం చదవడానికి ఉపక్రమించాను. లేఖను కవితలోనే రాశారే! దాన్ని సాంతం చదివి ముగించాక నా మీద మీరు పెంచుకున్న ప్రేమను నేను బాగా అర్థం చేసుకునే స్థితికి వచ్చాను. అందువల్ల ఆ విషయం మీద నా అభిప్రాయాలను తేటతెల్లం చేయడానికే ఈ ఉత్తరం రాస్తున్నాను.

మనమిద్దరమూ ఒకే కాలేజీలో చదువుకుంటున్నాము. పక్కపక్క వాటాల్లోనే వుంటున్నాము. అంతమాత్రాన నేను మిమ్మల్ని ప్రేమించాలని చట్టమా ఏం? మన ఈడువారు చాలామంది ప్రేమించుకుంటారు. నిజమే. అయితే అదంతా నిజమైన ప్రేమ కాదు. అవన్నీ 'శారీరకవాంఛ'ను తీర్చుకోడానికి విజృంభించే కోర్కెల సంపూర్ణ స్వరూపాలు.

మన ప్రాయంలో ఇలాంటి భావాలు కల్గడం సహజమే. అయితే మనమే మన మనసులకు కళ్ళెంవేసి అదుపులో వుంచుకోవాలి. పైగా ప్రేమించడానికి కావలసిన మనో పరిపక్వత మన ప్రాయంవారికి వుండనే వుండదు-అన్నది నా దృఢ విశ్వాసం.

ఈ ప్రాయంలో ఏర్పడే ఈ ప్రేమ కొమ్మ కొమ్మకూ, చెట్టు చెటుకూ దాటే కోతి లాంటిది. ఇవాళ మీ చేత 'హృదయ రాణి' అని కీర్తించబడే ఇదే మైథిలి, రేపు దీనికన్నా (నాకన్నా) అందమైన మరో సీత తటస్థపడితే చాలు; ఉన్నచోటు తెలియకుండా పోతుంది. ఇదే ఈ ప్రాయంలో ఏర్పడే ప్రేమకు వ్యాకరణం; దీని లక్షణం! ఎండమావులతో సమానమైన ఈ ప్రేమను నిజమని నమ్మి మోసపోయి నశించిన (ఆడ) లేళ్ళ సంఖ్యలో మరో అంకెను పెంచడానికి నాకు ఇష్టంలేదు.

నన్ను తొలిసారిగా చూసినప్పుడే నాపై మీకు అభిమానం మొగ్గ తొడిగి రోజురోజుకు రేకులు విచ్చుకుంటూ ఇవాళ ప్రేమగా వికసించినట్లు రాశారు. అభిమానం ముదిరితే ప్రేమ అవుతుందో లేదో నాకు తెలియ... అయితే రెండు బలహీనమైన హృదయాల కలయికలోనే ప్రేమ జన్మిస్తుందంటారు అనుభవజ్ఞులు. ఇక్కడ మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. ఒకవేళ మీ హృదయం బలహీనం కావచ్చు. కాని నా హృదయం

మాత్రం చాలా దృఢమైనది. ఇలాంటి ఎండమావుల సంబంధాలకు కల్లో కూడా చోటివ్వదు. "పద్నాలుగేళ్ళనుంచి పదహారేళ్ళ వయసు వరకు స్త్రీ హృదయం తెరచిన ఇల్లులాంటిది. ఎవరైనా ప్రవేశించవచ్చు" అని కొందరంటారు. కాని వివేకవతియైన యువతిగా దీన్ని నేను ఒప్పుకోలేను.

ఒక రోజు నేను కాలేజికి వెళ్ళినప్పుడు నా జడ నుంచి విరిమల్లె పువ్వొకటి జారి పడిందనీ; దాన్ని మీరు జాగ్రత్తగా తీసి (ఇంకా) పదిలపరచి వున్నారని మీ లేఖ వల్ల తెలిసింది. ఈ ప్రాయంలో ఏర్పడే ప్రేమ ఇలాంటి పిచ్చిపిచ్చి పనుల్ని ఎన్నైనా చేయిస్తుందని ఎప్పుడో విన్నాను. మీకు ఇంకో సంగతి కూడా చెప్పాలనుంది. అందం కోసమో అభిమానం కొద్దో ఆత్మ కోసమో ఈ ప్రేమ అంకురించదు. అంతశ్చేతన అనుభూతి కోసమే ఇది తలెత్తుతుంది. మీరు నా మనసును మాత్రం ప్రేమిస్తున్నట్టు రాశారు. అహా! మగాళ్ళు చాలా మంది ఇలాగే రాస్తారని ఎక్కడో చదివినట్టు జ్ఞాపకం. శరీరం మీద ఏర్పడే మోహంతోనే వాళ్ళలా అర్థం లేకుండా వాగుతారని నాకు బాగా తెలుసు.

సుదీర్ఘమైన ఉత్తరం రాసి మీ ఓర్పును బాగా పరీక్షించాను. అయినా ఒకటి తెలుసుకోండి. ప్రపంచంలో ప్రతి స్త్రీ 'హృదయ మందిరం' ఒక్కరి కోసమే దేవుని చేత సృష్టింపబడుతుంది. నన్ను కన్నవాళ్ళే నా హృదయ కవాటాలు తెరిచి ఓ సుముహూర్తం నిర్ణయిస్తారు. అందాక నా హృదయ కవాటాలు మూయబడే వుంటాయి.

నా దగ్గిర నుంచి తుపాను, లేదా మలయ మారుతం ఎదురుచూసి వుంటారు. కాని ఇలాంటి ఉత్తరం వస్తుందని మీరు కల్లో కూడా ఊహించి వుండరు. అయినా మీ తెగువను అభినందిస్తున్నాను. మీరు మంచివారన్న ఒక్క కారణంవల్లే మీకీ ఉత్తరం రాస్తున్నాను.

ఇలా ఉత్తరం రాయడం ఇదే మొదటి సారి అన్నారు. ఇదే చివరిసారి కూడా కావాలన్నది నా మనఃపూర్వకమైన కాంక్ష! అంచేత దీన్నొక ఓటమిగా తీసుకోకుండా మీ దృష్టిని చదువుపై కేంద్రీకరించండి. చదువులోనూ, జీవితంలోనూ మీరు విజయం సాధించాలని మనసారా దేవుని ప్రార్థిస్తున్నాను.

పి. ఎస్: దీనితో జతపరచిన కవర్లో మీరు పంపిన వుంగరం వుంది. ప్రేమ కానుకగా దానిని స్వీకరించమని రాశారు. మీ అభిమానానికి కృతజ్ఞతలు చెప్పుకుంటూ మీ ప్రేమ అంగీకరించలేనందుకు విచారిస్తూ సెలవు తీసుకుంటున్నందుకు క్షమించండి. నమస్తే.

—మైథిలి

వై. సుజాత

గత సంవత్సరం రాజమండ్రి కళాదర్బార్ వారు నిర్వహించిన అఖిలభారతస్థాయి నాట్య పోటీలలో 'నాట్యబాల' బిరుదు కుమారి యలమర్తి సుజాతకి దక్కింది. ఆ పోటీలలో ఆమె సీనియర్ విభాగంలో కూచిపూడి, భరతనాట్యం రెండింటిలోనూ - ప్రథమ బహుమతి పొందడం చెప్పుకోదగ్గ విశేషం.

**1969**లో ప్రముఖ నాట్యాచార్యులు రామచంద్రన్ వద్ద నాట్య శిక్షణ ప్రారంభించిన సుజాత శ్రీ నిడమర్తి సత్యనారాయణ దగ్గిర తన నాట్యానికి మెరుగులు దిద్దుకుంది. ఇప్పటికి వివిధ నగరాలలో మూడుకు పైగా నాట్య ప్రదర్శనలు యిచ్చి, గతంలో కళాదర్బార్ నిర్వహించిన జూనియర్స్ నాట్య పోటీలలో వరుసగా మూడు సంవత్సరాలు ప్రథమ బహుమతి పొంది నటరాజ రామకృష్ణ బహుమతి, రోలింగ్ షీల్డ్‌నూ అందుకున్నది. హైద్రాబాదులోనూ తదితర ప్రాంతాలలోనూ జరిగిన నాట్య పోటీలలో ఆమెకు ఇంకా అనేక బహుమతులు లభించాయి.

కేవలం నాట్యంలోనే కాక చిత్ర లేఖనంలోనూ, వీణావాద్యంలోనూ కూడా ఆమెకు ప్రవేశం వుంది. వాటిల్లోనూ బహుమతులూ పొందింది. 'నాట్య ప్రధానాంశం గల చక్కటి చిత్రంలో నటించాలని వుంది' అంటూ తన అభిలాషని వ్యక్తం చేసింది సుజాత.





చెవిలో గులిమి చేరి చెవిపోటుగా వున్నప్పుడు అవనూనెలో రెండు వెల్లుల్లిపాయలు చితకకొట్టి వేసి మరిగించి, గోరు వెచ్చగా వున్నప్పుడు రెండు చుక్కలు చొప్పున మూడు పూటలు వేయండి. గులిమి వచ్చేస్తుంది.

—సుసర్ల జయారావు



# శిరోజాలంకరణ



ఈ రోజుల్లో ఆధునికంగా వుండాలనీ, అందంగా, ఆకర్షణీయంగా కనబడాలనీ యువతులలో చాలా మంది ఉవ్విళ్లూరుతున్నారు. అందువల్లనే రోజు రోజుకీ అలంకరణలలోనూ అందచందాలలోనూ కొత్త కొత్త ఫ్యాషన్లు వస్తున్నాయి. ఈ రోజున వున్న ఫ్యాషన్లు రేపు వుండడం లేదు.

అంతమాత్రం చేత మన పూర్వీకులు అనుసరించిన సౌందర్య విధానాలను తీసి పారవేయలేము. ఇప్పటి వ్యానిషింగ్ క్రీములు, స్నోలు తదితర అలంకరణ సామగ్రి ఆ రోజుల్లో లేకపోయినా వారు తమ శరీర సౌందర్యం కోసం ఎన్నో మూలికలను మరెన్నో ప్రకృతి సాధనాలను ఉపయోగించేవారు. అందాల రాశిగా అభివర్ణింపబడిన క్లియోపాత్రా తన అందచందాలను పరిరక్షించుకోవడానికి గాడిద పాలతో స్నానం చేసేదట.

''నిజం చెప్పాలంటే ఈనాడు మనం ఉపయోగిస్తున్న సౌందర్య విధానాలు కొన్ని ఆనాటివే. కొంత ఆధునిక రూపం సంతరించుకుని పునరావృతం అవుతున్నాయి. మా 'కుందవి' నే తీసుకోండి. ఇక్కడ మేము ప్రాచీన, నవీన విధానాలను రెంటినీ సమంగానే అనుసరిస్తున్నాము'' అన్నారు మద్రాసులోని హోటల్ చోళా - షెరాటన్‌లో 'కుందవి' బ్యూటీ క్లినిక్ నిర్వాహకురాలు శ్రీమతి శివభాగ్యం.

శివభాగ్యం బొంబాయిలోని చైనీస్ బ్యూటీ పార్లర్‌లో సంవత్సరంపాటు శిక్షణ పొందారు. అక్కడే ఆమె కాస్మటాలజీలో డిప్లొమా పొందారు. 1970 లో మద్రాసు వచ్చి 'ఫిగరెట్' బ్యూటీ క్లినిక్‌లో చేరారు. 1975 లో 'కుందవి' ప్రారంభించినప్పటి నుంచి దాని నిర్వహణా బాధ్యతను చేపట్టారు.

''చోళ రాకుమారి కుందవి వనమూలికలతో తన అందచందాలను ఇనుమడింప జేసుకుందట. అందువల్లనే మా బ్యూటీ క్లినిక్‌కి 'కుందవి' అని పేరు పెట్టాము. సినిమా తారలు, ఉద్యోగినులు, విద్యార్థినులు యిలా పదహారేళ్ల నుంచి అరవైఏళ్ల వరకూ గల రకరకాల స్త్రీలు మా బ్యూటీ పార్లర్‌కు వస్తూ వుంటారు. శిరోజాలంకరణ, ముఖ సౌందర్యం, చర్మ సౌందర్యం మొదలైన వాటికే ఎక్కువమంది వస్తూ వుంటారు.

''సాధారణంగా మనం తలకు షాంపూ వేసుకుని నూనె రాసుకుంటే చాలని అనుకుంటాం. కాని కేశ సంరక్షణకు అది మాత్రం చాలదు. అట్లాగే తలలో చుండ్రు ఏర్పడడం కూడా ఒక వ్యాధి క్రిందే లెక్క. ఇందువల్ల శిరోజాలు ఊడిపోతాయి కూడా. ఇలాంటి వాటిని మేము 'కుందవి'లో నయం చెయ్యగలము. మేము ఉపయోగించే 'హెన్నా ట్రీట్‌మెంట్' జుట్టు ఊడిపోవడం ఆపి ఒత్తుగా ఎదగడానికి దోహదం చేస్తుంది. అసలు శిరోజాలంకరణలో ఎన్నోరకాలు

వున్నప్పటికీ నాలుగైదు హైర్‌స్టయిల్స్ మీదనే ఎక్కువమంది మోజు చూపుతున్నారు'' అన్నారు శ్రీమతి శివభాగ్యం.

'కుందవి'లో ప్రాచీన భారతీయ పద్ధతిలో వేసే సిగ అలంకారాన్ని, అక్కడి ఉద్యోగినులు-సిగ అలంకారం చేస్తున్న జేనెట్ మింట్, అలంకరించుకుంటున్న అపర్ణ శ్రీనివాస్ 'వనిత' పాఠకులకు తెలియజెబుతున్నారు. అయితే ఈ సిగ అలంకారం పొడవైన జుట్టుగల స్త్రీలకు బాగా కుదురుతుందని వారు అంటున్నారు.

సిగ అలంకరించుకోవలసిన విధానం: ముందుగా జుట్టు బాగా దువ్వుకుని రబ్బర్











బ్యాండ్‌లో దూర్చి పోనీటెయిల్‌లా వేసుకోవాలి. (చిత్రం-1)

ఆ తరువాత జుట్టును రెండు పాయలుగా విడదీసి ఒక పాయ కుడివైపుకి తీసి చుట్టుకుని తల వెనకవైపు పోనిచ్చి పిన్నులు గుచ్చుకోవాలి. (చిత్రం-2)

ఇప్పుడు మరోవైపున వున్న శిరోజాలను కింద నుంచి రెండు అంగుళాల చుట్టు కొలతలో చుట్టుకుంటూ వచ్చి (చిత్రం-3) ఇంతకు ముందు వేసి వుంచిన సిగ కింద వుంచి బన్ను దూర్చి (చిత్రం-4) ఆ పైన స్ప్రే చేసుకుంటే చక్కగానూ, చూడ ముచ్చటగానూ వుంటుంది. □





# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| బ భ | ப | ಬ ಭ | ബ ഭ | ब भ | બ ભ | ବ ଭ |
| బా భా | பா | ಬಾ ಭಾ | ബാ ഭാ | बा भा | બા ભા | ବା ଭା |
| బి భి | பி | ಬಿ ಭಿ | ബി ഭി | बि भि | બિ ભિ | ବି ଭି |
| బీ భీ | பீ | ಬೀ ಭೀ | ബീ ഭീ | बी भी | બી ભી | ବୀ ଭୀ |
| బు భు | பு | ಬು ಭು | ബു ഭു | बु भु | બુ ભુ | ବୁ ଭୁ |
| బూ భూ | பூ | ಬೂ ಭೂ | ബൂ ഭൂ | बू भू | બૂ ભૂ | ବୂ ଭୂ |
| బృ భృ | — | ಬೃ ಭೃ | — ഭൃ | बृ भृ | બૃ ભૃ | ବୃ ଭୃ |
| బౄ భౄ | — | — — | — — | — — | — — | — — |
| బె భె | பெ | ಬೆ ಭೆ | ബെ ഭെ | — — | — — | — — |
| బే భే | பே | ಬೇ ಭೇ | ബേ ഭേ | बे भे | બે ભે | ବେ ଭେ |
| బై భై | பை | ಬೈ ಭೈ | ബൈ ഭൈ | बै भै | બૈ ભૈ | ବୈ ଭୈ |
| బొ భొ | பொ | ಬೊ ಭೊ | ബൊ ഭൊ | — — | — — | — — |
| బో భో | போ | ಬೋ ಭೋ | ബോ ഭോ | बो भो | બો ભો | ବୋ ଭୋ |
| బౌ భౌ | பௌ | ಬೌ ಭೌ | ബൌ ഭൌ | बौ भौ | બૌ ભૌ | ବୌ ଭୌ |
| బం భం | — | ಬಂ ಭಂ | ബം ഭം | बं भं | બં ભં | ବଂ ଭଂ |
| బః భః | — | ಬಃ ಭಃ | ബഃ ഭഃ | बः भः | બઃ ભઃ | ବଃ ଭଃ |

తమిళంలో మన వ, బ లకు—ఒకే అక్షరం [ப] వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# రెండు రకాల బ్యాగులు

ఇక్కడ వర్ణ చిత్రాల్లో కనిపిస్తున్న రెండు రంగుల 'బ్యాగ్'లను ఎలా తయారు చేయవచ్చో వివరిస్తున్నాము.

## బ్లాక్ బ్యాగ్

కావలసిన వస్తువులు : 1 మీటరు నల్లరంగు గుడ్డ (హాండ్ లూమ్ గానీ కేస్మెంట్ గానీ), 1 మీటరు పలుచటి గుడ్డ, (లైనింగ్ కోసం), ½ మీటరు కాన్వాసు గుడ్డ, గులాబిరంగు, పచ్చ రంగులలో ఫెల్టు గుడ్డ ముక్కలు, ఆకుపచ్చదారం, పలుపుదారం, తెల్లదారం.

చేయవలసిన విధానం : వర్ణచిత్రంలో చూపినట్లుగా నల్లరంగు గుడ్డ, లైనింగ్ గుడ్డ, కాన్వాసు కత్తిరించాలి. బ్యాగ్‌కి కుట్టబోయే బెల్టుకి హాండ్

[72 వ పేజీ చూడండి]





"దిక్కు లేనివాణ్ణి బాబూ...ధర్మం చెయ్యండి.."

ఈమాట మనం పదేపదే వినేదే. వీధుల్లో, బస్ స్టాపుల్లో, రద్దీ వున్న ప్రతిచోటా ప్రతిధ్వనించే వేదనాస్వరం ఇది! ఇది మనదేశానికి మాత్రమే పరిమితం కాదు. వివిధ దేశాలలో మానవ జాతిని జడిపిస్తున్న భయానక స్వరం ఇది!

కడుపుకు తిండి, కట్టుకోడానికి బట్ట, తలదాచుకోడానికి ఇల్లూ లేకుండా నా అన్న వాళ్ళు కరువై ప్రేమానురాగాలు అంటే ఏమో తెలియకుండా వీధులంట తిరుగుతూ, దొరికింది తింటూ ప్లాట్‌ఫారమే పడకగదిగా, చెట్టు నీడే మిద్దె మేడగా బ్రతుకులు వెళ్లబుచ్చే అభాగ్యజీవులు ప్రపంచం పలు దేశాలలోనూ వున్నారు!



# బాలల స్వర్గం 3

వీరి సమస్యను పరిష్కరించడానికి ప్రతి ప్రభుత్వమూ ప్రయత్నిస్తూనే వుంది. పథకాలు రూపొందిస్తూనే వుంది. అయితే పరిష్కారం మాత్రం ఇంకా ఎండమావిగానే మిగిలిపోతోంది.

శక్తివంతమైన పౌరులుగా రూపొందాలంటే పసిప్రాయం నుంచే వారికి మంచి తిండి, బట్ట, చదువుసంధ్యలతోపాటు పెద్దల ఆదరాభిమానాలు ఎంతైనా అవసరం. అయితే వీటిలో ఒక్కదానికి కూడా నోచుకోని దైన్యస్థితిలో ఎందరో బాలబాలికలు గాలిలోని దీపాల్లా అల్లాడిపోతున్నారు. ఈ పరిస్థితిని చక్కబెట్టడం ఎలా అని చాలామంది తంటాలు పడుతున్నారు. ఐతే 'అనాథలు, దిక్కులేని వారు అన్న సమస్యే మాకు ఇవాళ లేదు' అంటున్నారు సోవియట్ ప్రజలు.

నిజమే! సోవియట్ రష్యాలో భిక్షమెత్తే పిల్లల్ని....కాదు కాదు పెద్దల్ని కూడా చూడలేము.

ఇలాంటి ఆరోగ్యకరమైన స్థితి ఏర్పడడానికి వారు చేసిన కృషి ఎంతైనా ప్రశంసించతగ్గది. అరవైయేళ్ళ నాటి వారి దేశస్థితిని కొంచెం తిరిగి చూసినట్లయితే ఈ విషయంలో సోవియట్ ప్రజలూ, ప్రభుత్వమూ చేసిన కృషి, పడినపాట్లూ అర్థమవుతాయి.

1917వ సం॥ రష్యాలో సోషలిస్టు విప్లవం జరిగింది. ఈ విప్లవ సమయంలో దేశం స్థితిగతులు చాలా అధ్వాన్నంగా వుండేవి. దీనికి తోడు ప్రథమ ప్రపంచసంగ్రామం వచ్చిపడింది. దాంతో ప్రజాజీవితం బాగా దెబ్బతిని అస్తవ్యస్తంగా తయారయింది. ఎటుచూసినా ఆకలి, బాధలు-కరువు కాటకం. ఈ క్లిష్టస్థితిలో తల్లిదండ్రులను పోగొట్టుకున్న నలభైఅయిదు లక్షల బాలబాలికలు ఇల్లూ వాకిలి లేకుండా వీధినపడ్డారు. అడిగే దిక్కూ-మొక్కూ లేకపోవడంతో దురలవాట్లకు లోనుకాసాగారు. వారికి సమాజం మీద ఒక విధమైన ద్వేషం బయలుదేరింది.



అలాంటప్పుడు సోవియట్ ప్రభుత్వం-ఆ పని బాలల సంక్షేమానికి పాటుపడడం తన ప్రథమ కర్తవ్యంగా గుర్తించింది. దేశం మొత్తం మీద వేలకొలది అనాథ శరణాలయాలు నిర్మించింది. అనాథ బాలల ఉద్ధరణకు అనేక చట్టాలు చేసింది. ప్రత్యేకంగా ఒక కమిటీని ఏర్పాటు చేసింది. ఈ విషయంలో దేశ ప్రజల సహాయ సహకారాలు కోరి ఈ కమిటీ విన్నపం జారీచేసింది.

అప్పుడప్పుడు "అనాథ బాలల వారాలు" ఏర్పాటు చేయబడ్డాయి. ఈ విశేషసమయాలలో — ప్రజలు తమ కంటబడే అనాథ బాలలను ఇక్కడ చేర్చుతారు. సవతితల్లి పోరు, లేదా ఇతరుల బాధలకు గురయ్యే బాలబాలికల గురించి అధికారులకు తెలియజేస్తారు. దొంగతనం లాంటి నేరాలను చేసిన పిల్లలను కూడా ప్రజలు అధికారులకు అప్పగించేవారు.





ఇలాంటివారిని దండించి చెరసాలకు పంపే బదులుగా అనాథ శరణాలయాలకు పంపేవారు. అక్కడ వైద్యులు, ఉపాధ్యాయులు, మనస్తత్వ వేత్తలు—వచ్చే బాలబాలికలను పరిశీలించి వారికి తగిన అనాథ శరణాలయాలకు పంపేవారు. అయితే వీటిని అనాధ శరణాలయాలు అని అనరు. ఎలాంటి వారి జీవిత నిఘంటువులోనూ 'అనాథ' అన్న పదం లేకుండా చేయాలన్నది సోవియట్ ప్రభుత్వ ఆశయం.

ఇక్కడ పిల్లలకు వుండడానికి వసతైన గదులు, ఆరోగ్యవంతమైన ఆహారం, చదువు, ఆటపాటలూ అన్నీ సమకూర్చబడుతాయి. పిల్లల వయసు, ఉత్సాహం, శక్తిసామర్థ్యాలు మొదలైనవాటిని అనుసరించి చదువు నేర్పబడుతుంది. చదువు ముగియగానే ఉద్యోగం కాచుకుని వుంటుంది. ఆ తర్వాత తనకంటూ ఉద్యోగం-ఆర్జన వుండడంతో యువతీ యువకులందరూ ఆత్మవిశ్వాసంతో ముందడుగు వేయడం వల్ల సమాజం భవిష్యత్తు బంగారుబాట అవుతోంది!

దేశంలోని అనేకమంది అనాథ బాలబాలికలకు ఈ గృహాలు ఆశ్రయం ఇచ్చాయి. రోజుకు రోజు వీటి సంఖ్య పెరిగిపోసాగాయి. 1917 సం॥ లో ముప్పైవేల గృహాలు మాత్రమే వుండేవి. ఇవి 1919కి లక్షఇరవైఅయిదువేలు అయినాయి. 1922 సం॥ నాటికి ఐదులక్షలా నలభై వేల గృహాలుగా వ్యాపించి దేశంలోని అనాథ బాలలందరికీ కొత్త జీవితాలు ప్రసాదించసాగాయి.

ఈ గృహాలు నడిపే అధికారులు, ఉపాధ్యాయులు, ఇతర సిబ్బందీ కడుపుకు సాగక అక్కడ చేరినవారు కారు. నిజంగానే బాలలకు సేవచెయ్యాలనే లక్ష్యంతో అక్కడికి వచ్చినవారే ఎక్కువమంది.

అనాథ శరణాలయాలు, సంక్షేమ గృహాలు అనగానే వాటిని నడిపే అధికారులు — పిల్లలకని ప్రభుత్వం మంజూరు చేసే నిధులను తదితర వస్తుసామగ్రిని స్వాహా చేసేసి సంక్షేమ గృహాలను సం'క్షామ' గృహాలుగా మార్చే వార్తలే మనకు జ్ఞాపకం వస్తాయి. అయితే ఇలాంటి హీనస్థితి సోవియట్ రష్యాలో అసలు లేనేలేదనే చెప్పాలి. దీనికి ముఖ్యకారణం వాటిని నడిపే పై అధికారులు చాలా కఠినంగా వుంటారు. అంతేకాదు. యుద్ధంలో ఎవరో ఒకరిని కోల్పోని కుటుంబం అంటూ లేదు రష్యాలో. తమవారిని కోల్పోయి, అనాథులుగా



ఎలాంటి ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుందో అప్పట్లో అందరికీ అనుభవ విషయమే. అంచేత అనాథ బాలలంటే సహజంగానే అందరికీ ఆదరాభిమానాలు ఏర్పడడంలో ఆశ్చర్యం లేదు.

వీరిపట్ల మరింత ప్రేమానురాగాలు కల్గించడానికి వీరిని గురించి చలనచిత్రాలు, నాటకాలు ప్రదర్శింపబడ్డాయి. పత్రికల్లో రాశారు. అప్పుడు వెలువడిన సాహిత్యంలో అనాథ బాలలే కథానాయకులయ్యారు. అనాథ బాలలను ఉత్తమ పౌరులుగా, నాయకులుగా రూపొందించడంలో, సృష్టించడంలో ఎంతో ఆనందం పొందారు నాటి రచయితలు. అతి త్వరలోనే వారి కలలు నిజమయ్యాయి. అనాథ బాలల జీవితాలలో వసంతాలు వెల్లివిరిశాయి.

బాలల గృహాల నిర్వహణకు అందరూ తమకు చేతనైన సాయం చేసి నిధులు సమకూర్చారు. అనాథ బాలలను కొందరు దత్తత తీసుకుని పెంచుకోడం ప్రారంభించారు. ఇలా దత్తత తీసుకున్న రైతులకు ఎక్కువ పొలాలు, పన్నులలో రాయితీలు మంజూరు చేసింది ప్రభుత్వం. ఈ పిల్లలు చదువుకుంటూనే వ్యవసాయం పనులు నేర్చుకోసాగారు. పెద్దయ్యాక వ్యవసాయరంగంలోనే స్థిరపడి స్వతంత్రజీవనం సాగించారు.

1930 సం॥ తర్వాత అనాథ శరణాలయాలకు వచ్చే బాలబాలికల సంఖ్య క్రమక్రమంగా తగ్గుముఖంపట్టింది. ప్రస్తుతం 'అనాథలే లేరు' అన్న మంచి పరిస్థితి ఏర్పడింది!!

—కమలా వరదాచారి

# ఆ గుసగుస

నెమ్మదిగా, అలా
గాలిసవ్వడిలా...
మిమ్మల్ని మౌనంగా
అభినందించే డిజైన్లు.
మీ హృదయానికి
హత్తుకుపోయే రంగులు.

ఫ్యాషన్ చిందించే బట్టలు.
ఎవరినైనాసరే ఆకట్టుకోగలవి.

సూటింగులు, షర్టింగులు
చీరలు, డ్రెస్ మెటీరియల్స్
డెనిమ్స్ మరియు పంచెలు.

గొప్ప ఫ్యాషన్, అపూర్వమైన అనుభవానికి.







**మఫత్‌లాల్ ఇండస్ట్రీస్** న్యూ షర్రాక్ మిల్స్
**మఫత్‌లాల్ ఫైన్**

everest/79/MFI/307-tl

# బామ్మగారి పేజీ

## ప్రశ్నలకు జవాబులు

**కె. జి. సరళకుమారి, కుప్పం**

పసి పిల్లలను ఒక సంవత్సరం పూర్తిగా నిండక ముందే బైటకు తీసుకురాకూడదంటారు, ఎందుకని?

ఎలా తీసుకొస్తారమ్మా – అంత పసి పిల్లలకి బయటి వాతావరణంలోని కాలుష్యం ఇట్టే హాని చేస్తుందే!

**మాచర్ల దేవి, మాడుగుల**

కడుపుతో వున్నవాళ్ళు గుమ్మంపై కూర్చుంటే పుట్టే పిల్లలు చప్పిడిముక్కుతో పుడతారు అంటారు. అది ఎంతవరకు నిజం?

శుద్ధ అబద్ధం!

**శుభసుభాన్, గిద్దలూరు**

శుభకార్యములకు ముత్తైదువలనే ఆహ్వానిస్తారు. మరి, భర్త చనిపోయిన స్త్రీలను పిలవరు ఎందుకని? శుభకార్యం అశుభం అవుతుందా?

శుభ కార్యాలకు విధవలు రాకూడదని ఎక్కడా లేదే! మనం పెళ్ళిళ్ళలోనూ, తక్కిన శుభ కార్యాలలోనూ చూడ్డం లేదూ?.... అయితే కొన్ని కొన్ని పూజలు, కార్యాలూ స్త్రీల సౌభాగ్యానికి – అని ప్రత్యేకించి వున్నాయి. వాటికి వాళ్లొచ్చి ఎలాగూ ప్రయోజనం లేదని, పిలవరు; వాళ్ళూ రారు.

**జి. సరస్వతి, ఏలూరు**

బామ్మగారూ! కుంకుమ పువ్వులో కల్తీ ఎక్కువగా వుందని అంటారు. అసలైన కుంకుమ పువ్వు లక్షణాలు ఎలా వుంటాయో చెబుతారా?

అసలైన కుంకుమ పువ్వు కేసరాలు సన్నగా వుంటాయి. తామరపువ్వు వాసన వేస్తుంది. అంతెందుకమ్మా. చేతిలో వేసుకుని నలిపితే రంగు అంటుకోకూడదు; నీట్లో వేస్తే నీరు ఎర్రబడకూడదు!

**రజిని, కొరగుంటపల్లి**

గర్భిణీస్త్రీలు కుంకుమపువ్వు పాలలో వేసుకుని రోజూ తాగితే పుట్టే శిశువులు తెల్లగా ఉంటారని మా పెద్దలు చెప్పారు. నిజమేనంటారా? కుంకుమ పువ్వువలన లాభమేమైనా ఉందా?

కుంకుమ పువ్వు మనసును సంతోషంగా వుంచుతుంది; బలం ఇస్తుంది. ముఖంలో తళతళ కూడా పెంచుతుంది. గర్భిణీ స్త్రీలు తీసుకోడం మంచిదే–కాని, పిల్లలు మాత్రం కచ్చితంగా తెల్లగా పుడతారన్న మాట మాత్రం నిజం కాదు.

**వి. అహల్యాదేవి, బళ్ళారి**

మా చెల్లెలికి ముఖం మీద, గొంతు దగ్గర పులిపొరలు(ఒక ప్రాంతంలో ఉలిపిరికాయలు అంటారు.) చర్మం చిన్నగా వుండలుగా వుండి చూడడానికి అసహ్యంగా వుంటోంది. ఇది పోవడానికి ఏమి చేయాలి? ఇది రాకుండా వుండడానికి ఏమి చేయాలి? కొందరు గుర్రం వెంట్రుక కట్టితే పోతుందని చెప్పినారు. పోతుందా?

గుర్రం వెంట్రుకతో చుట్టి లాగితే వూడిపోతుందంటారు. అంతకంటె సులభమైనదొకటి చెబుతాను. ఉలిపిరికాయ చిన్నగా వున్నప్పుడు – తమలపాకు పై కాడ కాస్త గిల్లితే, తడిగా తగుల్తుంది గదా — దాన్ని సున్నంలో (తమలపాకులతో వేసుకునే_ సున్నం) అద్ది, అలాగే ఆ కాయ మీద రుద్దితే, (కాయ చుట్టూ తగలాలి) సున్నం ఎండిపోయే వేళకి, అదీ రాలిపోతుంది!



**టి. జీవలక్ష్మి, ఏలూరు**

శ్రావణమాసంలో చాలా పేరంటాలకు వెళ్ళాను. (మంగళవారం, శుక్రవారం) వెళ్ళినచోటల్లా పేరంటాండ్రకు తాంబూలం, పళ్ళతో శనగలు ఇస్తున్నారు. ఈ శనగలు ఇవ్వడంలోని పరమార్థమేమిటో తెలుపండి.

సెనగలు అంటే – నాన బెట్టిన పచ్చి సెనగలు ఇస్తారు. అవి ఆరోగ్యకరమైనవి గదర్రా. అవి మర్నాటికి మొక్కలేస్తాయి. అవి పచ్చిగా తినడం ఆరోగ్యం. కొందరు నాన బెట్టిన పెసలు కూడా ఇస్తారు.

**కె. జి. హేమలత, కుప్పం**

భోజనాలకుముందు విస్తర్ల మీద కాస్త నీరు చల్లి వడ్డన చేస్తారెందుకు?

సాధారణంగా విస్తరి అంటే – పుల్లలతో కుట్టిన విస్తరి అయి వుంటుంది. నీళ్ళు జల్లితే, పుల్లలు ఆకును అంటుకుపోయి, అన్నం తింటున్నప్పుడు పుల్లలు వూడి రావు. లేకపోతే మధ్య మధ్యలో పుల్లలు తగుల్తాయి. అదీకాక, తినేముందు విస్తరి శుద్ధి చేసుకోడం మంచిదేగదమ్మా!

అన్నం తినేటప్పుడు మౌనంగా భుజించాలంటారు. ఎందుకు బామ్మగారూ!

అన్నం తినేటప్పుడు, మాట్లాడుతూ వుంటే, ఆహారం గొంతులో ఇరుక్కుని, పొలమారడం సంభవిస్తుంది. పొలమారితే ఆహార పదార్థాలు ముక్కులోకీ తలలోకీ వెళ్ళి, ఊపిరికి ఇబ్బంది ఏర్పడుతుంది. అందువల్ల మౌనంగా తినడం మంచిదన్నారు. అసలు – 'పొలమారడం' అంటేనే – 'ప్రమాదం' అని అర్థం గదా.

**ఆర్. శోభా, కువ్వం**

విదేశాలలో పిల్లలు పుష్టిగా వుంటారు కదా. అలా పుష్టిగా మన పిల్లలు కూడా పెరగాలంటే ఏమి చేయాలి బామ్మగారు?

విదేశాల్లో పిల్లలను పెంచే విధానం వేరు: మన విధానం వేరూ. పౌష్టికాహారం బాగా ఇస్తే, ఎవరైనా పుష్టిగానే వుంటారు.

**కె. బాలత్రిపురసుందరి, దామల్‌చెఱువు**

రథసప్తమి రోజు జిల్లేడు ఆకులు తల మీద పెట్టుకొని నీళ్ళు పోసుకుంటాము. ఎందువల్ల?

రథసప్తమి అంటే — సూర్యుడికి చెందిన రోజు. సూర్యుడికి అర్కుడన్న పేరు కూడా వుంది. అలాగే జిల్లేడును 'అర్క' అంటారు. సూర్యుడికీ, జిల్లేడుకూ వున్న సంబంధాన్ని అది తెలియజేస్తుంది. పోతే జిల్లేడు అంటే—'తెల్లజిల్లేడు' అనే అర్థం. తెల్లజిల్లేడు ఆకులు, ఆకుల్లోంచి వచ్చే పాలు ఆరోగ్యానికి మంచివి. చలవచేస్తాయి. సూర్యుడి వేడి రథసప్తమి తర్వాత ఎక్కువ అవుతుంది గనక, ఆ తాపాన్ని జిల్లేడు ఆకులు హరిస్తాయని!

**అరుంధతి, అవంతపూర్**

నాకు కాళ్ళు అంటే పాదాలు, మడమలు తరుచూ పగిలి చీలికలు ఏర్పడుతూంటాయండి. నీటిలో నానినప్పుడు, ఉదయం లేవగానే వాటివల్ల చాలా బాధగా వుంటోంది. వాజ్‌లైన్, మలాం లాంటివి పూస్తే తాత్కాలికంగా తగ్గుతాయి. కాని వాడడం మానగానే మరీ బాధ మొదలు పెడుతుంది. దయచేసి ఏదైనా గృహవైద్యం చెప్పండి.

కాళ్ళు నీళ్ళలో చాలాసేపు నానితే, వేళ్ళు ఒరిసి, దురదపెడతాయి. ఇంకా ముదిరితే, బొబ్బలు ఎక్కుతాయి నూనె, పసుపు, ఉప్పు-మూడూ కలిపి నూరి, ఆ భాగంలో కొన్ని రోజులపాటు రాస్తే తగ్గుతాయి. అయితే, అవి తగ్గేవరకూ నీళ్ళలో నానకుండా వుండాలి మరి!

## ఈకలతో పిట్టలు

ధర తక్కువలో, చూడ సొంపుగా వుండే వస్తువులలో యిది ఒకటి. కావలసిన వస్తువులు: అట్ట, ఈకలు, మైదా గమ్, వత్తి, రంగు పేపరు కావాలి.

ఈకలు రంగురంగుల ఈకలు అమ్ముతారు. లేకపోతే కోడి ఈకలు దొరికినా చాలు. అయితే ఈకలు బాగా వుండాలి. ముందు మనకు కావల్సిన డిజైను ఎన్నుకోవాలి. అంటే పిట్టలు, కొమ్మ వుండేలాగా వుండాలి డిజైను. తరువాత ఆ డిజైనుకు సరిపోయేటట్టు తీసుకొని దానిమీద కలరు పేపరు ముడతలు లేకుండా అంటించుకోవాలి. ఆరిన తరువాత వచ్చిన డిజైను దాని మీద వేసుకోవాలి. ఇప్పుడు దూది తీసుకొని ఆ పిట్ట షేపు యెట్లా వుందో అట్లా ఆ పిట్ట డిజైను మీద పెట్టి టాకాలు వేసుకోవాలి. అంటే దూదితో షేపు చేసుకోవాలి. ఇక ఈకలు తీసుకొని ముందు భాగం మటుకు కొంచెం పొడుగ్గా కట్ చేసి పత్తిమీద ముఖం వైపు వంచి అంటించుకుంటూ రావాలి (గమ్ పూసి). దూది పూర్తిగా కనిపించకుండా వుండాలి. తోకదగ్గిర మటుకు పొడుగ్గా వుండే రెక్కలు అంటించాలి. ఇట్లా అన్ని పిట్టలు అంటించాలి. కండ్లు పెట్టాలిగా — దీనికి రెడీమేడ్‌వి దొరుకుతాయి. లేదా పూసలు అంటించవచ్చు. ఇక కొమ్మకు మధ్య గ్రీటింగు కార్డుకట్



చేసి ఆ డిజైను మీద అంటించాలి. స్పాంజి (గ్రీన్) వుంటే ఆకులు కట్‌చేసి పెట్టవచ్చు. లేదా పేపరుతో కట్‌చేసి పెట్టాలి. అట్లానే గ్రీటింగ్ కార్డు ముక్క షేపులో కట్‌చేసి ముక్క అంటించాలి, లేదా స్పాంజివైనా కట్ చేసి పెట్టవచ్చు.

ఇక మధ్య గూడు అమర్చాలి. ఇంట్లో పీచు (టెంకాయ) వుంటుంది కదా—దానిని గూడు వుండే షేపులాగా చేసి మధ్యలో అంటించి దానిలో తెల్లగుండ్రటి పూసలు అంటించాలి. అవి పక్షి గ్రుడ్లులాగా వుంటాయి. ఇప్పుడు పూర్తి అయినట్లే. దీనికి ఫ్రేము (డబుల్ ఫ్రేము) వేయించి డ్రాయింగు రూంలో వుంచితే అసలు పిట్టలు వున్నట్లే వుంటాయి. శ్రమేగాని చేస్తే ఆ శ్రమ అంతా మర్చిపోతాము.

—అమంచర్ల రాజేశ్వరి

**ఐ. బేబి ఉషాకుమారి, పాతపట్నం**

బామ్మగారు, మా ఇంటిలో ఒక నిలువుటద్దం ఉన్నది. దానికి పగులు వున్నది. మా ఇంటికి వచ్చినవారు అంతా, పగిలిన అద్దం ఇంటిలో ఉంటే కష్టాలు అంటూ ఉంటారు. ఇది నిజమా?

పగిలిన అద్దంలో ముఖం చూసుకుంటే భయంకరంగా వుంటుందిగదమ్మా—అంచేత మనం మొహం అందులో ఎలా చూసుకుంటాం? చూసుకోకూడదు. పైగా, పగిలిన పెంకులు చేతికి గుచ్చుకుంటే, రక్తం రావచ్చు; గాయాలు కావచ్చు. ఈ కారణాల చేతనే పగిలిన అద్దం ఇంట్లో ఉంచకూడదన్నారు.

**యస్. పద్మలక్ష్మి, విజయనగరం**

బామ్మగారూ! వేళ్ళకు గోరింటాకు పెట్టుకోమంటారు పెద్దవాళ్ళు. ఎందుకని? అందానికేనా? ఇంకేమైనా కారణం వుందా?

గోరింటాకు అందానికి అందం: వేళ్ళకి ఆరోగ్యం. గోళ్ల ఆరోగ్యంగా, పుచ్చిపోకుండా వుండడానికి గోరింటాకు బాగా తోడ్పడుతుంది. గజ్జి, చిడుము లాంటి వ్యాధులు రానివ్వదు. అందుకే మరి చూశారా! ఇలాంటి వ్యాధులు వస్తే గోరింటాకు మెత్తగా నూరి గజ్జి వున్న చోట పట్టించమంటారు! □

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

## 'బ్రాహ్మదేవి'

ఆంగ్ల నవలా లోకంలో తీవ్ర ఆవేశ సమధిగతమై కవితా ఊహాప్రకల్పనతో మధురమైన నవలా రాజంగా పేర్కొనదగ్గది-"జేన్ఐర్". దీన్ని రచించిన ఛార్లొటిబ్రాంటి 1816వ సంవత్సరంలో ఏప్రెలు 21న జన్మించింది. ఆమె తండ్రి ఐరిష్ మతగురువు. ఆమె పుట్టిన కొలది సంవత్సరాలకే కుటుంబం యార్క్‌షైర్ మండలంలోని హేవర్త్‌కి మారింది. తల్లిని చిన్నప్పుడే పోగొట్టుకున్నది బ్రాంటి. ఈమె తోబుట్టువులు ఎమిలీ, ఏనీ కూడ ప్రఖ్యాత నవలా రచయిత్రులయ్యారు.

అక్కా చెల్లెళ్లు ముగ్గురూ ముందు మారు పేర్లతో కవిత్వం ప్రకటించారుగాని ఆ కవిత్వం కీర్తిని సాధించలేదు. తరువాత ఎవరికివాళ్ళు మారు పేర్లతో నవలలు వ్రాశారు. కీర్తిని సాధించిన తరువాత అసలు పేర్లు బయట పడ్డాయి.

'జేన్ఐర్' నవల మాత్రమే కాకుండా 'షర్లీ', 'విల్లెట్టీ' అనే నవలలు కూడా వ్రాసింది ఛార్లొటి బ్రాంటి. అయితే 'జేన్ఐర్' కీర్తి శిఖరాలను చేరుకున్నట్లు అవి చేరలేదు.

జేన్ఐర్ నవలలో కొంత ఆత్మకథ ఉన్నప్పటికీ ఎక్కువభాగం అంతకుముందు శతాబ్దంలో అధిక ప్రచారంలో ఉన్న 'రొమాన్సు' —శృంగారభావ పుష్టి ఉన్నది.

(కథ)

చిన్నప్పుడే తలితండ్రుల్ని పోగొట్టుకున్న జేన్ ఐర్ నిర్దయురాలైన మిసెస్ రీడ్ (గేట్‌షెడ్ హాల్‌కు చెందిన) అనే మేనత్త చేతి పెంపకంలో పడింది. మిసెస్ రీడ్ భర్త (జేన్ తల్లికి సోదరుడు) చచ్చిపోతూ జేన్‌ను తమ స్వంత బిడ్డలాగా (ముగ్గురు స్వంత బిడ్డలున్నారు) చూడమని భార్యకు చెప్పాడు. ఈ హితవును విస్మరించి ఆమె పది సంవత్సరాలు జేన్‌ను మహా కఠినంగా శిక్షించింది. తన పిల్లల్ని అతి గారాబంతో పాడుచేసి జేన్‌ను పనిమనిషిగా చూచింది.

ఒకనాడు చిన్న తప్పిదానికి శిక్షగా జేన్‌ను తన భర్త చనిపోయిన గదిలోపెట్టి బంధించింది. జేన్ భయపడి మూర్ఛిల్లి రోగగ్రస్తురాలైంది. జెస్సీ లేవెన్ అనే నర్సు ఆమెకు ఉపచారం చేసి రోగాన్ని చేకూర్చింది. జేన్‌ను ఏభై మైళ్ళ దూరంలో ఉన్న 'లోవుడ్' పాఠశాలకు పంపించారు. అక్కడి పరిస్థితులు బాగుండకపోయినా మేనత్త చేతిక్రింద కంటె జేన్‌కు సుఖంగానే ఉన్నది. అక్కడ మిస్ టెంపుల్ అనే ఆమెతో స్నేహం కుదిరి జేన్ త్వరితంగా పాఠాలు చదివింది. ఆ పాఠశాలకు విపత్తు వచ్చి ఒక అంటువ్యాధిలో చాలామంది బాలికలు చనిపోగా ప్రభుత్వం దర్యాప్తు చేయించింది. అందుచేత పరిస్థితులు కొంత మేలైనాయి. జేన్ ఆ బడిలోనే ఉపాధ్యాయిని అయింది పద్దెనిమిదవ ఏట. కాని త్వరలోనే ఆ ఉద్యోగం వదలిపెట్టి మిల్కోట్ సమీపంలో ఉన్న థారన్‌ఫీల్డ్ మేనర్‌లో ఎడిలెవేరెన్స్ అనే బాలికకు ఇంటిలో ఉండి శిక్షణ యిచ్చే ఉపాధ్యాయినిగా చేరుకుంది. ఇంటి యజమాని రోచెస్టర్‌కు బంధువై ఇల్లు చక్కదిద్దుతున్న మిసెస్ ఫెయిర్‌ఫేక్స్ ఆమెకు ఉద్యోగం యిచ్చింది.

ఉద్యోగం ఆమెకు తృప్తిగానే ఉన్నది కాని మిసెస్ ఫెయిర్‌ఫేక్స్ మూడవ అంతస్తులోకి వెళ్ళ వద్దని చెప్పినప్పుడామెకు ఆశ్చర్యం వేసింది. ఒకనాడు మూడవ అంతస్తు నుంచి వికటమైన నవ్వు కేకలు విన్పించాయి. అయితే అదంతా 'గ్రేస్‌పూల్' అనే నౌకరు (శుద్ధ మొద్దుగా కన్పించే పనిమనిషి) చేసిందని మిసెస్ ఫెయిర్‌ఫేక్స్ అంటుంది.

ఆంగ్ల సాహిత్యంలో ధ్రువ తారలుగా నిలచిన బ్రాంటే సోదరీమణులు (ఎడమ నుంచి) ఏనీ, ఎమిలీ, చారొటి బ్రాంటే



జనవరిలో ఒకనాడు జేన్ సాయంత్రం నడకకు వెళ్ళగా యజమాని రోచెస్టర్ కన్పిస్తాడు. ఆమె అతనిని చూడటమదే మొదటిసారి. అతడు గుర్రం మీది నుంచి క్రిందపడ్డాడు. అతని కుక్క జేన్ దగ్గరకు వచ్చి సహాయం చేయమన్నట్లు దీనంగా చూస్తుంది. కాని రోచెస్టర్ ఎంతో బాధతో ఉన్నప్పటికీ సహాయం అక్కర లేకుండానే నడచి యిల్లు చేరగలనంటాడు. ప్రశ్నల వలన జేన్ బాలిక వారెన్స్‌కు ఉపాధ్యాయిని అని తెలుసుకుంటాడు. తన దర్పాన్ని ఆమె లెక్క చేయలేదని తెలుసుకుని రోచెస్టర్ ఆమెతో సౌజన్యంతో ప్రవర్తిస్తాడు. ఆమెతో రహస్యంగా ఎడిలెవారెన్స్ బాలిక తన కుమార్తెయేనని ఆమె తల్లి ఫ్రెంచి నాట్య కళాకారిణి తన్నూ కుమార్తెను చాలనాళ్ళ క్రితమే వదలి వెళ్ళిపోయిందని చెప్పుతాడు.

ఒకరాత్రి పెద్ద కేకలు విన్పించగానే జేన్ నిద్రలేచి గది తలుపు తెరచి చూచింది. రోచెస్టర్ గది నుంచి పెద్ద పొగ వస్తుంది. వెళ్లి చూడగా అతని మంచం మండుతున్నది. సమయం మించిపోకుండా అతన్ని నిద్రలేపి రక్షించింది. అయితే ఇంట్లో జనానికి నిద్రాభంగం కలిగించవద్దనీ_ అప్పుడప్పుడు ఉన్మత్త వైఖరి వచ్చే ఆడనౌకరు గ్రేస్‌పూలే-యీ పనిచేసి ఉండవచ్చునని అతడు జేన్‌ను సమాధానపరిచాడు. మైనపు వత్తి పొరపాటున మంచం మీద పడటం వలన ప్రమాదం ఏర్పడిందని మిగిలిన నౌకర్లకు చెప్పడం జరిగింది.

యజమాని రోచెస్టరు పూర్వం చేసిన పొరపాటువలన ఫలితాలను అనుభవిస్తున్నాడని తలచి జేన్ అతనిపైన అభిమానం చూపుతుంది. అది సానుభూతిగా చివరకు ఆమె హృదయంలో అతనిపై ప్రేమగా మారుతుంది. అయితే రోచెస్టరు సమీప ప్రాంతంలో ఉంటున్న సుందరి బ్లాంకే ఇంగ్రాంతో సరసాలు ఆడుతున్నాడని తెలిసి జేన్ నిరుత్సాహపడుతుంది. ఒకసారి తటస్థపడిన బ్లాంకే ఇంగ్రాం జేన్‌ను నీచంగా చూస్తుంది. ఆమెతో తాను పోటీ పడలేనని జేన్ భావిస్తుంది.

ఇంట్లో చాలామంది అతిథులు ఉండగా మేసన్ అనే నూతన ఆగంతుకుడు వచ్చాడు రోచెస్టరు యింటికి. ఆ రాత్రి జేన్‌కు ఎవరో పెద్దగా భయంతో అరుస్తూ సహాయం అర్థిస్తున్నట్లు వినిపించింది. రోచెస్టరు ఏదో చెప్పి నౌకర్లను సమాధానపరిచాడు. జేన్‌తో రహస్యంగా చెప్పాడు_గాయపడి స్మృతి లేకుండా ఉన్న మేసన్‌కు ఉపచారాలు చెయ్యమని.



కిరణ్మయి

బొంబాయిలోని బులాభాయ్ దేశాయ్ ఆడిటోరియంలో శ్రీ నటరాజ ఆర్ట్ అకాడెమీ ఆధ్వర్యంలో కుమారి కిరణ్మయి భరతనాట్య 'రంగప్రవేశం' జరిగింది. నగరంలోని ఆంధ్రులు, ప్రముఖులు, రక్షక దళాల అధికార్లు కుటుంబాలతో సహా హాజరు కావటమే కాక ఫ్రాన్స్, భూటాన్, జపాన్ దేశస్థులు కూడా ఈ ప్రదర్శన తిలకించారు.

మూడు గంటల పాటు జరిగిన ఈ కార్యక్రమంలో కుమారి కిరణ్మయి భరతనాట్య భంగిమలన్నింటినీ అతి సునాయాసంగా, ఎంతో ప్రతిభావంతంగా ప్రదర్శించింది. "సుప్రసిద్ధ భరతనాట్య కోవిదురాలు కమలా అయ్యంగార్ శిష్యురాలైన కిరణ్మయి పదమూడు సంవత్సరాల ప్రాయంలోనే కేవలం మూడు సంవత్సరాల శిక్షణతో యింతటి ప్రావీణ్యత సంపాయించడం ఎంతో ప్రశంసనీయం" అన్నారు ఆనాటి సభకు ముఖ్య అతిథిగా వచ్చిన మిలటరీ ఇంజనీరింగ్ సర్వీస్ ఛీఫ్ ఇంజనీర్ బ్రిగేడియర్ సి. యమ్. భాటియా.

కిరణ్మయి బొంబాయి ఆంధ్రకల్చరల్ అసోసియేషన్ అధ్యక్షుడు మిలిటరీ ఇంజనీర్ అయిన శ్రీ చిన్నిమోహన్-కుమార్తె. ఆమె తల్లి శ్రీమతి మణిమోహన్ గాయకురాలు; వీణా విద్వాంసురాలు. కిరణ్ తన తల్లి వద్ద వీణావాద్యం నేర్చుకుని అందులో కూడా చక్కని పాండిత్యాన్ని సంపాయించింది.

ప్రస్తుతం డిఫెన్స్ సెంట్రల్ స్కూల్‌లో చదువుతున్న కిరణ్మయి తాను పట్టభద్రురాలు కావాలని, సంగీత నాట్య శాస్త్రాలలో మరింత ప్రాముఖ్యత సంపాయించి విదేశాలలో కూడా ప్రదర్శనలు యివ్వాలనీ అభిలషిస్తోంది. అయితే తను యివ్వబోయే సంగీత నాట్య ప్రదర్శనలన్నీ కూడా ప్రజాహిత కార్యక్రమాలకే తోడ్పడాలన్నది తన ఆశయం అంటుంది కుమారి కిరణ్మయి. □

తెల్లవారేటప్పటికి గాయపడిన మేసన్ ఇంటి నుంచి పంపివేయబడ్డాడు.

కొద్ది రోజుల తరువాత ఒకనాడు జేన్ ప్రక్క ఉన్న తోటలో సాయంకాలం ఎండలో కూర్చుని ఉండగా రోచెస్టరు అక్కడకు వచ్చి కొంతసేపు చమత్కారంగా మాట్లాడి తాను త్వరలో పెండ్లి చేసుకోబోతున్నానని చెప్పాడు. జేన్ అతడు బ్లాంకే ఇంగ్రాంను పెండ్లి చేసుకుంటాడని భావించి కళ్ళ నీళ్ళతో "ఇక నేను యీ యింటిలో ఉండలేను" అంటుంది. రోచెస్టరు నవ్వుతూ ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దాడి ఆమెనే పెండ్లి చేసుకుంటానని వివరించాడు.

పెండ్లి రోజుకి ముందు మధురమైన ఆలోచనలతో ఉన్న జేన్‌కు ఒక రాత్రి నిద్రాభంగమై కళ్ళు తెరచి చూడగా పెండ్లినాడు ధరించడానికి కుట్టించుకున్న తన దుస్తుల్ని ఎవరో చింపివేస్తున్నట్లు కన్పించింది. అది పీడకల అని రోచెస్టరు ఆమెను సమాధానపరిచాడు. కాని మర్నాడు ఉదయం చింపిన దుస్తులు ఎదురుగా ఉన్నాయి.

పెండ్లి జరుగబోతుండగా మేసన్ వచ్చి ఆ పెండ్లి జరుగటానికి వీలులేదని, రోచెస్టరుకి భార్య బ్రతికి ఉన్నదని అడ్డు చెప్పాడు. పెండ్లి ఆగిపోయింది. నిజం చెప్పకతప్పలేదు రోచెస్టరుకి. జేన్ తీసుకువెళ్ళి మేడ మీద మూడవ అంతస్తులో పిశాచం లాగా పిచ్చిదిగా ఉన్న స్త్రీని చూపించి-ఆమెయే మేసన్‌ను గాయపరచిందనీ-జేన్ పెండ్లి దుస్తులు చింపిందనీ చెప్పాడు. ఆమె మేసన్‌కు చెల్లెలనీ తన్ను మోసగించి జమైకాలో తనకామెతో పెండ్లి జరిపించారనీ - ఆమె వంశంలో పరంపరగా పిచ్చితనం వస్తున్నదనీ చెప్పాడు. తన వైవాహిక జీవితం నరకప్రాయంగా ఉన్నదనీ ఆ పిచ్చిభార్యను గ్రేస్‌పూలే అజమాయిషీలో బంధించి ఉంచామనీ వివరించాడు.

జేన్‌కు రోచెస్టరు మీద ఎంతో సానుభూతి కలుగుతుంది. కాని యిక తానెక్కడ ఉండకూడదని నిర్ణయించుకొని చాలా తక్కువ డబ్బు తీసుకొని మరొక ఉద్యోగాన్ని అన్వేషిస్తూ ఇంగ్లాండు మధ్య ప్రాంత చవిటినేలల గ్రామాలలో సంచరిస్తుంది. ఆమె ఆలంబనం లేక, ఆహారం లేక నిస్సహాయ స్థితిలో ఉండగా జాన్‌రివర్స్ అనే మతాచార్యుడు ఆదుకుంటాడు. అతని చెల్లెళ్ళు మేరీ, డయానా ఆమెకు స్నేహితులై ఆమెకు, మళ్ళీ ఆరోగ్యం వచ్చేటట్లు చేశారు.

జేన్ — ఇలియట్ అనే పేరుతో ఒక కుగ్రామంలో ఉపాధ్యాయినిగా చేరుతుంది. రోఛెస్టరు పైన తనకున్న ప్రేమను మరచిపోవడానికి ప్రయత్నిస్తుంది.

ఇంతలో జేన్ తండ్రి సోదరుడు జాన్ దూర దేశాలలో చనిపోయి ఆమెకు 20 వేల పౌన్ల ధనం వదలిపెట్టినట్లు తెలుస్తుంది. తనకు చాలా దగ్గర బంధువులే జాన్‌రివర్స్ అతని చెల్లెళ్ళు అని వివరాలు తెలియగా తనకు వచ్చిన ధనాన్ని వాళ్ళకు కూడా పంచి యిస్తుంది జేన్.

జాన్‌రివర్స్ మిషనరీగా ఇండియాకు వెళ్లుతున్నానని, తన వెంట భార్యగా రమ్మనీ జేన్‌ను కోరాడు. ఆమెపైన తనకు ప్రేమ లేకపోయినా-తన మిషనరీ కార్యక్రమంలో ఆమె తనకు తగిన సహాయకురాలుగా ఉంటుందని అతడు అభిప్రాయపడ్డాడు. అతని కోరికను జేన్ ఆలోచనచేసి చెప్పుతానన్నది.

ఆ రాత్రి కలలో జేన్‌కు రోచెస్టరు తన్ను పిలుస్తున్నట్లుగా తోచింది. మరునాడు ఉదయం తన కోసమతడేమైనా వచ్చాడేమోనని చూచింది. అ[illegible] రాలేదు. హృదయంలో ఉప్పొంగిన ఆవేశంతో అతనికోసం అతని గృహానికి బయలుదేరి వెళ్ళింది. కాని అక్కడ ఇల్లు లేదు. ఇల్లు కాలి బూడిద అయిపోయి ఉన్నది.

సమీపంలో ఉన్నవారిని విచారించగా వివరాలు తెలిసినై. ఒకనాటి రాత్రి రోచెస్టరు పిచ్చి భార్య ఇంటికి నలుమూలలా నిప్పు పెట్టింది. ఇల్లు కొంత తగులబడిన తర్వాత మేల్కొన్న రోఛెస్టరు ఇంటిలో ఉన్న సేవకులందరినీ సురక్షితంగా బయటకు చేర్చాడు. తగులబడుతున్న మేడలోకి వెళ్ళాడు పిచ్చిదాన్ని కూడా రక్షిద్దామని. ఆమె అతనికి అందకుండా పరుగులుపెట్టి పైకప్పు మీదకెక్కి అక్కడ నుంచి మంటలోకి దూకి చచ్చిపోయింది.

రోచెస్టరు ప్రాణాలతో బయటకు రాగలిగాడు. కాని మండుతున్న కొయ్య మెట్లు మీదపడి కండ్లు పోయాయి. ఒక చేయి బాగా దెబ్బతిన్నది. ఇప్పు డతడు ఏకాంతంగా ఫెర్న్‌డీన్ అనే చోట ఉంటు న్నాడు. జేన్ అతన్ని చూడటానికి వెళ్ళింది.

తన్ను చూడటానికి ఆమె వచ్చిందని రోఛెస్టరు ఎంతో సంతోషించాడు. తన్ను వివాహం చేసుకో మని కోరాడు. ఆమె ఆనందంతో అంగీకరించింది. వాళ్ళు వివాహం చేసుకున్నారు. వారికొక బిడ్డ కలిగింది. రెండు సంవత్సరాల తర్వాత రోఛెస్టరుకి ఒక కంటిచూపు తిరిగి వచ్చింది.

ఈ కథలో నాయికలాగానే రచయిత్రి తన జీవితంలో ఒక వివాహితుణ్ణి ప్రేమించి భగ్న ప్రేమికురాలైంది. అయితే 1854లో తన 38వ ఏట ఆర్థర్ బెల్ నికోల్స్ అనే అతనిని వివాహం చేసుకున్నది. కాని తరువాత కొన్ని నెలలకే ఆమె (31 మార్చి 1855) మరణించింది.

ఆమె రచించిన మరొక నవల షర్లీ. ఇది శ్రామికులకు మిల్లు యజమానులకు మధ్య ఉన్న ఘర్షణను గురించిన ఇతివృత్తం. ఇందులో క్రైస్తవ మతాచార్యులపైన ఎన్నో విసుర్లు ఉన్నాయి.

మరొక నవల విల్లెట్టీ. ఇదీ ఆమె ఆత్మకథగానే తోస్తుంది. ఆమె సోదరుడు చెల్లెళ్ళు మరణించిన తరువాత ఏకాకిగా, దుఃఖమయ జీవితం గడుపుతూ చేసిన రచన. ఒక వివాహితుణ్ణి ప్రేమించి ఆమె పడిన వేదన–భగ్నప్రేమఫలితం - దీనిలో ప్రత్యక్షర పరిస్ఫుటంగా కన్పిస్తుంది.

చార్లొటి బ్రాంటీ 'జేన్ ఐర్' నవలలో – ఒక అజరామరమైన స్త్రీ పాత్రను సృష్టించింది. సుగుణ శీల అయిన ఆంగ్ల మధ్యతరగతి కుటుంబ స్త్రీకి అది ప్రతీక. అందుచేత యీ నవల ఆంగ్లభాష ఉన్నంతకాలమూ – ఆంగ్ల సంఘం ఉన్నంత కాలమూ ఉంటుంది. □



# వైద్య విశేషాలు

హృద్రోగులు చాలామంది వైద్యుల సలహాపై మితంగా మద్యం సేవిస్తుంటారు. ఆ విధంగా మితిమీరకుండా, ఎప్పుడో ఒకసారి మద్యం త్రాగడం శరీరానికి మంచిదేనన్న విషయాన్ని ఇటీవల ప్రొఫెసర్ గ్రెట్ అనే వైద్యశాస్త్రజ్ఞుడు తన పరిశోధనల వల్ల నిరూపించారు. రక్తంలో వుండే 'కొలెస్టరాల్' (అధికంగా వుండే క్రొవ్వు పదార్థం)లో రెండురకాలు వున్నాయి. ఒకటి హెచ్. డి. ఎల్. కొలెస్టరాల్. రెండవది ఎల్. డి. ఎల్. కొలెస్టరాల్. హెచ్. డి. ఎల్. కొలెస్టరాల్ గుండెకు సంబంధించిన ధమనులకు రక్షణ కల్పించి, హృద్రోగాన్ని నిరోధిస్తుంది. మద్యం సేవించడంతో రక్తంలో హెచ్. డి. ఎల్. కొలెస్టరాల్ పెరుగుతుంది. ఆ విధంగా అది గుండె జబ్బు నివారించడానికి దోహదం చేస్తుంది. అంచేత దుర్వ్యసనంగా మారనంతవరకు, అరుదుగా మద్యం సేవించడం వల్ల ఆరోగ్యానికి మంచే జరుగుతుందని ప్రొ॥ గ్రెట్ వివరించారు.

*

"స్త్రీ మెదడు బరువు పురుషుడి మెదడుకంటే 250 గ్రాములు తక్కువగా వుంటుంది. అందువల్లే పురుషుడు తర్కాన్ని ఉపయోగించి సమస్యలను పరిష్కరించాలనుకుంటాడు. కాని స్త్రీ తర్కం ప్రమేయం లేకుండా గబుక్కున ఒక నిర్ణయానికి వచ్చేస్తుంది!" అని ప్రముఖ న్యూరో సర్జన్ శ్రీ బి. రామమూర్తి ఇటీవల మద్రాసులో లయన్స్ క్లబ్ ఆఫ్ వేపేరి వారు ఏర్పాటు చేసిన ఒక సమావేశంలో చెప్పారు. పురుషుడి మెదడు బరువు ఒకటిన్నర కిలోగ్రాములు వుంటుందట. మెదడుకు సక్రమమైన పద్ధతిలో కొత్త వ్యాపకాలను కల్పిస్తూ వుండడం మంచిదని, అలా మెదడుకు మేత పెడుతూ, ఎక్కువ కార్యక్రమాలలో పాల్గొంటున్న కొద్దీ–మెదడు అభివృద్ధి చెందుతుందనీ— ఆయన ఆ సమావేశంలో వివరించారు.

*

సాధారణంగా కారపు వస్తువులు ఎక్కువగా తినే వారికి పొత్తి కడుపులో వచ్చే పుండు కొంత కాలానికి చాలా హానికరంగా పరిణమిస్తుంది. ఆ పుండు తేలికగా మానడానికి అనువైన మాత్రను ఇటీవలే జపాన్ మెడికల్ అసోసియేషన్ అధ్యక్షులు డా॥ తారోతకేమీ రూపొందించారు. చాలా కొద్ది మాత్రలతోనే పుండు మానిపోతుందట. త్వరలోనే ఈ మాత్రలను విరివిగా ఉత్పత్తి చేసి, విడుదల చేయడానికి ఒసాకాలోని గ్రీన్‌క్రాస్ కార్పొరేషన్‌వారు సన్నాహాలు చేస్తున్నారు.

*

భార్యా భర్తలలో ఎవరికైనా కీళ్లవాపు జబ్బు వుంటే, వాళ్లు ఆ బాధ నుంచి తప్పించుకోడానికి లైంగిక సంపర్కం దోహదం చేస్తుందని చికాగోకు చెందిన డా॥ జెస్సీపాటర్ అనే వైద్యశాస్త్రజ్ఞుడు వెల్లడించారు. స్త్రీ పురుషులు శారీరకంగా కలిసే సమయంలో అడ్రెనల్ గ్రంధులు చురుకుగా పని చేయడం వల్ల–కీళ్లవాపు నొప్పితో బాధపడే వారు అయిదారు గంటలసేపు – ఆ బాధ నుంచి ఉపశమనం పొందుతారని ఆయన తెలియజేశారు

*

తరచుగా 'ఎక్స్-రే' తీయించుకోవడం వల్ల 'కేన్సర్' (పుట్టుకురుపు వ్యాధి) వచ్చే ప్రమాదం వుందని ఇటీవల జరిగిన కొన్ని పరిశోధనలవల్ల తెలిసింది. ఈ అంశంపై న్యూయార్కులోని రోజ్వెల్ పార్క్ మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన డా॥ ఇర్విన్ బ్రోస్, మరికొందరు వైద్యశాస్త్రజ్ఞులు తమ పరిశోధనా సారాంశాన్ని వివరిస్తూ, తరచుగా 'ఎక్స్-రే' తీయించుకున్న వారికి తక్కిన వారికంటే 'లుకేమియా' వంటి కేన్సర్ రావడానికి పదిరెట్లు ఎక్కువ అవకాశా లున్నాయని తెలియజేశారు. ఈ అంశంతో ఏకీభవిస్తూ, అమెరికా ప్రభుత్వానికి చెందిన బ్యూరో ఆఫ్ రేడియలాజికల్ రీసెర్చ్ డైరెక్టరు డా॥ జాన్ సి. విల్‌ఫోర్త్–అనవసరంగా ప్రతి దానికి 'ఎక్స్-రే'లు తీయించే పద్ధతిని మానుకోవాలని, తప్పనిసరి అయితేనే 'ఎక్స్-రే' తీయించుకోవాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.



డెన్మార్క్ దేశానికి కుమారి పిట్ బెర్రిగార్డ్ అనే ఆవిడ విద్యాశాఖా మంత్రిగా వుంటున్నారు. అలా ఒక వనితని మంత్రిగా నియమించి డెన్మార్క్ ప్రధాని శ్రీయుత అన్కర్ జోర్గెన్‌సెన్ తన విశాల హృదయాన్ని, సమాన దృక్పధాన్ని ప్రకటించుకున్నారు. అయితే ఆయనే యిటీవల కుమారి పిట్ బెర్రిగార్డ్‌ని కాస్తా మంత్రి పదవి నుంచి తొలగించారు. కారణం – యిటీవల ఆమె జరిపిన విదేశ పర్యటనలోని హోటల్ బిల్లులు చూసి అదిరిపోయాట్ట ఆయన.

కుమారి పిట్ ఈ మధ్య పారిస్ నగరంలో జరిగిన రెండు అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొనేందుకు వెళ్ళారు. అక్కడ ఆమె పదమూడు రోజులపాటు ఒక బ్రహ్మాండమైన హోటల్‌లో వుండి కళ్ళు చెదిరే బిల్లును ప్రధానమంత్రికి సమర్పించారట. 'ఈవిణ్ణిలాగే వుంచితే ఈ బిల్లులు నేనెక్కడ కట్టుకోను' అని ప్రధాని కాస్తా ఆమెని పదవీచ్యుతురాలిని చేశార్ట. ఇప్పుడా పదవిని ఆయన తాత్కాలికంగా ఆర్థికమంత్రికి అప్పగించారట. ఆయనైతే పొదుపుగా ఖర్చుపెడతాడని!

[రంగుల బ్యాగులు : 63 వ పేజీ నుంచి]

లూమ్ గుడ్డగానీ కేస్మెంట్ గుడ్డగాని (మనం నిర్ణయించుకున్న ప్రకారం) తీసుకుంటే చాలు. లైనింగు, కాన్వాస్సు, బెల్టుకి అవసరంలేదు.

ఆ తరువాత గులాబిరంగు ఫెల్టు ముక్క మీద నెమలి చిత్రాన్ని ట్రేస్ తీసుకుని కత్తిరించాలి. ఆదే విధంగా పచ్చరంగు ఫెల్టు ముక్క మీద కూడా ఈ నెమలి చిత్రాన్ని తీసుకుని కత్తిరించాలి. నెమలి కన్ను మాత్రం నలుపురంగు దారంతో ఎంబ్రాయిడరీ చెయ్యాలి. కన్ను వెలుపలి భాగం తెల్లదారంతో గొలుసు కుట్టు పద్ధతిలో కుట్టుకోవాలి.

ఇప్పుడు బ్యాగ్‌కి యిరువైపులా వర్ణ చిత్రంలో చూపినట్లుగా గులాబి, పచ్చరంగు ఫెల్టు ముక్కలతో చేసి వుంచుకున్న నెమళ్ళను ఫెవికాల్‌తోగానీ మరే యితర జిగురు పదార్థంతోనైనాగానీ అతికించుకోవాలి. ఈ నెమలి అంచులని (అవుట్‌లైన్) పచ్చరంగు దారంతో గొలుసు కుట్టు కుట్టుకోవాలి.

ఇక కావలసింది భుజాన వేలాడేసుకునేందుకు వీలుగా పట్టీ. ఈ పట్టీకోసం కాన్వాస్ గుడ్డ, నలుపు రంగు గుడ్డ తీసుకోవాలి. ఈ రెంటినీ కలిపి పట్టీలా చేసుకున్న తర్వాత బ్యాగ్‌కి యిరువైపులా కుట్టుకోవాలి. బ్యాగ్ లోపలి భాగంలో లైనింగ్‌కోసం ఎంచుకున్న పలుచటి గుడ్డ అమర్చి మిషను మీద కుట్టుకోవాలి. బ్యాగ్ పైభాగంలో నాలుగంగుళాల మేర విడిచిపెట్టి బ్యాగ్ యిరువైపులా ప్రక్కలు కుట్టుకుంటే అందంగా, హుందాగా భుజాన వేసుకుని వెళ్ళేందుకు వీలుగా బ్లాక్‌బ్యాగ్ పూర్తవుతుంది.

## గ్రీన్ బ్యాగ్

కలసిన వస్తువులు : 1 మీటరు పచ్చరంగు గుడ్డ – హ్యాండ్‌లూమ్‌గాని, కేస్మెంట్‌గానీ, 1 మీటర్ పలుచటి గుడ్డ (లైనింగ్‌కోసం), 2 చెక్క హేండిల్స్, ½ మీటరు కాన్వాసు గుడ్డ, 2 అద్దాలు (కాస్త పెద్దవి), 2 చిన్న సైజు అద్దాలు.

చేయవలసిన విధానం: వర్ణ చిత్రంలో చూపినట్లుగా పచ్చరంగు గుడ్డ, లైనింగ్‌కోసం తీసుకున్న గుడ్డ కత్తిరించాలి. ఆ తరువాత బెల్టుకోసం 3"×10½"తో ఒకటి, 2"×10½"తో ఒకటి ఇలా రెండు ముక్కలు కత్తిరించుకోవాలి.



ముందుగా 2"×10½" వున్న బెల్టు తీసుకుని ఒక హేండిల్ చుట్టూ చుట్టి కుట్టుకోవాలి. ఇప్పుడిక అంతకుముందే కత్తిరించుకునివున్న రెండు పచ్చరంగు గుడ్డలలో ఒకదాన్ని తీసుకుని దాని మీద అద్దం వుంచి నలుపురంగు దారంతో ఎంబ్రాయిడరీ చేసుకోవాలి. అద్దం అవుట్‌లైన్ మాత్రం గొలుసు కుట్టు విధానంలో తెల్లదారంతో ఎంబ్రాయిడరీ చేసుకోవాలి. బ్యాగ్ మీద గీసుకున్న చతురస్రాన్ని ఎరుపురంగు దారంతో ముద్ద కుట్టుతోను, త్రికోణ భాగాన్ని తెలుపురంగు దారంతోనూ ఎంబ్రాయిడరీ చేసుకోవాలి. డిజైన్ అవుట్‌లైన్‌ని నలుపురంగు దారంతో గొలుసుకుట్టు కుట్టుకోవాలి. త్రికోణ భాగం క్రిందనున్న గీతలను ఎరుపురంగు దారంతో లూప్ స్టిచ్ పద్ధతి వుపయోగించి కుట్టుకోవాలి.

ఇప్పుడిక బ్యాగ్ కుట్టుకోవడం ఎలాగో తెలుసుకుందాం. బ్యాగ్ ఇరువైపులూ తీసుకుని పచ్చరంగు గుడ్డకి లైనింగ్‌కి మధ్యలో కాన్వాస్ వుంచి కుట్టుకోవాలి. 3"×10½" పరిమాణంలో మనం యింతకు క్రితమే కత్తిరించి వుంచుకున్న బెల్టుని ఈ బ్యాగ్ అడుగు భాగంలో వుంచి కుట్టుకోవాలి. ఆ తరువాత బ్యాగ్‌కి వున్న మూడు బెల్టులని చేతికుట్టుతో హ్యాండిల్ మీద కుట్టుకోవాలి.

ఇక మిగిలిందల్లా భుజాన వేలాడేసుకుని వెళ్ళేందుకు వీలుగా తయారుచేసుకోవలసిన పట్టీ 30"×1"తో పచ్చరంగు గుడ్డని కత్తిరించుకోవాలి. దీన్ని రెండుసార్లు మధ్యకి మడిచి మిషను మీద కుట్టుకోవాలి. ఇదే విధంగా మరో పట్టీ కూడా చేసుకోవాలి. ఈ పట్టీలని రెండు హేండిల్స్ మీద వర్ణచిత్రంలో చూపినట్లుగా కుట్టుకోవాలి. మామూలు బ్యాగ్‌లకి భిన్నంగా వుండే 'గ్రీన్ బ్యాగ్' చూడముచ్చటగా వుంటుంది. □




"నర జాతి చరిత్ర సమస్తం పరస్పరాహరణోద్యోగం" —అన్నారు మహాకవి. ప్రపంచంలోని ఏ దేశ చరిత్ర చూసినా ఈ మాట అక్షర సత్యమే అని నిరూపిస్తుంది. మన పొరుగు దేశమైన ఆఫ్ఘనిస్థాన్ ఇవాళ్టి పోకడను చూసినట్లయితే ఈ మాటే మనకు గుర్తుకొస్తుంది.

1978 సం॥ ఏప్రిల్‌లో జరిగిన సైనిక విప్లవంలో మహమ్మదు దావూద్ ప్రభుత్వాన్ని కూలద్రోసి ఆఫ్ఘనిస్థాన్ అధికారం తన హస్తగతం చేసుకున్నాడు ప్రెసిడెంట్ నూర్ మహమ్మదు తరాకీ. తరాకీ నాయకత్వంలోని ప్రభుత్వం తీవ్రమైన ఆర్థిక, సాంఘిక సంస్కరణలకు ఉద్యమించడంతో దేశంలోని ఇస్లాం మతాధిపతులూ కొండజాతి సర్దార్లూ తిరగబడడం ప్రారంభించారు. దేశంలో అల్లకల్లోలం చెలరేగింది. ఈ అల్లకల్లోలాలను అణచడంలో ప్రెసిడెంట్ తరాకీ, ప్రధాని ఆఫీజుల్లా అమీన్ మధ్య అభిప్రాయభేదాలు తలెత్తసాగాయి. జూలై చివరలో జరిగిన మంత్రివర్గ పునర్నిర్మాణం వీరిద్దరి మధ్య మరింత అసంతృప్తిని కలిగించింది. చివరకు మహమ్మదు దావూద్ ప్రభుత్వాన్ని కూలద్రోయడంలో తరాకీకి కుడిభుజంగా కృషిచేసిన హాఫీజుల్లా అమీన్ సెప్టెంబర్ పదహారున మరో తిరుగుబాటు జరిపి తరాకీని పదవీచ్యుతుడిని చేసి తను ఆఫ్ఘనిస్థాన్ అధ్యక్షుడైనట్లు ప్రకటించుకున్నాడు.

అధ్యక్ష భవనంలో జరిగిన పోరాటంలో చనిపోయిన వారిలో తరాకీ అంగరక్షకుడు, భద్రతాదళం ప్రధానాధికారి మేజర్ తారాన్ చంపబడ్డారనీ, హోం మంత్రి పతంజార్, సరిహద్దు వ్యవహారాల మంత్రి మేజర్ షెర్జాన్ మజ్‌దూర్యార్‌లను బర్తరఫ్ చేశారని వార్తలు వెలువడ్డాయి. అధికారపక్షం ఖల్క్ పార్టీ పోలిట్ బ్యూరో సమావేశమయింది. ఆ సమావేశంలోనే అమీన్ బలం సంపాదించి తరాకీని గద్దె దింపాడనీ తెలుస్తోంది.

ఇటీవల నూతన ప్రభుత్వ మంత్రి మండలి సమావేశమై ఆఫ్ఘనిస్థాన్‌కు కొత్త రాజ్యాంగాన్ని రూపొందించడానికి ఒక కమిషన్‌ను నియమించినట్లు కాబూల్ రేడియో తెలియజేసింది. రాజ్యాంగ రచనకు నియమించిన ఈ కమిషన్ నాయకుడు ప్రెసిడెంట్ అఫీజుల్లా అమీన్.

*

ఆసియా నుంచి వలస వచ్చేవారి సంఖ్య మీద బ్రిటన్ ఆంక్షలు విధించింది. వలస వచ్చేవారిని అనుమతించడంలో యేటా ఐదోవంతు కోత ప్రకటించింది। ఈ ఆంక్ష రాజకీయవేత్తలలో అనుమానం, అసంతృప్తి రేకెత్తించింది. వివిధ జాతుల మధ్య సయోధ్యను చెడకొడుతుందనీ అంచేత ఇది చాలా అమానుషమనీ పునఃపరిశీలన చేయమనీ పెద్దలు విజ్ఞప్తి చేశారు.

ప్రపంచ సంగ్రామ సమయంలోను, ఆ తర్వాత బ్రిటన్‌కు ఎక్కువగా చవుకలో కార్మికులు కావలసి వచ్చారు. అంచేత శ్వేతేతరులను రమ్మని పదేపదే ప్రకటనలు చేసింది. అయితే ఇది ఎంతోకాలం సాగలేదు. కొన్నాళ్ల తర్వాత వలస వచ్చేవారిని అనుమతించడంలో ఆంక్షలు పెట్టడం ఆరంభమయింది. 1962 వ సం॥లో చట్టం కూడా చేశారు. అప్పటి నుంచి అధికారంలో వున్న ప్రభుత్వం-లేబర్‌పార్టీ అయినప్పటికీ, కన్సర్వేటివ్‌పార్టీ అయినప్పటికీ - వలసవచ్చే శ్వేతేతరుల సంఖ్యను తగ్గించడానికి ప్రయత్నిస్తూనే వచ్చింది.

1971 వ సం॥ చట్టం ద్వారా జాతీయ వివక్షతను చూపడానికి ప్రభుత్వానికి మరికొన్ని మార్గాలు లభించాయి. సిద్ధాంతరీత్యా జాతీయ వివక్షతకు ఆస్కారం లేకపోయినప్పటికీ ఆచరణలో మాత్రం అది ప్రస్ఫుటంగా కనబడుతూనే వచ్చింది.

గత ఎన్నికల ప్రచారంలో మార్గరెట్ థాచర్ నాయకత్వం వహించిన కన్సర్వేటివ్‌పార్టీ-అధికారంలోకి వస్తే వలసదారులను అరికట్టడంలో తీవ్రమైన ఆంక్షలు విధిస్తామని వాగ్దానం కూడా చేసింది।

ఇప్పటి ఆంక్షల ప్రకారం యేటా వలసవచ్చే వారిని అనుమతించడంలో ఐదోవంతు కోత వుంటుంది. అంటే మొత్తం మీద నాలుగువేల నుంచి ఇరవైవేల వరకు వుంటుంది.

ఇంతకు ముందున్న చట్ట దిట్టాల ప్రకారం బ్రిటన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకున్న ఆసియా వాసుల తల్లిదండ్రులు ఆసియా నుంచి బ్రిటన్‌కు వెళ్ళడానికి అనుమతి లభించేది. అలాగే వారి పిల్లలను కూడా అనుమతించేవారు. బ్రిటన్ యువతులను పెళ్ళి చేసుకోవాలనుకునే ఆసియా యువకులను కూడా సులభంగా అనుమతించేవారు. అయితే ఇప్పుడు అమలుకు రానున్న ఆంక్షల ప్రకారం ఇవన్నీ రద్దు కావచ్చు.

మొత్తం మీద ఈ పథక ఉద్దేశం ఆసియా వాసులను తగ్గించి ఆ మేరకు వియత్నాం శరణార్థులను కేటాయించడమే అని కొందరు పరిశీలకులు అభిప్రాయం వెలిబుచ్చారు. ఇప్పటికే పదిహేను వేలమంది వియత్నామీయులకు అనుమతి ఇవ్వడానికి బ్రిటన్ సుముఖత వ్యక్తం చేసింది।

*

బాలలు ప్రస్తుత సమాజదేహపు నుదుటిరేఖలు. భావి భాగ్యోదయానికి అరుణోదయం బాలల సంక్షేమం. దీనిని గుర్తించే మన దేశంలో నెహ్రూజీ జన్మదినాన్ని బాలల దినంగా కొనియాడుతున్నాము. పైగా ఈ సంవత్సరం అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించి వారి సంక్షేమం కోసం ప్రపంచ వ్యాప్తంగా ఎంతో కొంత కృషి జరుగుతూనే వుంది. అయితే ఇటీవల అమ్నెస్టీ ఇంటర్‌నేషనల్ సంస్థ వెలువరించిన వివరాలవల్ల వేనకువేల బాలబాలికలు రకరకాల చిత్రహింసలకు లోనవుతున్నట్లు తెలియవచ్చింది।

ప్రపంచం మొత్తం మీది రాజకీయఖైదీల సంక్షేమం కోసం కృషి చేస్తున్న సంస్థ-అమ్నెస్టీ ఇంటర్‌నేషనల్ సంస్థ. ఈ సంస్థ డెన్మార్క్-శాఖ స్థానిక బాల శరణార్థుల శిబిరంలోని బాలల శారీరక మానసిక పరిస్థితుల మీద ఒక పరిశీలన జరిపింది. ప్రపంచం మొత్తం పిల్లల పరిస్థితిని గురించి కూడా కొన్ని వివరాలు సేకరించింది. ఆసియా, దక్షిణాఫ్రికా ఖండాలలోని కొన్ని దేశాలలోనూ, సోవియట్ కూటమిదేశాలలోనూ ప్రపంచ వ్యాప్తంగా దాదాపు యాభై దేశాలలో పిల్లలపట్ల ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ జరుగుతున్న చిత్రహింసలు మునుపటికన్నా ఇప్పుడు విస్తృతమవుతున్నాయని ఈ వివరాలవల్ల తెలియవచ్చింది.



ఎమ్. యామినీ ప్రదీప్ (నెల్లూరు) పుట్టిన తేది :
**7-11-78** తల్లి పేరు: ఎమ్. అమారాధ.



ఏ. శ్రీధర్ (రాజమండ్రి) పుట్టిన తేది :
**23-11-76** తల్లి పేరు: ఏ. మీనాక్షి.



సి. విటోబాక్రిష్ణ మహేష్ (మద్రాసు) పుట్టిన తేది:
**6-11-77** తల్లి పేరు: సి. భారతి.




ఏ. స్నేహలత (హైద్రాబాదు) పుట్టిన తేది :
**22-11-78** తల్లి పేరు: ఏ. హెలన్ విజయకుమార్.



ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో ఎమ్. యామినీ ప్రదీప్; రెండేళ్ళ గ్రూపులో సి. విటోబాక్రిష్ణ మహేష్; మూడేళ్ళ గ్రూపులో ఎ. శ్రీధర్ 'పుట్టిన రోజు బహూమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురి **తోపాటు**, మొత్తం మీద మూడు గ్రూపుల లోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. డిసెంబర్ సంచికలోని ఈశీర్షికకు ఫొటోలు పంపే వారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) నవంబర్ 5 వ తేదీలోగా మాకు చేరేలా పంప గోరుతున్నాము.

పి. మయూర్ (నెల్లూరు) పుట్టిన తేది :
**5-11-78** తల్లి పేరు: పి. శోభారాజేంద్ర.



... CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop...

# క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది

విడిగా
అమ్మబడవు—
అనుకరణలుంటాయి...
జాగ్రత్త!

కొందరిది తియ్యనిదని వాదిస్తారు
మరికొందరిది ఉప్పనిదని
పట్టుబడతారు. కాని మరుపలేని
మజా రుచిగలదని అందరూ
ఒప్పుకుంటారు.

పార్లే

Krackjack

everest/78/PP/255-tl

క్రాక్‌జాక్ బిస్కట్లు-తియ్యగా, ఉప్పగా, నోరూరించేలా.